# ఆర్గనాన్

హానిమన్ మూలసూత్రములకు
తెలుగు అనువాదము, వివరణము



ది వరల్డ్ టీచర్ ట్రస్ట్

# ఆర్గనాన్

హానిమన్ మూలసూత్రములకు
తెలుగు అనువాదము, వివరణము

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య




ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
విశాఖపట్టణం

తృతీయ ముద్రణ 1995, నవంబరు
ప్రతులు: 2000

వెల రు. 40



ప్రతులకు:
ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
45-40-36/1, అక్కయ్యపాలెం
విశాఖపట్టణం- 530 016



ముద్రణ:
వాణి ప్రింటర్స్
డాబాగార్డెన్స్, విశాఖపట్టణం 530 020
ఫోన్ : 66732

# పరిచయము

శాస్త్రముల పరమార్థము లోక ప్రయోజనము. వీటిని సక్రమముగా అవగాహనము చేసికొనుటకు చక్కని అధ్యయనము ఆవశ్యకము. శాస్త్ర జ్ఞానము సద్వినియోగమైనపుడే తత్ప్రయోజనము సిద్ధించును. మహనీయుల ద్వారా సాధించబడి, ప్రసాదించబడిన శాస్త్రములు సుఖశాంతుల నొసగును కనుక అవి మార్గ దర్శకములు.

17వ శతాబ్దమున జర్మనీ దేశములో జన్మించి, అలోపతి వైద్య విధానమున ఖ్యాతి నార్జించిన డాక్టర్ శామ్యూల్ హానిమన్ తపస్సు, దీక్ష, త్యాగము ఫలితముగా హోమియో వైద్య శాస్త్రము లోకమునకు ప్రసాదించబడినది. "తమను తాము లోకహితమునకు అర్పించుకొనువారు చిరంజీవులు" అను సత్య సూత్రమునకు డాక్టర్ హానిమన్ జీవితమొక సంకేతము. ఆ మహనీయుడు హోమియో వైద్య రంగమున పూజ్యనీయుడయ్యెను. ఆయన రచించిన "ఆర్గనాన్" (సూత్ర స్థానము) ఒక భగవద్గీత వంటిది, ఒక బైబిల్ వంటిదను సత్యము మాస్టర్ ఇ.కె "ఆర్గనాన్" రచించిన అపూర్వమైన ఈ వ్యాఖ్యాన గ్రంధమున స్పష్టముగ గోచరించును.

ది వరల్డ్ టీచర్ ట్రస్టు (జగద్గురు పీఠము) వ్యవస్థాపకులగు మాస్టర్ ఇ.కె. (కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య) హోమియోపతీని గృహ వైద్యముగ తొలుత ప్రారంభించిరి. దానినొక సేవా కార్యక్రమముగ నెలకొల్పిరి. ఉచిత హోమియో సేవను ఒక పవిత్రమైన ఉద్యమముగా రూపొందించిరి. ఆరోగ్య ధర్మములు, హోమియో విజ్ఞానమును నేర్పి, వందల మందిని ఆరోగ్య రంగమున సుశిక్షితులను చేసిరి. మరికొంత మందిని మాస్టర్ ఇ.కె వైద్యులుగా తీర్చిదిద్దిరి. తనంతటి వారిగా తనను విశ్వసించిన వారిని తయారు చేసి, వారిని సామాజిక కళ్యాణమునకు సమర్పించుట మాస్టర్ ఇ.కె. దివ్య ప్రణాళికలో ఒక భాగము.

ఇ.కె సంకల్పము కారణముగ నేడు జగద్గురు పీఠం ఆధ్వర్యములో 50 మాస్టర్ హోమియో వైద్యాలయములు బాధ్యతాయుతముగా నిర్వహించబడి సేవల నందించు చున్నవి. యోగ, వేద, ఆధ్యాత్మిక, జ్యోతిష విద్యా రంగములకు సంబంధించి మాస్టర్ ఇ.కె. నూరుకు పైగా గ్రంథములను రచించిరి. అటులనే "హోమియో గృహ వైద్యము" "శారీర గుణదీపిక", "హోమియో వైద్య విధానము", "న్యూ ఇరా హీలింగ్", "లెసన్స్ ఆన్

హోమియోపతి", "ఆయుర్వేద" అను ఆరోగ్య రంగమునకు సంబంధించిన పుస్తకములను కూడా ఆయన రచించిరి.

ఈ పుస్తకములన్నిటిని జగద్గురు పీఠము ప్రచురించి అందుబాటులో నుంచినది. అంతియే గాక ఆయన శిష్యులు డాక్టర్ కె.యన్. శాస్త్రి (విశాఖపట్టణము), డాక్టర్ జి.యస్.ఆర్. మూర్తి (శ్రీకాకుళం), డాక్టర్ పి. జగన్మోహన రావు (హైద్రాబాద్) ప్రభృతులు వ్రాసిన హోమియో పుస్తకములను గూడ ఈ సంస్థ ప్రచురించినది.

హోమియో వైద్య విధానముపై ఆసక్తి గలవారికి మాష్టర్ గారి హోమియో రచనలు, హోమియో ప్రసంగములు ఎంతయో తోడ్పడునని మా విశ్వాసము. ముఖ్యముగ పవిత్రమైన ఈ వ్యాఖ్యాన గ్రంథము " ఆర్గనాన్" హోమియో వైద్య విజ్ఞానమును, సమన్వయమును, సదవగాహనము నివ్వగలదని మా ఆకాంక్ష!

తేది: 22-8-1995
విశాఖపట్టణము

చింతలపాటి సత్యదేవ్
ది వరల్డ్ టీచర్ ట్రస్టు

# కులపతి బుక్ ట్రస్ట్

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య గారిచే రచింపబడిన అన్ని గ్రంథములపైనను హక్కులు కలిగియున్న 'కులపతి బుక్ ట్రస్టు,' 14-38-2, రాధామాధవమ్, ముప్పిడికోలని, విశాఖపట్టణము - 530 002 నకే ఈ గ్రంథము యొక్క హక్కులు చెంది యున్నవి. ఇందలి ఏ అంశమునైనను, ఏ విధమైన ముద్రణ వినియోగమునకైనను ఈ ట్రస్టు వారి లిఖితమైన అనుమతిని పొందవలెను.

ఈ గ్రంథమును ప్రచురించు హక్కు 'ది వరల్డ్ టీచర్ ట్రస్ట్', 14-38-2, రాధామాధవమ్, ముప్పిడి కోలనీ, విశాఖపట్టణము - 530 002 వారికే అనుమతింపబడినది.

యుగముల తరబడి మానవునకు ప్రసాదింపబడిన శాశ్వత జ్ఞానమును వెదజల్లుటకై స్థాపింపబడినదీ గ్రంథ ప్రచురణ సంస్థ. ఈ గ్రంథముల వలన కలుగు ఆదాయము ఇట్టి గ్రంథముల పునః ప్రచురణ చేసి సత్యమును వెదజల్లుటకై మాత్రమే వినియోగింపబడును.

# విషయసూచిక

# గ్రంథ పరిచయము

ఇది హోమియోపతీ శాస్త్రమునకు ప్రమాణమైన మూలగ్రంథము. ఇదే ఈ శాస్త్రమునకు ఆదిగ్రంథము. దీనిని అనుసరించి మందులను వాడినప్పుడు మాత్రమే హోమియోపతి వైద్యము అనబడును. దీనిని పాటింపక సొంతముగా మెటీరియా మెడికా చదువుకొని హోమియోపతి మందులను వాడినను అది హోమియోపతి వైద్యము కాదు. ఈ గ్రంథము హోమియోపతిని దర్శించి ప్రపంచమునకు ప్రసాదించిన మహాద్రష్టచే రచింపబడినది. ఆయన జర్మనీ దేశము వాడు. ఆయన పేరు సామ్యూల్ హానిమన్. ఆయన మొట్టమొదట పేరు ప్రఖ్యాతులు గడించిన అలోపతి వైద్యుడు. అలోపతి విధానమున చాల లోపములు కనుపించుట చేతను, రోగులకు రోగ నివారణము సంపూర్ణముగా జరుగదని తెలియుట చేతను తనకు నచ్చక వైద్యము చేయుట మానుకొనెను. రోగ పీడితులైన మానవులనుగూర్చి బాధపడి, చాల సంవత్సరములు తపస్సు చేసి ఈ శాస్త్రమును సాధించి మనకు ప్రసాదించెను.

హానిమన్ కనిపెట్టిన మూలసిద్ధాంతములను ఈ దిగువ విధములుగా పేర్కొన వచ్చును:

1. దేహమునందు కనిపించు బాధలన్నియు నొకేవ్యాధికి ఫలితములే కాని అనేక వ్యాధులు కావు. వానిని మాన్పుటకు మందులు వాడినచో తాత్కాలి కోపశమనమేకాని నివారణము కలుగదు.

2. వ్యాధి అనునది మానవుని ప్రాణమును, మనస్సును ఆశ్రయించి ఉండును కాని దేహము నందును, దేహభాగము లందును ఉండదు.

3. ఔషధమును రోగియందున్న ప్రత్యేక లక్షణ ములను బట్టి వాడవలసినదే గాని బాధలను బట్టి వాడరాదు.

4. మందులు ప్రాణశక్తిని మేల్కొలుపుటకే గాని రోగములను తగ్గించుటకు కాదు. రోగములను నివారణ చేయునది మనలోని ప్రాణశక్తియే కాని మందులు కావు.

5. ఆరోగ్యవంతుని ప్రాణ ప్రవృత్తిలో మార్పులను పుట్టింపగల పదార్థములే ఔషధములు. ఈ మార్పులు వేదనలను వెలిబుచ్చును. రోగము కూడ వేదనలనే కలిగించును.

6. రోగి వేదనలకును, ఔషధము పుట్టించు వేదనల

కును సామ్యమున్నపుడు ఆ యౌషధము ఆ రోగికి రోగనివారణము కలిగించును.

7. ఔషధమును వీలయినంత తక్కువ పరిమాణమున ద్రవీకరించి వాడవలెను. మోతాదులను కూడ అవసరమును బట్టియే వాడవలెను. ఒక మోతాదునకు గుణము కనిపించినపుడు రెండవ మోతాదును వాడరాదు. మరల బాధలు కనిపించినపుడే వాడవలెను.

8. ఎట్టి వ్యాధులైనను మానసిక ప్రవర్తనలో దోషము కలిగి నపుడే సంక్రమించు చున్నవి గాని వాతావరణమును, పరిసరములను బట్టి గాదు. ఒక మారు సంక్రమించిన తరువాత వారి సంతతికి కూడ జన్మతో సంక్రమింప వచ్చును.

9. నిజమైన వ్యాధులు పరిసరములలోని అంటు వ్యాధులు మొదలైన వానిని ఆకర్షించి లొంగదీయునట్టి దౌర్బల్యములుగా మనలో నుండును. అవి లేనివారికి అంటువ్యాధులు సోకవు.

10. ఆ నిజమైన వ్యాధులు దీర్ఘవ్యాధుల విపాకముల రూపమున మన స్వభావమును అంటి యుండును. అవి ముఖ్యముగా మూడు విధములు. వాని పేర్లు: సోర, సైకోసిస్, సిఫిలిస్. హానిమన్ శిష్యులలో కొందరి మతము ననుసరించి

నాలుగవది గూడ నున్నది. దాని పేరు ట్యూబర్క్యులోసిస్. (దీనికిని, అలోపతివారు పేర్కొనునట్టి ట్యూబర్క్యులోసిస్ కును సంబంధము లేదు)

11. ఈ దీర్ఘవ్యాధులలో నేదో యొకటి యున్న వారికే మిగిలిన వ్యాధు లనబడు బాధలు, అంటువ్యాధులు కలుగుచుండును.

12. సమానమైన లక్షణములు గల మందును ప్రయోగించినపుడే ఈ వ్యాధులు నివారణమగును. వ్యతిరేకించు లక్షణములు గల మందులు వాడినచో తాత్కాలికోపశమనము కలిగి వ్యాధి పెరుగునే కాని నివారణము కాదు.

ఈ మూల సిద్ధాంతములతో నిర్మాణము చేసిన తన వైద్యశాస్త్రమును హానిమన్ సూత్రముల రూపమున రచించెను. గ్రంధము మొత్తము 292 సూత్రములలో రచింపబడినది. ఇందు వైద్య విధానమే కాక వైద్యుడు గమనించ వలసిన విషయములు, రోగిని పరీక్షించి నివేదికను తయారుచేసి నిదానము (diagnosis) చేయు విధానము, ఔషధ నిర్ణయము చెప్పబడినది. రోగి అవలంబింప వలసిన హితచర్య, వ్యాధుల వర్గీకరణము, ఔషధ గుణములను కనిపెట్టు పద్ధతి, ఔషధములను తయారుచేయు పద్ధతి

కూడ చెప్పబడినవి. దీనిని సక్రమముగా అధ్యయనము చేసి మనసునకు ఎక్కించు కొనిన వెనక మెటీరియా మెడికా చక్కగా చదువుకొని మాత్రమే వైద్యము చేయవలెను.

ఈ గ్రంథము మూలము జర్మను భాషలో వ్రాయ బడినది. నలుగురు శాస్త్రజ్ఞులు వేరు వేరుగా ఆంగ్లమున కనువదించిరి. ఇద్దరు చక్కని లఘు టీక వ్రాసిరి. ఒకరిద్దరు పెద్ద వ్యాఖ్యానములు వ్రాసిరి. జేమ్సు టైలర్ కెంట్ అను సుప్రసిద్ధ శాస్త్రాచార్యులు ఇందలి శాస్త్రమర్మములను వివరించుచు "Lectures on Homoeo Philosophy' అను పేర నుపన్యసించి మహోపకారము చేసిరి. వాని నన్నిటిని పరిశీలించి, సూత్రముల యందలి అభిప్రాయమును చక్కగా వివరించి చేయబడిన అనువాదము, వివరణము ఈ గ్రంథమున సులభమైన తెలుగు భాషలో చదువరుల కొరకు సంసిద్ధము చేయబడినది.

ఎక్కిరాల కృష్ణమాచార్య

# ఆర్గనాన్

## వైద్యున కుండదగిన లక్షణములు

**సూత్రము 1:** వైద్యుని ముఖ్యమైన కర్తవ్యము రోగులకు ఆరోగ్యము చేకూర్చుట. దానినే వైద్యము అందురు.

వివరణ: ఇందు రోగికి వైద్యము చేయుటయే గాని రోగమునకు వైద్యము చేయరాదని స్థాపింపబడినది. రోగికి వైద్యము చేయుట అనగా ఆరోగ్యము చేకూరు విధాన మవలంబించుటయే గాని రోగమును పోగొట్టుటకు యత్నించుట కాదు. ప్రాణమునకు, దేహమునకు పొత్తు కుదురుట ఆరోగ్యము. అది సహజ స్థితి. దానిలో కలిగిన మార్పులే వ్యాధి అనబడును కాని వ్యాధికి వేరుగా అస్తిత్వము లేదు. వ్యాధుల ఫలితములగు కడుపు నొప్పి, తలనొప్పి మొదలగు వాని నుద్దేశించి మందులను వాడరాదు. మందులు రోగి శరీరములోని పరిస్థితిని సహజ స్థితికి మార్చుటకే గాని రోగములను పోగొట్టుటకు కాదు. సహజ స్థితి లోనికి మారినపుడు రోగ మనబడు లక్షణము దానంతట అదియే మాయమగును.

పైపూతలు మున్నగు వైద్యములు హోమియోపతిలో పనికి రావు.

**సూత్రము 2:** ఆదర్శవంతమైన వైద్యమున వ్యాధి నివారణము శీఘ్రముగను, సౌమ్యముగను, సంపూర్ణము గను జరుగవలెను. సులభముగా వివరింపగల విధానమున జరుగవలెను.

వివరణము: శీఘ్రము: తేలుకాటు, పాముకాటు, విషాహారము, విద్యుత్ ఘాతము (electric shock) మున్నగు సందర్భములలో ఔషధము క్షణములలో రోగిని రక్షింపవలెను. కలరా మున్నగు సందర్భములలో నిమిషములలో పనిచేయ వలెను. జ్వరములకు గంటలలో లేక దినములలో పనిచేయవలెను. టైఫాయిడు మున్నగు వ్యాధులలో వారము దినములలో నివారణము కావలెను. వైద్యము బాగుండక టైఫాయిడు చిక్కుబడినచో కొన్ని వారములు పట్టవచ్చును. ఉబ్బసము, క్షయ మున్నగు దీర్ఘవ్యాధుల వైద్యము మాత్రము మాసములో, సంవత్సర ములో పట్టును. కొందరు హోమియో మందులు నిదానముగా పనిచేయుననియు, వెంటనే తగ్గవలసిన విపత్కర వ్యాధులలో పనికిరావనియు నభిప్రాయపడుదురు. అది సరికాదు. వ్యాధి వేగమును బట్టి మందు పనిచేయు వేగముండును.

సౌమ్యము: దీనివలన శస్త్రచికిత్స, కాల్చుట, వాతలుపెట్టుట, రసాయనిక పదార్థముల స్పర్శతో టాన్సిల్సు, పులిపిర్లు ధ్వంసము చేయుట, యంత్రములతో చీము, రక్తము పిండుట, జలగలను పట్టించి రక్తము పీల్పించుట మున్నగు మోటు వైద్యములు పనికిరావు. జీడిపెట్టుట, దేహమందు కొంచెము ముక్క కోసి పరీక్షకు పంపుట, ఎక్సు-రే, రేడియం, కోబాల్టు, అల్ట్రావైలట్, ఇన్‌ఫ్రారెడ్ కిరణములతో చికిత్సచేయుట కూడ రాక్షసములైన పద్ధతులు. అట్లే పిచ్చివారికి కరెంటుషాక్ చికిత్స చేయరాదు. ఈ పశువిధానముల వలన రోగి నీరసించుటయేగాక అటుపైన మందులు పనిచేయు నవకాశము కూడ లేకుండ పోవును.

సంపూర్ణము: ఆస్ప్రో వాడినచో తలనొప్పి తగ్గును. మరల వచ్చును. మాగ్సల్ఫ్ వాడినచో విరేచనములై పొట్ట శోధింపబడును. కాని మరల విరేచనబద్ధక మట్లే ఉండును. క్వినైన్ వాడినచో మలేరియా జ్వరము అణచిపెట్టబడును. మరల మరల వచ్చుచుండును. ఇట్లు మందులను మరల మరల వాడుచున్నచో మొదటనున్న వ్యాధి దేహమున ముదిరిపోవును. ఈలోపున తరచుగా వాడుచున్న మందులవలన క్రొత్త వ్యాధులు పుట్టును. ఇది నివారణ

మార్గము కాదు. హోమియోపతిలో ఇట్టి విధానము అంగీకరింపబడదు.

**సులభముగా వివరింపగల విధానము:** రోగిని పరీక్షించి ఎట్లు నిర్ణయించితివో వివరింప గలిగి ఉండవలెను. వానికి ఔషధ నిర్ణయము నెట్లు చేసితివో కూడ వివరింపగలిగి ఉండవలెను. రక్త పరీక్ష, మూత్రపరీక్ష మున్నగు మార్గములలో రోగము పేరు నిర్ణయించుటకు శాస్త్రీయమైన ప్రయత్నము జరుగునే కాని రోగికి కావలసిన బాధా నివారణమునకు, వ్యాధి నివారణమునకు మార్గము లభింపదు. మూత్రమున చక్కెర యున్నది, శుక్ర కణము లున్నవి, చీము కణము లున్నవి, ఈ కురుపులో క్యాన్సర్ కణము లున్నవి మున్నగు సాంకేతిక రోగ నిర్ణయ విధానములవలన వైద్యుని ఘనత తప్ప రోగికి బాధా నివారణము కలుగదు.

**సూత్రము 3:** వైద్యుడు దర్శింపవలసిన ప్రధానాంశములు నాలుగు.

ఎ) వ్యాధియందు నివారణ చేయువలసిన సామాన్యాంశము లేవి, ప్రత్యేకింపవలసిన అంశము లేవి?

బి) ఔషధములలో నివారణము కలిగించు సామాన్యాంశము లేవి, ప్రత్యేకించు నంశము లేవి?

సి) చక్కని హేతువుతో ఔషధముల నివారణ శక్తులను వ్యాధులలో నివారింపవలసిన అంశములకు గురిపెట్టుట ఎట్లు?

డి) నివారణమునకు విఘ్నములను గ్రహించి తొలగించుట ఎట్లు?

వివరణము: ఎ) వ్యాధులలో నివారింపవలసిన సామాన్యాంశములు: నివారింపవలసినవి బాధలే గాని శరీర భాగముల యందలి ధాతువులలోని రసాయనికములైన మార్పులు కాదు. మధుమేహ రోగిని పరీక్షించినచో మూత్రమున చక్కెర పోవుచుండును. దానిని రసాయని కముగా కనపడకుండ చేయుటకు ఇన్సులిన్ ప్రయో గింతురు. దీని వలన లాభము లేదు. ప్రతిదినము మరల చక్కెర కనబడకుండ చేయుటకు ఇన్సులిన్ వాడుచునే యుందురు. ఇచట నివారణ చేయుటకు యత్నింప వలసినది చక్కెరను కాదని తెలియుచున్నది. ఆ రోగికి దాహము, ఒళ్ళు నొప్పులు, నీరసము, చెమటలు, గుండెదడ, తలనొప్పి, అయోమయముగా నుండుట, పనిచేయ బుద్ధిపుట్టకుండుట, నిద్ర పట్టకుండుట మున్నగు లక్షణములలో కొన్ని యుండును. వానిని వేదనలు అందురు. నివారింప దగినవి ఈ వేదనలు మాత్రమే. వానికి మందు వాడినచో రోగికి బలము చేకూరును. ఆరోగ్యము

చక్కబడును. అటుపైన కొంతకాలము వరకు మూత్రమున చక్కెర కనిపించుచునే యుండును. దానిని చూచి భయపడరాదు. క్రమముగా అది కూడ తగ్గిపోయి మరల కనిపించదు. కనుక తగ్గించవలసినది వేదనల సముదాయము గాని ధాతువులలోని మార్పులు కాదు.

**ప్రత్యేకింపవలసిన అంశములు:** పై చెప్పిన మధుమేహ రోగి విషయమున ఈ దిగువ అంశములను పరిశీలింపుము: అతనికి ఎండగా నున్నచో బాధగా నుండునా, లేక చలిగాలి తగిలినచో నుండునా? శ్రమపడిన వెనుక బాధలెక్కువగునా, నిద్రించి లేచిన వెనుక ఎక్కువగునా? ఉదయమున బాధగా నుండునా, సాయం కాలమా, పగటి యందా, రాత్రియందా? అతనికి మాదక ద్రవ్యము లిష్టమా, కాఫీ, టీ మున్నగు నుత్తేజక పదార్థములా? తీపి యిష్టమా లేక ఉప్పెక్కువ తినునా? నలుగురిలో నుండవలెనని కోరునా, ఒంటరితనము కోరునా? కోపిష్టియా, అనుమాన పడువాడా, ఈర్ష్యపడువాడా, లేక తనపై జాలిపడవలెనని కోరునా? తీవ్ర స్వభావమా లేక ప్రతిదానికిని భయపడువాడా? ఈవిధమైన పరిశీలన వలన రోగియొక్క వేదనా సముదాయమును ప్రత్యేకింప గలుగుదువు. మిగిలిన వారికన్న అత డేవిధముగా ప్రత్యేకత చూపుచున్నాడో తెలియును. ఇట్టి పరీక్ష లేనిచో ఔషధ నిర్ణయము సాధ్యము

కాదు.

బి) ఔషధములలో నివారణము కల్గించు సామాన్యాంశములు: ఒక ఔషధములోని రసాయనిక నిర్మాణము, రంగు, రుచి, వాసన మున్నగు వానివలన ఔషధ గుణములను నిర్ణయింప జాలము. ఇన్నిటికన్నా ఔషధ గుణములు వేరుగా నుండును. ఆరోగ్యవంతుని దేహమున ప్రయోగము చేసినచో ఔషధము ఏమయిన మార్పులను కలిగింపగలదా చూడవలెను. అట్లు కలిగింప గల సామర్థ్యమే అందలి వ్యాధి నివారణ కారణము, అతని దేహమందలి ప్రాణశక్తిని ప్రోత్సహించగల శక్తియున్నచో దానిని ఔషధమందురు. అట్టి పదార్థమును ఆరోగ్యవంతునిపై ప్రయోగించినచో కొన్ని ప్రబలములైన మార్పులు పుట్టును. అవియే వేదనలు (Symptoms), వాని మొత్తమును వేదనాసముదాయము అందురు. అదే మందునకు ఎప్పుడునూ అదే వేదనా సముదాయమును పుట్టించు సామర్థ్యము ఉండును. అది యింకొక మందునకు ఉండదు. ఆరోగ్య వంతునకు ప్రతిదినము బ్రయోనియా అను మందు ఇచ్చినచో వానికి క్రమముగా తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, దాహము, అసంతృప్తి, అయోమయముగా నుండుట, పనిచేయ బుద్ధిపుట్టక ఉండుట కలుగును. వీనిని పుట్టింపగల సామర్థ్యమే ఆ మందునందు గల

ప్రాణశక్తి, అదియే ఆ మందులోని ఔషధ గుణము. దాని వలననే వ్యాధులు నివారణ మగును.

ఔషధములలో నివారణము కలిగించు ప్రత్యేకాంశములు: బ్రయోనియా వాడిన ఆరోగ్య వంతునకు దాని వేదనలలోని ప్రత్యేక లక్షణములు కూడ వ్యక్తమగును. అతని తలనొప్పి, ఒళ్ళు నొప్పులు గట్టిగా నొక్కించు కొన్నచో చమ్మగా నుండును. తలకు గుడ్డ బిగించినచో తగ్గినట్లుండును. చల్లని నీరుగాని, పానీయములుగాని అతిగా త్రాగవలెనని యుండును. చలిగాలి తగిలినను, చన్నీటితో దేహము కడిగికొనినను సుఖముగా నుండును. ఎండ, వేడిగాలి భరింప లేడు. దేహము బరువుగా, మనస్సు సోమరిగా నుండును. పనిచేయ బుద్ధి పుట్టదు. కదలకుండ పండుకొని చూచుచున్నచో ఆనందముగా నుండును. రాత్రి తొమ్మిది గంటలు అయినంతనే అన్ని బాధలు నెక్కువగును. దగ్గు ప్రారంభమగును. ఎవరితోనూ మాటాడ బుద్ధి పుట్టదు. ఇవి బ్రయోనియాకు మాత్రమే ప్రత్యేక లక్షణములు. ఇట్లు ప్రతి ఔషధమునను గమనింపవలెను. మిగిలిన మందులకన్న అది ఎట్లు ప్రత్యేకత గలిగియున్నదో తెలియవలెను. ఈ ప్రత్యేకతను గమనింపనిచో ఔషధమును రోగికి నిర్ణయించుట సాధ్యముకాదు.

సి) చక్కని హేతువుతో ఔషధముల నివారణ శక్తులను వ్యాధులలో నివారింపవలసిన అంశములకు గురిపెట్టుట: ఈ రెండు విధములయిన పరిశీలనల సహాయమున ఏ ఔషధము యొక్క ప్రత్యేక లక్షణములతో ఏ రోగియొక్క ప్రత్యేక లక్షణములు సారూప్యము చెంది యున్నవో గమనింపవలెను. ఆ ఔషధమును ఆ రోగికి వాడవలెను. వాడినచో అతని తత్త్వములోని ప్రత్యేక లక్షణములు మాయమగును. దానితో సామాన్య లక్షణము లగు బాధలుకూడ మాయమగును. పై నుదహరింపబడిన మధుమేహ రోగి ప్రత్యేకతలకు బ్రయోనియా ప్రత్యేకతలు సరిపోవుచున్నవని సులభముగా తెలియుచున్నది. వానికి బ్రయోనియా వాడినచో ఒళ్ళు నొప్పులు, తలనొప్పి మున్నగు.ప్రత్యేక వేదనలతోపాటు మధుమేహము కూడ నివారణ మగును. వేదనా సముదాయము ఏవిధముగా సారూప్యము చెందియున్నదో వివరించుట సులభము.

డి) నివారణమునకు విఘ్నములు: ఔషధ నిర్ణయము తిన్నగా నున్నను, పొటెన్సి, మోతాదు సరిగా వాడినను నివారణమునకు బాధకములైన అంశములు మరికొన్ని యున్నవి. వానిని చక్కగా వివరించి రోగి దినచర్యలో పరిహరింప జేయవలెను.

1. ఆహార నియమము పాటింపనిచో మందు

పనిచేయదు. ఉల్లిపాయ, వెల్లుల్లి, ఏలక్కాయ, లవంగము, యూకలిప్టస్ ఆయిల్, అమృతాంజనము, కర్పూరము, మెంథాల్, సాంబ్రాణి, అగరువత్తులు, సుగంధ ద్రవ్యములు, అత్తరు, సెంటు వాడరాదు. తూజా అను మందు ఉల్లిపాయతో విరుగుడు అగును. కేమోమిల్లా, కాఫీ అను మందులు వాడినపుడు కాఫీ త్రాగరాదు. క్యూప్రమ్ మెటాలికం వాడినపుడు నూనె తగులరాదు. ఈవిధముగా పథ్యము పాటింపవలెను.

2. నిద్ర మేల్కొనుట, అధిక శ్రమ, దుఃఖము, కోపము మున్నగుకారణములుగా మందు విరుగుడు అగును.

3. వీర్యనష్టమునకు వైద్యము జరుగుచుండగా స్త్రీ సాంగత్యము పనికిరాదు.

4. మరియొక మందును గాని, ఇతర వైద్య ప్రక్రియలను గాని చేయరాదు. అట్లే పొగాకు, మద్యము వాడరాదు.

5. అతి దుర్వాసన, ఫ్యాక్టరీ పొగ, రసాయనిక శాలలు, గనులు మున్నగు ప్రదేశములలో నివాసమున్నవారికి, పనిచేయు వారికి మందులు తిన్నగా పనిచేయవు. మూర్ఛవ్యాధులు, మన శ్చాంచల్యము కలవారు రాత్రి డ్యూటీ ఉద్యోగములు చేయుచున్నచో మందులు

పనిచేయవు. ఇట్టి విఘ్నములను రోగికి వివరించి వైద్యుడు పరిహరింపవలెను.

**సూత్రము 4:** అనారోగ్యము కలిగించు కారణము లెట్టివో తెలిసికొని వాని నుండి తప్పించుకొను విధానమును ఆరోగ్యవంతులకు వివరింపవలెను.

వివరణము: వైద్యుని బాధ్యత రోగ నివారణమొక్కటే కాదు. ఆరోగ్యవంతులను రోగగ్రస్తులు కాకుండ కాపాడుకొను పద్ధతులను తెలియజేయుట కూడ వాని బాధ్యతయే. ఈ అంశము ఆయుర్వేద శాస్త్రమును బోధించు ప్రాచీన గ్రంథములలో స్వస్థవృత్తము అను పేర వివరింపబడినది. దానిని సంగ్రహముగా నిట్లు పేర్కొన వచ్చును.

ప్రతిదినము బ్రాహ్మీ ముహూర్తమున (ఉదయము 4-30 గంటలకు) లేచుట, దేహమునకు చమురు రాచుకొనుట, పండ్లు తోముకొని నోరు పరిశుభ్రము చేయుట, కొంచెము వ్యాయామము, స్నానము, ఉదికిన వస్త్రములు ధరించుట, బాటను పోవునపుడు పాదరక్షలు, తలకు టోపి ధరించుట చేయవలెను. ఆహారము ప్రతిదినము ఒకే సమయమునకు భుజింప వలెను. ఆకలి దప్పులకు సరిపోవునంత భుజింపవలెను. భోజనానంతరము

నడచినను, మాటాడినను, నవ్వినను, దగ్గినను, ఆయాసము కలుగకుండ నంతవరకే భుజింపవలెను. ఆహారము, విశ్రాంతి, నిద్ర, పరిశ్రమ సమపాళముగా వేళలు తప్పకుండ చూచుకొనవలెను. వండిన పదార్థములను అంగడులలో కొని భుజింపరాదు. పది మందికి మించి జన సమర్దము చేరినచోట తయారుచేసిన భోజనమునందు పరిశుభ్రత పాటింపబడుట కష్టము కనుక భుజింపరాదు. తెలియని చెట్టుపుల్ల త్రుంచి పండ్లు తోమరాదు. (విషపు చెట్లుండవచ్చును). పుట్టలు, చీమల కన్నములు, చెట్లగుబుర్లు సమీపమున మలమూత్ర విసర్జన చేయరాదు. (విషక్రిములుండవచ్చును).

**సూత్రము 5:** దీర్ఘవ్యాధులు గల రోగులను ప్రత్యేకముగా గుర్తించి పరిశీలింపవలెను.

**వివరణము:** అలోపతి శాస్త్రమున దీర్ఘవ్యాధుల విజ్ఞానము లేదు. వైద్యము సక్రమముగా జరుగక మొండిపడిన వ్యాధులను, మందులు పలువిధములుగా దీర్ఘకాలము వాడుటవలన చెడిపోయిన వ్యాధులను మాత్రము దీర్ఘవ్యాధులని వారనుకొందురు. కాని దీర్ఘవ్యాధులు హోమియోపతిలో ప్రత్యేకించి చెప్పబడినవి. గజ్జికురుపులు అణచిపెట్టబడుట వలన "సోరా" అను వ్యాధి కలుగును. గనోరియాను అణచిపెట్టుట వలన

"సైకోసిస్" అను దీర్ఘవ్యాధి కలుగును. "సిఫిలిస్" అణచిపెట్టుటవలన సిఫిలిస్ అనబడు దీర్ఘ వ్యాధి కలుగును. మలేరియాను చిరకాలము అణగద్రొక్కుట వలన "ట్యుబర్క్యులోసిస్" అను దీర్ఘవ్యాధి కలుగును. ఈ నాలుగును ప్రత్యేకమైన దీర్ఘవ్యాధులు. సరిఅయిన వైద్యము దీర్ఘకాలము జరుగనిచో ఇవి తగ్గవు. ఇవి ఉండుటవలన చీటికి మాటికి పెక్కు చిల్లర వ్యాధులు వచ్చుచు పోవుచు రోగిని దుర్బలుని చేయుచుండును. పుష్టికరమైన ఆహారము బలమీయదు. వంటపట్టదు. జీర్ణము కాదు. టానిక్కులు ఎన్ని పుచ్చుకొన్నను, విటమిన్లు మొదలగునవి వాడినను పుష్టి కలుగదు. ఎన్ని ఆరోగ్య సూత్రములను పాటించి ఎంత జాగరూకత వహించినను రోగిష్టిగనే ఉండిపోవును. వానికున్న రోగమేమో అంతుపట్టదు. అలోపతి విధానంలోని రోగపరీక్షల కందదు. కాలయాపనము జరిగి చివరకు ఈ దీర్ఘవ్యాధులు ముదిరి ప్రధాన దేహభాగముల నాక్రమించును. గుండెజబ్బు, లివరు జబ్బు, ఊపిరితిత్తుల జబ్బు, క్యాన్సరు, క్షయ, మధుమేహము, మహావ్రణములు, గ్యాంగ్రిన్ మున్నగు వానిలో నొక రూపము ధరించి రోగిని చంపును. ఈ రూపములలో నేవియును అసలైన వ్యాధికాదు కనుక వైద్యుడు వీనితో పోరాడినను లాభము లేదు. వీటి కన్నిటికిని మూలకారణములైన పై నాలుగు



వ్యాధులను దీర్ఘ వ్యాధులుగా గుర్తించి వివరించుటయే కాక వాని నివారణ విధానము కూడ హోమియో శాస్త్రమున సమగ్రముగా సాధింపబడినది.

**సూత్రము 6:** ఒక వ్యాధియొక్క ప్రత్యేకతను గమనించుటకు వైద్యుడు రోగియందలి ఆరోగ్యస్థితికన్న భిన్నములైన లక్షణములను పట్టుకొనవలెను. ఇవి వేదనల రూపముననను వికారములైన లక్షణముల రూపముననను ఉండును. గమనించుటకు వీలైనట్లుగనే యుండును. వీని సముదాయమును కూర్పు చేసినచో వేదనా సముదాయము (totality of symptoms) అందురు. ఇవి ఇంద్రియ ప్రవృత్తులలోను, మనస్సు యొక్క ప్రవృత్తిలోను కనుపించుమార్పులు కనుక వైద్యుడు తన ఇంద్రియముల సహాయముననను, మనసు సహాయముననను మాత్రమే పట్టుకొనగలడు. (యంత్రపరీక్షల సహాయమున వీనిని పట్టుకొనలేడు) ఇట్టి ప్రవృత్తుల మార్పులతో మాత్రమే వైద్యుని పరిశీలన ప్రాముఖ్యము వహింపవలెను. వీనిని పరిశీలించు నేర్పుతోనే వ్యాధియొక్క ప్రత్యేకతను నిర్ణయింపవలెను. ఈ ప్రత్యేక పరిశీలన చేయుటలో తన నిర్ణయమునకుగాని, సాంకేతికమైన ఊహాగానమునకుగాని తావీయరాదు. ఇతర రోగుల లక్షణములతో సామ్యమును

సాధింప యత్నించుటకు వీలులేదు. ఇష్టాయిష్టములు పనిచేయరాదు. పాక్షిక దృష్టి మాని పరిశీలించువాడు తన బుద్ధితో నిర్ణయము చేయడు. అతి సూక్ష్మములైన ఊహాంశములు అనుభవముతో జతపడవు కనుక అవి వ్యర్థములని అతడు గ్రహించును.

వివరణము: ఆరోగ్యవంతుని జ్ఞానేంద్రియ ప్రవృత్తులు ఐదు. చూచుట, వినుట, రుచి చూచుట, స్పర్శ తెలియుట, వాసన తెలియుట. ఆరోగ్యము బాగున్నంతవరకునివి సహజముగా పనిచేయును. వీనిలోమార్పు కలిగినచో ఆరోగ్యము చెడినదని అర్థము. జ్వరము, తలనొప్పి మున్నగు బాధలు ఇంకను ప్రారంభింప కుండినను అతడు వ్యాధిగ్రస్తుడని తెలియవలెను. ఇట్లు ప్రవృత్తులలోని వికారములవలన మాత్రమే తెలియదగినది అసలైన వ్యాధి లక్షణమనియు, దాని వలననే జ్వరము, తలనొప్పి మొదలగు బాధలు మాటిమాటికి కలుగుచుండును గాని ఆ బాధలే వ్యాధులు కావని గుర్తింపవలెను. ఉదాహరణమునకు: తెల్లని విద్యుద్దీపము వంక చూచునపుడు దాని చుట్టును కొందరికి మంచుపొరవలె కనిపించును. కొందరికి సన్నని రంగులు కనిపించును. కొందరు వెలుతురు చూడలేరు. కొందరికి కనులు మంటకాని, నొప్పి కాని పుట్టును. కొందరికి చెవులలో హోరు వినిపించును. కొందరికి బుడగలు

ప్రేలుచున్నట్లు వినిపించును. కొందరు ముక్కు చీదినచో చెవులలో కుర్రుమని శబ్దము వచ్చును. కొందరికి వాసన తిన్నగా తెలియదు. కొందరికి లేని వాసనలు అనిపించును. కొందరికి నోరు చేదుగా నుండును. కొందరికి ఉప్పగాను, పుల్లగాను ఉండును. ఇవి కన్నులు, చెవులు, ముక్కు, నాలుకకు సంబంధించిన వికారములు, అట్లే స్పర్శ వికారములును. కొందరికి గాలి తగిలినచో చలి చలిగా నుండును. కొందరికి పులకరించును. కొందరికి పంకా లేనిచో నుక్కిరి బిక్కిరిగా నుండును. కొందరు పంకాను భరింపలేరు. ఇట్టివి స్పర్శ వికారములు.

అట్లే మనస్సున కలుగు వికారములు కూడ నిజమైన వ్యాధి లక్షణములు. ఈ మానసిక వికారములకు ఉదాహరణము: కొందరికి ఒంటరితనము భయము కలిగించును. కొందరు స్త్రీలు రాత్రియందు ఇంటిలో నొక్కరే యున్నపుడు ఎవరో తిరుగుచున్నట్లు అలికిడిగా నుండును. ప్రక్కగదిలో దొంగ యున్నాడేమో అనిపించును. చీకటిలో నెవరో కూర్చుండినట్లు ఉండును. కిటికీ నుండి చెట్టు కనపడినచో ఏవో ఆకారములు కదలుచున్న ట్లుండును. దయ్యములున్నవేమో అనిపించును. కొందరు జనసమ్మర్దమును భరింపలేరు. కొందరు పదిమంది మధ్యకు వచ్చుటకు భయపడుదురు. దారిని పోవుచున్న వ్యక్తులు

తనను గమనించుచున్నారని అనుమానము కల్గును. తన ఆఫీసులోని వారు తనపై కుట్రలు పన్నుచున్నా రనిపించును. పోలీసులు తనపై నిఘా వేసినట్లు కొందరి అనుమానము. తాను ఆకస్మికముగా చనిపోయినచో భార్య, బిడ్డలు బిచ్చమెత్తుకొందురని ఊహించును. ఇట్టివి మానసిక వికారములు. ఇవి భయము, దుఃఖము, కోపము మున్నగువాని వికారములుగా నుండును కనుక వైద్యుని ఇంద్రియములకు, మనస్సునకు మాత్రమే అందును. రక్తపరీక్ష, ఎక్సురే మున్నగు విధానముల కివి అందవు. వానికి అందునవి వ్యాధి ఫలితములే కాని వ్యాధి లక్షణములు కావు గనుకను, వ్యాధి కారణములు అసలే కావు గనుకను నిజమయిన వైద్యుడు వీనికి ప్రాముఖ్యమీయడు. (ఈ విషయమున హోమియోపతీ విధానము అలోపతితో పూర్తిగా భేదించును)

ఇద్దరు రోగులకు గల బాధలనుబట్టి ఒకే రోగము పేరు అంటకట్టరాదు. ఉదాహరణకు: ఒక రోగికి దాహము, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు ఉండును. ఆకలి మందగించును. ఇంకొక రోగికి ఈ లక్షణములు ఉండవు. వెఱ్ఱి ఆకలి కడుపును మండించును. అనేక పర్యాయములు తినవలెను. అజీర్ణము, పులసరము, విరేచనములు కలుగుచుండును. ఆ యిద్దరికిని మూత్రమున చక్కెర

పోవుచుండును. దానినిబట్టి వారిద్దరికినీ డయాబిటీసు రోగులను పేరు తగిలించరాదు. దానికొరకై వైద్యము చేసినచో ఆజన్మాంతము యిన్సులిన్ వంటి మందు వాడుచునే యుండవలెను. చివరకు వారు దానితోనే చనిపోవుదురు. కనుక రోగ సామాన్య లక్షణములను నేర్పరి అయినవాడు లెక్కచేయరాదు. ఒక రోగిని మరియొకని నుండి ప్రత్యేకించి వేరుచేసి చూడగలిగినపుడే రోగికి తగిన ఔషధము లభించును. లేనిచో రోగమునకు తగిన ఔష ధము మాత్రమే లభించును. దానితో పోరాడుట శ్రమ తప్ప ఫలితము శూన్యము. మందు రోగి కోసమేకాని రోగము కోసముకాదు.

మనస్సు, ఇంద్రియముల ప్రవర్తనల వికారముల గమనించుచున్నప్పుడు ఉన్నవానిని పరిశీలింపవలెనే కాని బుద్ధిబలముతో నూహింపరాదు. ఉదాహరణమునకు: ఒకామె ఒంటరిగా నున్నపుడు దయ్యములున్నవేమో అని భయపడుచుండగా ఆమెను మూఢ విశ్వాసములున్న వనియు, తల్లిదండ్రులట్లు పెంచిరనియు, లేక ఆమె స్వభావమంతియే అనియు నిర్ణయింపరాదు. ఆమె చదువుకొనలేదు కనుక అట్లు ఊహించుచున్నదని గర్వపడరాదు. ఇట్లు సిద్ధాంతీకరించుట వైద్యుని రోగ లక్షణమే కాని రోగియొక్క నిజస్వరూపము కాదు. పూర్వము

తానిట్టి రోగినే చూచితి ననియు, ఆమెకు చిన్నపుడు తల్లిదండ్రుల క్రౌర్యము కారణ మనియు నొక వైద్యునకు గుర్తుండును. ఇప్పుడు చూచుచున్న రోగికి కూడ అట్టి వాతావరణమే చిన్నతనమున నుండి యుండునని యూహించును. ఇట్లు తెలియనివాని నూహించి సామ్యము సాధింప యత్నించుట వెఱ్ఱితనము. ఉన్నదానిని గమనించుట నేర్చుకొనవలెను.

## వ్యాధి - వేదనలు - బాధలు

**సూత్రము 7:** ఉద్రేకించిన వ్యాధి లక్షణము లేవియు నివారించుటకు కావలసినవి లేకున్నను వ్యాధిగ్రస్తులైన వారుందురు. అట్టివారికి గల వేదనా సముదాయమే అంతర్గతమైన వ్యాధియొక్క బహిర్గతమైన ప్రతిబింబము. అదియే వ్యథకు గురియైన ప్రాణశక్తికి ప్రతిబింబము. అట్టి ప్రాణశక్తికిని, ఆ వేదనా సముదాయమునకును కార్యకారణ సంబంధ మున్నది. అట్టివానిలోని వ్యాధి అపేక్షించునట్టి నివారణౌషధమును సూచించుటకు చక్కగా సమకూర్చ బడిన ఈ వేదనలే మార్గోపదేశకములు. ఏ వ్యాధియందైనను గమనించి తొలగింపబడవలసినది ఈ వేదనా సముదాయ మొక్కటే. ఈ మార్గమున నివారణచేసి ఆరోగ్య పరిస్థితులలోనికి మార్చుటయే స్వస్థతను చేకూర్చునట్టి

విద్య.

సూత్రము 8 : వేదనలన్నియు మాయమైన వెనుక మిగులునది ఆరోగ్యమే. కారణము తొలగింపగా దాని ఫలితములు కూడ అదృశ్యమగును.

వివరణము: ఒక వ్యాధి కలవానికి తప్పక నివారింప వలసిన బాధలుండి తీరవలెనని సిద్ధాంతము లేదు. జ్వరము, తలనొప్పి మొదలగు తరుణ వ్యాధుల బాధలుగాని, లివర్‌జబ్బు, వక్షవాతము మొదలగు దీర్ఘవ్యాధుల బాధలుగాని లేనివారెందరో వ్యాధిపీడితు లుందురు. ఒక్కొక్కనికి నిద్రపట్టదు. జనసమ్మర్దమును భరింపలేడు. రేపు ప్రయాణమన్నచో నిన్నటి నుండియే గుండెలో రైళ్ళు పరుగెత్తుచుండును. చివరకు బయలుదేరునపుడు తొందరలో నేవో మరచిపోవును. అట్లే మరియొకనికి తెల్లవారుఝాము మూడు గంటలకు మెలకువ వచ్చును. మరి నిద్రపట్టదు. చేయవలసిన పనులు, ఋణ బాధలు మున్నగునవి మనస్సుపై దండెత్తి భయపెట్టును. ఇట్టి లక్షణ సముదాయము గల రోగులు ఎందరో లోకమున నున్నారు. వారు అలోపతి వైద్యునిచే పరీక్ష చేయించుకొనినచో నేమియు జబ్బులేదని చెప్పును. ఆలోచించవద్దని, నిద్రపట్టించుకొనుమని గద్దించును. ఇట్టివే బాధలు వ్యక్తము

కాకముందున్న వ్యాధులు. వీనిని వ్యాధులని గుర్తింపనిచో కాలక్రమమున దేహభాగములు రోగముచే నాక్రమింపబడును. అంతర్గతమైన వ్యాధి గుండె యందో, ఊపిరితిత్తుల యందో, జీర్ణాశయమునందో కొన్ని సంవత్సరములలో బయటపడును. అప్పుడు గుండె జబ్బు, ఊపిరితిత్తుల వ్యాధి మున్నగు వేరు వేరు వ్యాధులుగా వానిని పరిగణించి చికిత్స చేయుదురు. నివారణము జరుగక ఉపశమనము మాత్రము కలుగుచుండును. ఇట్టి బాధలున్నవారికిగాని, లేనివారికిగాని మానసిక వికారాదులైన వేదనల సముదాయమే నిజమయిన వ్యాధి లక్షణము. దానిని తొలగించుటకు చికిత్స చేసినచో తొలగిపోవును. దానితోబాధలుకూడ తొలగిపోవును. ఇక మిగిలినది ఆరోగ్యమే. కారణమును తొలగించి నపుడు కార్యము లన్నియు తొలగిపోవును.

## ఆరోగ్యము - అనారోగ్యము

**సూత్రము 9:** ఆరోగ్యస్థితిలో ప్రాణశక్తి సర్వశక్తి సంపన్నమై పరిపాలన చేయును. దాని కేవిధమైన రుగ్మతయు అడ్డురాదు. ప్రభావము చూపదు. అదియే ప్రాణ ప్రవృత్తులకు శ్రుతి కలుపును. సంస్పర్శములను, ప్రవృత్తు లను సహజస్థితిలో నుంచును. క్షేమముగా నుండుట

తెలియుచుండును. మనస్సు పరిసరములలోనికి తిన్నగా ప్రసరించును. జ్ఞానేంద్రియములు మేల్కొని యుండును. ఇంద్రియముల ప్రవర్తనలు స్వచ్ఛముగను, సహజముగను నుండును.

రుగ్మతయందు ప్రాణశక్తి క్రమము తప్పియుండును. వ్యాధి రూపము ధరించిన శక్తిచే ప్రభావితమై యుండును. ప్రాణ ప్రవృత్తులను క్రమము తప్పిన స్థితిలో పెట్టును. సంస్పర్శము, ప్రవర్తనము అసహజములై యుండును. తాను క్షేమముగా లేనట్లు తెలియుచుండును. మనస్సు లోలోపల పనిచేయుచుండును. జాగరూకత వక్రించును. అవయవములు వికార ప్రవృత్తుల వైపునకు మరలును. ఆరోగ్యముగా నున్నపుడు మనస్సు దృష్టి అవయవముల మీదికిపోదు. ఈ విధముగా రుగ్మత చెందినపుడు తన అస్తిత్వము యొక్క ప్రాధమిక భావమే దారి తప్పును. మానసిక వైఖరులు విపరీతములై పనిచేయును. ఈ వైపరీత్యమే భౌతిక దేహమునకు, మానసిక వ్యూహమునకు గల సంబంధమందలి చెదరుబాటును సూచించును. శరీరము తనలో భాగముగా నుండక వేరుగా గమనింపబడును.

వివరణము: 1. ఆరోగ్య పరిస్థితిలో దేహమునకు తన నుండి వేరుగా అస్తిత్వము ఉండదు. దేహముతో అన్ని

పనులను చేయుచునే ఉండును కాని దేహముచే చేయించుట అను వేరు ప్రవృత్తి ఉండదు.

2. ప్రాణశక్తి నుండియే తల్లి గర్భమున తనకు దేహమేర్పడుచున్నది. తాను, దేహము ప్రాణమందలి అంశములుగనే యుండునుగాని వేరు వేరుగా పనిచేయవు. పువ్వులోని రేకలు పువ్వుకన్న వేరు కానట్లు మనస్సు, ఇంద్రియములు, ప్రవర్తనలు, అవయవములు అవి నిర్వర్తించు పనులు తనకన్న వేరుగాక ఉండును. ఆరోగ్యవంతుడు నడచుచున్నపుడు తాను చేరవలసిన చోటునకు చేరుటయే ఉండును గాని కాళ్ళు నడచుట మొదలగునవి వేరుగా నుండవు. అనారోగ్య పరిస్థితిలో ఒళ్ళు బరువు మున్నగు వికారము లుండును. కనుక దేహ మున్నట్లు వేరుగా తెలియుచుండును. మోకాలు నొప్పిగా నున్నచో తనకన్న వేరుగా నుండుట తెలియు చుండును. మనస్సు దిగులుగా నున్నచో మనస్సు వేరుగా నుండుట తెలియుచుండును. చూపు మసక అయినచో దృష్టిశక్తి వేరుగా నున్నట్లు తెలియుచుండును. దీనివలన దేహము, మనస్సు, ఇంద్రియములు తనయందు ఉండుట చెదరి తాను వానిలో నుండుట యేర్పడును. దీనివలన కలిగిన అసౌకర్యము మనస్సునకు తెలియుచుండును. కనుక తనకు బాగుగలేనట్లు తెలియును. దీని ఫలితములే

నిరుత్సాహము, నీరసము మున్నగు పరిస్థితులు. ఆరోగ్యముగా నున్నపుడు ఇన్నియు తానొక్కడుగనే యుండును కనుక ప్రాణశక్తి యొక్కటే పనిచేయుచుండును. స్వేచ్ఛ, సౌకర్యము రూపమున తానుండును. మంచి వీణను వాయించు చున్నపుడు అస్తిత్వము సంగీతమున కుండునుగాని వీణ కుండదు. సంగీతమే గమనింపబడును గాని వీణ, తీగలు గమనింప బడవు. తీగ తెగినచో తీగ గమనింపబడునుగాని సంగీతము గుర్తుండదు. అట్లే ఆరోగ్య పరిస్థితిలో అస్తిత్వము తన కుండును కాని తనలోని భాగముల కుండదు. ఆరోగ్యము చెడినపుడు గమనింపు తనలోని భాగముల కుండును గాని తాను గుర్తుండుట యుండదు.

ఏ శక్తి ఆరోగ్యముగా వ్యక్తమగుచున్నదో ఆ శక్తియే చెదరినపుడు రోగముగా పనిచేయును. నదిలో స్నానము చేయుచున్నపుడు ఏ నీరు తన మలినములను క్షాళనము చేసి దప్పికను తీర్చుచున్నదో ఆ నీరే కాలు జారినపుడు తన మృత్యువునకు కారణమగును. ఆరోగ్యమున శ్వాస, జీర్ణశక్తి, హృదయ స్పందనము, రక్తప్రసారము మున్నగు వ్యాపారములను నిర్వర్తించి బ్రతికించు చున్నదో ఆ శక్తియే చెదరినపుడు ఈ వ్యాపారము నడ్డగించును. అదే ప్రాణశక్తి సహజస్థితిలో ఆరోగ్యము కాపాడును. చెదరినపుడు అదే

ప్రాణశక్తి రోగము యొక్క రూపము  ధరించును.

ఆరోగ్యవంతుడు పనిచేయుచున్నపుడు దేహ భాగములు గుర్తురావు. ఆరోగ్యము చెదరినపుడు దేహభాగములు వేరుగా గుర్తింపబడును. అట్లు గుర్తింపబడుటయే నొప్పి, మంట, తిమ్మిరి మున్నగు బాధల రూపము ధరించును.

**సూత్రము 10 :** ప్రాణశక్తి పనిచేయనిచో శరీర వ్యూహము ప్రజ్ఞావంతము కాకుండును. అనుభూతి ఉండదు. అదియే మృతదేహము. చైతన్య వ్యూహమును, దేహ నిర్మాణ వ్యూహమును వేరుచేసి అర్థము చేసికొను ప్రయత్నము వ్యర్థము. ఈ రెండును విడదీయరాని ఒకే సారాంశము గలవి. జీవితమనగా ఈ రెండు భాగములు గలిగిన ఒకే అస్తిత్వము, చైతన్యము ప్రాణమునుండి వ్యక్తమగుచున్నది. ప్రాణము తెలివినుండి వ్యక్తమగుట లేదు.

వివరణము: దేహమునందు చర్మము, ఎముకలు, మాంసము మున్నగు భాగము లున్నవి. ఇవన్నియు ప్రాణము నుండి పుట్టి పెరుగుచున్నవే కాని ప్రాణము కలిగియున్న తిత్తులు కావు. చర్మముకాని, మాంసముకాని జీవకణముల కలయిక తప్ప వేరు పదార్థము కాదు. జీవకణములు అణువుల కలయిక తప్ప వేరు కాదు. అవి

పరమాణువులు తప్ప వేరు కాదు, పరమాణువులు శక్తియొక్క తరంగముల సుడిగుండములవంటి ఆకారములే కాని వేరు కాదు. శక్తి తరంగములు శక్తియొక్క స్పందన రూపములు. ఈ శక్తియే ప్రాణము. అదియే పర మాణువులుగా, అణువులుగా, రసాయనిక ద్రవ్యములుగా, జీవకణములుగా, చర్మము, మాంసము మున్నగు ధాతువులుగా కట్టుకొనుచున్నది. ఆ శక్తియే మనస్సుగా, ఇంద్రియప్రవృత్తులుగా, చైతన్యముగా మేల్కొని వికాస మందుచున్నది. కనుక తెలివియు, దేహధాతువులును వేరువేరు స్థితులే గాని, వేరువేరు పదార్థములు కావు. ప్రాణము దేహముగా నేర్పడి ఆ దేహమందు తెలివిగా మేలుకొనుటయే జీవించుట. ఆ తెలివి అంతర్లీనమై నిద్రించుటయే దేహమునకు మృత్యువు. తెలివి, దేహము పరిశీలనకు, సదుపాయము కొరకు రెండుగా గమనింప బడుచున్నవే గాని రెండు కావు. ఆరోగ్య స్థితిలో అవి ప్రాణస్వరూపములై తనయం దొకటిగ పనిచేయును. ఆరోగ్యము చెదరినపుడు విడి విడిగా పనిచేయుట వలన వికారములు చూపును.

**సూత్రము 11:** స్వయంవాహకమైన ప్రాణశక్తితో కూడిన శరీరతత్త్వమునకు వైషమ్యము కలిగించు ప్రభావ మేదయిన సోకినచో ఆ తత్త్వము వృత్తి వికారములను, ఇంద్రియ

ప్రవర్తనల వికారములను ప్రదర్శించును. అదియే వ్యాధి, అది ఆ వ్యాధి లక్షణములచే సూచించబడును. ఈ లక్షణములు మొత్తము కలసి అందలి ప్రాణశక్తి పొందిన వ్యాధి ప్రభావము సూచించును.

వివరణము: శరీర తత్వము, అందు పనిచేయుచున్న ప్రాణశక్తియు రెండు కావనియు, ఒకే అస్తిత్వముయొక్క అంశములనియు చెప్పబడినది కదా! దానియందు రోగకారణము లేవైన వెలుపలనుండి సోకినపుడు ఆ ప్రాణశక్తి అసహజమైన యొక సంచలనము పుట్టించును. బయట నుండి సోకిన వ్యాధి కారణముతో అది పోరాడును. బహిష్కరించుటకు యత్నించును. ఈ పోరాటమునకు ఫలితములే కొన్ని వికార లక్షణములుగా ప్రదర్శింపబడును. ఈ పోరాటమునే ప్రతీకారము (Reaction) అందురు. ఈ ప్రయత్నమున పుట్టిన వికారము మనస్సునను, ఇంద్రియ ప్రవృత్తులందును పుట్టును. అవియే వేదనలు, వాని వలననే ప్రాణశక్తి పోరాడుచున్నట్లు మనకు తెలియును. వ్యాధి ఉన్నట్లు తెలియుటకు అవియే ఈ ప్రారంభ దశలో మన కాధారము. అటుపైన కొంత కాలమునకు బాధలు పుట్టిన వెనుక ఎట్లును తెలియును. కాని ఆలస్యముగ తెలియును.

**సూత్రము 12:** ఈ వికారములైన వేదనలు

మాయమగుటయే ప్రాణశక్తి మరల సహజ స్థితి పొందినదని తెలియుటకు నిదర్శనము. అనగా ఆరోగ్యము మరల చక్కబడినదని తెలియుటకు నిదర్శనము.

వివరణము: ఆకలి, దప్పిక, అన్నహితవు మున్నగు నింద్రియ ప్రవృత్తులు; ఉత్సాహము, సంతోషము, తృప్తి, సహనభావము మున్నగు మానసిక ప్రవృత్తులు చక్క బడినపుడు వానియందు వికారములు మాయమయినవని యర్థము. అనగా వ్యాధి మాయమయినదని అర్థము. దీనిని బట్టి మధుమేహము మున్నగు వ్యాధులలో మూత్రము నందు చక్కెర మాయమగుట మున్నగునవి వ్యాధి నివారణకు నిదర్శనములు కావనియు తెలియును. రోగికి అన్నహితవు లేకుండుట, ఆకలి తగ్గుట, దప్పిక ఎక్కువగుట, మనసు సోమరిగా ఉండుట మున్నగు లక్షణములు మాయమైనపుడు మాత్రమే వ్యాధి తగ్గినదని గ్రహింపవలెను. అటుపైన మూత్రమున చక్కెర నివారణ కాక తప్పదు.

**సూత్రము 13:** దీనినిబట్టి తెలియునది ఏమనగా శరీరతత్త్వము కన్నను, ప్రాణశక్తి కన్నను వేరుగా వ్యాధి యనునది మరొకటి దేహమున నుండు ననుకొనుట అవివేకము, ఊహింపరానిది. వ్యాధి అనునది యొక పరిస్థితియేగాని ఒక అంశము కాదు. అది గమనింపదగిన వికారములను పుట్టించుటకు కారణమయిన పరిస్థితి. ఈ

వికారమును చూచు వారిలో నేమియు తెలియనివారు కూడ గమనింప గలరు. శిక్షణ పొందిన వైద్యుడైనచో మరింత స్పష్టముగా గ్రహింపగలడు.

వివరణము: సముద్రమందున్న శక్తియు, జలమును సముద్రముకన్న వేరు కావు. వానినుండి తరంగము వేగముతో లేచి కొండవలె కనిపించును, సముద్రముకన్న వేరుగా తరంగమును గమనించుచున్నాము. అంత మాత్రమున తరంగమును మరియొక క్రొత్త వస్తువు సముద్రమున పైకి లేచినదనవచ్చునా? తరంగము సముద్రమందలి యొక తాత్కాలిక పరిస్థితియే గాని మరియొక వస్తువు కాదు. అయినను సముద్రముకన్న వేరయిన లక్షణములు కలిగి వేగము, ఎత్తు కలిగి యున్నది. జాగరూకత లేనిచో స్నానము చేయువారిని ఎత్తి తలక్రిందులుగా పడవైచి ముక్కుల,నోట, ఇసుక, నీరు కొట్టి ఉక్కిరిబిక్కిరి చేయగలదు. అట్లే వ్యాధి యన్నది మనలోని ప్రాణమను సముద్రమునందలి సంచలనము వలన పుట్టిన తరంగమువంటిదేగాని మన దేహమున వేరుగా నొకచోట గుర్తింపబడునది కాదు. అయినను జాగరూకత వహింపనిచో బాధలలో ముంచెత్తి చంపును.

వ్యాధి సోకిన వాని మొగము చూచినచో పామరులకు కూడ అందలి మార్పు కనిపించును. 'నీ వంటిలో బాగుండ

లేదా? అట్లున్నావేమి?' అని ప్రశ్నింపగలరు. తలనొప్పి మున్నగు బాధలు లేకున్నను ఈ మార్పు తెలియుచునే ఉండును.

**సూత్రము 14:** వ్యాధి అని పిలువదగిన పరిస్థితి ఉన్నచోట కంటికి కన్పించనివి, గమనింపున కందనివి, విడమరచి తెలిసికొనుటకు లొంగనివి, నివారణకు సాధ్యముకానివి అగు పరిస్థితులు మానవ శరీరమున వేరుగా నుండవు. సర్వాంతర్యామి నరజాతిని కాపాడి రక్షించునట్టి అపరిమిత దయాస్వరూపము అనుటకు ఇదియే నిదర్శనము. కనుక నివారణ చేయదగిన వేదన లేవియు రోగి అనుభవమునకు రానివని యుండవు. నిపుణుడగు వైద్యుని గమనికకు అందనివి మొదలే ఉండవు. కాబట్టి నివారణోపాయమును తర్కముతో పూరింపరాదు. వ్యాధి అస్తిత్వమును గూర్చి హేతువులను నిర్మాణము చేయుటవలన గాని, వ్యాధి స్వభావమునుగూర్చి నిరాధారములైన ఊహలు పెంచుట వలన గాని ప్రయోజనము లేదు.

**వివరణము:** నివారణ కావలసిన దేమయిన దేహమున నున్నచో రోగికి తెలియకుండుట సాధ్యముకాదు. రోగి తన కే బాధయు లేదని స్వయముగ చెప్పగలిగినప్పుడు వైద్యుడు రక్తపరీక్ష చేసి 'నీకు జబ్బున్న' దని చెప్పుట

హాస్యాస్పదము. మూత్రమున ఆరోగ్యవంతులకు కూడ అపుడపుడు చక్కెర పోవుచున్నది. దానిని పరీక్షించి వైద్యుడు మందులు వాడుమన్న, మందులతో రోగము పుట్టించు టయే. అట్లే మూత్రాదులు పరీక్షచేసి ఏమియు జబ్బులేదని వైద్యుడు నిర్ణయించినను కొందరు నిద్రపట్టక బాధపడువారు, తలనొప్పి, నడుము నొప్పులు కలవారు కలరు. వారికి జబ్బులేదనుట కూడ హాస్యాస్పదము. ఒకడు నీరసముతో మంచము దిగలేని స్థితిలో నుండగా వైద్యుడు పరీక్షించి "నీకు జబ్బు తగ్గినది, నీ నీరసము కేవలము మానసికము, నీరసమున్నట్లూహించుచున్నావు కనుక నీవట్లు బాధపడుచున్నావు. అంతేగాని నీకు జబ్బు లేదు" అని చెప్పుటయు హాస్యాస్పదమే. జబ్బున్నదో లేదో తెలియుటకు రోగియే ప్రమాణముగాని వైద్యుడు కాదు. రోగి శరీరధాతువులను, రక్తమును, మూత్రమును, ఉమ్మిని పరీక్షచేసిన ఫలితములు బొత్తిగా ప్రమాణము కాదు. రోగి మనసునకు అనిపించనిది. వైద్యుని కంటికి కనిపించనిది, మైక్రోస్కోపు, ఎక్సురేలలో తీసి నిర్ణయింప బడినది ఏదియు రోగములకు ప్రమాణము కాదు. రోగికన్న వేరుగా రోగము వానియందుండునని భ్రమపడిన అశాస్త్రీయ దృష్టి సత్యము కాదు.

నివారణ చేయవలసిన రోగమని యున్నచో దాని

వార్తల నందించునట్టి వేదనలు రోగిలో తప్పక పుట్టును. వేదన లేకుండ రోగమున్నచో మానవులు క్రుళ్ళి చత్తురు. భగవంతుడు సృష్టి కర్త కనుక రోగమున్నచోట వేదన లేకుండుట ఆ దయామయుని సృష్టిలో అసాధ్యము. భగవంతుని దయ అనగా నిదియే. మరియు రోగమునకు వేదనయు, వేదనకు నివారణోపాయము ఈ సృష్టిలో నిమడ్చబడియున్నది. కనుక రోగి యనుభవించి చెప్పు వేదనలను రోగి ప్రవర్తనమున వైద్యుడు గమనించు ప్రత్యేకతలను ఆధారముగా గొని మందును నిర్ణయింప వలెనుగాని వానిని ద్రోసిపుచ్చి మూత్రము, ఉమ్మి పరీక్షచేసి వాని ఫలితములకు ప్రాముఖ్యమిచ్చి, సాంకేతిక ఊహలు పెంచుకొని వ్యాధులకు నామకరణము చేసి జాతకము చెప్పుట తెలివి తక్కువ. దాని వలన వైద్యుని సాంకేతిక పరిశ్రమయు, వైద్యుని విద్యాప్రదర్శనము నిరూపితమగునే కాని రోగిబాధ తీరదు. వైద్యమనగా రోగికి బాధతీర్చుట.

**సూత్రము 15:** శరీరతత్వము, అందలి ప్రాణశక్తియు నొకదానిలోని భాగములే కాని రెండు వస్తువులు కావు. రెండుగా విభజించి చూచుట పరిశీలన సదుపాయము నకేగాని రెండుగా తెలిసికొనుటకు కాదు. మానవుడు అర్థము చేసికొను శక్తి పరిమితము గనుక ఇవి రెండుగా చూడబడుచున్నవి. ఒక భావమును నిరూపణ చేయు

వానికిని, ఆతని నిరూపణమునకు గల సంబంధమే ఈ రెండింటికిని గలదు. దేహతత్త్వము నిర్మాణము చేయునది ప్రాణశక్తి. అది రోగ స్థితిలో మార్పు చెందినచో దానిచే నిర్మింపబడు తత్త్వమున గజిబిజి ఏర్పడును. దానివలన గమనింపదగిన వేదనలు వ్యక్తమగును. ఆరోగ్య పరిస్థితిలో శరీరము చేతనవంతముగా చేయుచున్న చేతనప్రసారము, వ్యాధితో గజిబిజియై వేదనలుగా పని చేయుచున్న శక్తియు నొక్కటియే.

వివరణము: మన ముచ్చరించు కంఠధ్వనియైన శబ్దము, దానినుండి పుట్టిన వాక్యము ఒక్కటే కాని రెండు కావు. పరిశీలనకు మాత్రము రెండుగా గమనింపబడును. వాక్యము, అందు వ్యక్తము చేయబడిన భావము రెండుగా కనిపించు చున్నను ఒకదానిలోని రెండు భాగములే. అట్లే ప్రాణశక్తియు, దానిచే నిర్మింపబడిన దేహతత్త్వము కూడ, ఇవి మాటాడువానికిని, అతడు వ్యక్తము చేయుచున్న భావమునకును గల సంబంధము వంటివి.

అదే కంఠధ్వనితో నొకడు మంచి విషయములను బోధించును. మరియొకడు బూతులు మాటాడును. ఈ రెండును ధ్వనితరంగములతో నిర్మింపబడినవే. అట్లే ఒకే ప్రాణశక్తి ఆరోగ్యస్థితిలో ధాతువుల పోషణమునకును,

అనారోగ్య స్థితిలో  కల్లోలపరచుటకును పనిచేయుచున్నది. వ్యాధి శక్తికూడ అంతకు ముందున్న ప్రాణశక్తియే. కాని వికృతాకారము ధరించిన శక్తి.

**సూత్రము 16:** చేతన స్వరూపమయిన ప్రాణచైతన్యము గజిబిజియైన సందర్భమున చేతనవంతమయిన దుష్టశక్తి చేతనే ప్రభావిత మగుట సాధ్యము. దాని నివారణకూడా మందులలోని చేతన శక్తిని ప్రయోగించినపుడు మాత్రమే సాధ్యము. విశ్వవ్యాప్తమయిన రసాయనిక పరిణామమే ప్రాణము. అదే రూపమున పనిచేయు పరిణామము మాత్రమే దానిని (ప్రాణము) చెదరగొట్టుటకు గాని, చక్కబరచుటకుగాని సామర్థ్యము కలిగియున్నది.

వివరణము: ఆరోగ్యము చైతన్యము యొక్క విన్యాసమేగాని యొక భౌతిక పదార్థము కాదు. అది చెదరుట కూడ చైతన్య వికారమే కాని భౌతికము కాదు. దానిని చెదరగొట్టు వ్యాధి కూడ చేతన కక్ష్యలో నుండునే గాని భౌతిక పదార్థముగా నుండదు. దానిని మరల చక్కబరచు నౌషధము కూడ ఔషధ శక్తియేకాని ఔషధ పదార్థము కాదు.

అయాస్కాంత మనగా ఇనుపముక్కలో మేల్కొంచిన అయస్కాంత శక్తియేగాని అయస్కాంతపు ముక్క కాదు.

అయస్కాంతము ఇనుపముక్కగా మారిపోవుట వంటిది. ఆరోగ్యము నుండి అనారోగ్యము పుట్టుట. అయస్కాంతము ఇనుపముక్కగా మారుట శక్తి పరిణామమే కాని ద్రవ్య పరిణామము కాదు. ఆ ఇనుపముక్కను మరల అయస్కాంతముగా మేల్కొలుపుట కూడ అయస్కాంత శక్తివలననే సాధ్యముగాని ద్రవ్యముతో మార్చుట అసాధ్యము. అయస్కాంతమును గూర్చి వ్రాసిన శాస్త్ర గ్రంథముతో ఇనుపముక్కను రుద్దినను లాభము లేదు. అట్లే వ్యాధిని ఔషధ మందలి శక్తితో నివారించు మార్గము ఉపయోగింప వలెను గాని ఔషధ పదార్థముతోకాదు.

సూత్రము 17 : వ్యాధి నివారణ ప్రక్రియ మనలోని అదృశ్యమైన ప్రాణశక్తి యందలి మార్పును రద్దుచేయును. దానితో ఆ శక్తిలోని గజిబిజి చక్కబడును. దానితో వ్యక్తమయిన వేదనలు మాయమగును. దానితో వ్యాధి మొత్తము మాయమగును.

వివరణము: మందులోని ప్రాణశక్తి మనలోని ప్రాణశక్తిలోని మార్పులను రద్దు చేయును. అప్పుడు ప్రాణశక్తి సహజమయిన స్థితిలో పనిచేయును. ఇక వికారములకు తావుండదు కనుక వేదనలు మాయమగును అనగా వ్యాధి మాయమగును.

నదీ ప్రవాహమున మహా వేగముండును. ఆనకట్ట కట్టినచోట నీరుమట్టము పెరిగి ప్రవాహము నడ్డగించును. అక్కడనుండి కాలువ త్రవ్వినచో నీటి ప్రవాహము దారి మారును. ఇది మట్టము పెరిగిన నీటిలోని ప్రవాహశక్తి వలననే జరుగుచున్నది గాని ఆనకట్టలోని ఇనుము, సిమెంటు వలన కాదు. ఆనకట్ట వంటిది ఔషధము. అందలి ఔషధ ప్రభావము మట్టము పెరిగిన నీటిశక్తి వంటిది. మనలోని ప్రాణశక్తిని నివారణమునకు ప్రేరేపించుటయే ఔషధము యొక్క పనిగాని స్వయముగా వ్యాధిని తగ్గించుట కాదు.

**సూత్రము 18:** ఈవిధములైన కారణములచే వేదనా సముదాయ మొక్కటే రోగ పరిస్థితియందు తెలిసికొన దగిన అంశము. అదియే ఔషధమును సూచించు నంశము కూడ.

## ఔషధములలోని వ్యాధినివారణ శక్తి

**సూత్రము 19:** ఔషధములలోగల వ్యాధి నివారణశక్తి దేనిపై నాధారపడి యుండవలెను? ఇంద్రియ ప్రవృత్తుల పరిస్థితిని మార్చగల శక్తిపై నాధారపడి యుండవలెను గదా! అది మనలోని చైతన్యశక్తిని ప్రభావితము

చేయగలుగుట ప్రదర్శితము కావలెను.

**వివరణము:** ఆనకట్ట యొక్క విలువ దేనిమీద నాధారపడి యున్నది? అందలి ఇటుకలు, సిమెంటు, ఇనుము యొక్క విలువపై నాధారపడి యున్నదా? లేదు. అది జలప్రవాహమును అడ్డగించు నిర్మాణవైఖరి మీద ఆధారపడి యున్నది. అనగా ప్రవాహము యొక్క వాలును మార్చునట్టి వీలుపై నాధారపడి యున్నది. అట్లే ఒక ద్రవ్యము ఔషధముగా పనికివచ్చునా లేదా యను నంశము దేనిపై నాధారపడి యున్నది? ఆ ద్రవ్యము యొక్క రంగు, రుచి, వాసన, బరువు మున్నగు వానిపై నాధారపడి లేదు. ఆకలి ఎక్కువై నీరసించినవాని నెత్తిన ఎక్కువ బియ్యమున్న బస్తా నెత్తినచో ఆకలి తీరునా? ఔషధ ద్రవ్యము యొక్క ఖరీదుపై కూడ నాధారపడిలేదు. ఎక్కువ ఖరీదుగల బియ్యపు బస్తానెత్తినచో ఆకలి యెక్కువగా తీరదు. నోటికిని, బియ్యమునకును గల సంబంధము వలన ఆకలి తీరును. ఈ సంబంధము ప్రాణశక్తికి సంబంధించినదే కాని బియ్యములోని రసాయనిక పదార్థములకు సంబంధించినది కాదు. అట్లే ఈ మందులో బంగారము కలుపబడినది గనుక రోగి ఆరోగ్యము బంగారముగా మారునని చెప్పరాదు. ఒక ద్రవ్యమున మన ప్రాణశక్తిని కదలించగల ప్రభావముండవలెను. ఉన్నచో అది ఆరోగ్యవంతుని

యందు ప్రయోగింపబడినపుడు వాని ప్రాణశక్తిని కదలించును. అపుడు వానిలో వేదనలు పుట్టును. ఏ ద్రవ్యము ఆరోగ్యవంతుని యందు ప్రయోగించినప్పుడు వేదనలు పుట్టునో అది ఔషధ ప్రభావముగల ద్రవ్యము. అదియే రోగిలో గల ప్రాణశక్తిని కూడ కదలించును. దానితో వాని ప్రాణశక్తిలో నొక క్రొత్త సంచలనము ఏర్పడి ఆరోగ్యమునకు కావలసిన మార్పువచ్చును.

**సూత్రము 20:** ఔషధ గుణములు నిర్ణయింపబడుట తర్కించుట చేతను, ఊహించుట చేతను జరుగదు. నిదర్శనమువలన మాత్రమే నిర్ణయింపబడును. వ్యాధి నివారణము కలిగించు నౌషధమునకును, మానవుని పరిసరములనుండి ఎదిరించు వ్యాధి కారణములకును సంబంధము లేదు. ఇది (పరిసర వ్యాధికారణముల విజ్ఞానము) కేవలము ఆచారకాండకు సంబంధించినది.

**వివరణము:** ఎ) ఈ ఔషధము చలిదేశమున పుట్టి పెరుగును గనుక చలిజ్వరము నివారించునని తర్కించుట వ్యర్థము. అట్లే కాల్షియము తక్కువైన రోగికి కాల్షియమును తినిపించుట వ్యాధి నివారణము చేయునను తర్కము వ్యర్థము. కాల్షియము తక్కువైనవానికి దానిని ద్రవ్యరూపమున తినిపించినచో తాత్కాలికముగ రోగికి

బలము చేకూరును గాని వ్యాధి నివారణము కాదు. తినిపించుట మానినంతనే రోగి మరింత నీరసించును. రోగ మనగా ఆహారమునుండి కాల్షియమును గ్రహింపలేనట్టి లోపమేగాని కాల్షియము లోపించుట కాదు. జూదమాడి అప్పుల పాలయిన వానికి తేరగా డబ్బిచ్చుట వలన అప్పులు తీరవు. జూదమాడు గుణము ఎక్కువగును. వాని దుర్గుణము జూదమాడు బుద్ధియేగాని అప్పుల మొత్తము కాదు. వానికి డబ్బిచ్చుటవంటిదే రోగికి కాల్షియం తినిపించుట. కావున నిట్టి తర్కములు గాని, కాల్షియము అనగా నేమి అను రసాయనిక జిజ్ఞాసగాని కాల్షియం యొుక్క ఔషధ గుణములను నిరూపింపలేవు. ఆరోగ్యవంతుని శరీరమున కాల్షియమును ప్రయోగించినచో కొన్ని వికారములు పుట్టును. వానిని గమనించినచో ఔషధ గుణములు తెలియును. ఇట్లు ప్రయోగ నిదర్శనమువలన మాత్రమే ఔషధ ప్రభావమును గుర్తింపవలెను.

బి) పరిసర ప్రదేశములను ఆరోగ్యవంతము చేయుట వలన కూడా నొక ద్రవ్యముయొుక్క ఔషధగుణములు నిరూపణము కావు. పరిసరములను పరిశుభ్రముచేయు ద్రవ్యముల నుపయోగించినచో ఆరోగ్యవంతునకు రోగము రాకుండ కాపాడును గాని రోగి రోగము పోగొట్ట జాలవు. ఆ ద్రవ్యముల నుపయోగించుటకు ఆచారకాండకు

సంబంధించినది గాని వైద్యమునకు సంబంధించినది కాదు. ఉదాహరణకు: ఫినైల్‌తో ఇల్లు కడిగినచో సూక్ష్మజీవులు చనిపోవును. కాని ఆ ఫినైల్ ప్రభావమున ఇంటిలోని వారికి కలరాగాని, మలేరియాగాని రాదని చెప్పలేము. నీటిలో పొటాషియమ్ పెర్మాంగనేటు కలుపుటవలన గాని, క్లోరిన్ పట్టించుటవలన గాని అవి త్రాగిన వారికి అంటువ్యాధులు రావనుట భ్రాంతి. వచ్చినవారికి నివారించుటకును ఇవి పనికిరావు. వ్యాధి కారణములు రోగి లో నుండును. ఉండి పరిసర రోగముల నాకర్షించును. కనుక ఔషధము రోగిలోని ప్రాణశక్తికి సంబంధించినదేగాని పరిసరములకు సంబంధించినది కాదు.

**సూత్రము 21:** పర్యవసానమేమనగా నొక ఔషధము నందున్న రోగనివారణ శక్తి నిర్ణయింపబడుటకు ఆరోగ్యవంతునిపై నది వేదనలను పుట్టించునట్టి శక్తిని గమనింపవలెను.

**వివరణము:** ఏ ద్రవ్యమయిన ఆరోగ్యవంతునిపై ప్రయోగము చేసినపుడు అది వేదనలను పుట్టించునో లేదో చూడవలెను. పుట్టించినచో దానిలో ఔషధశక్తి యున్నది. లేనిచో లేదు. ఈ కారణముననే ఆహారము ఔషధ ద్రవ్యము కాజాలదు. ఉప్పు, మిరపకాయ మున్నగు వానిని మన మాహారమునందు వాడుచున్నాము. అందుగల

జీర్ణముచేయు శక్తిని ఔషధముగనే మనము ఉపయోగించు చున్నాము. ఉప్పు, మిరపకాయ మున్నగునవి స్వతంత్ర ముగా ఆహారద్రవ్యములు కావు. వానిని ప్రత్యేకముగా ఆరోగ్యవంతునిపై ప్రయోగించినచో తీవ్రమైన వేదనలు పుట్టును. కనుకనే హోమియోపతిలో దీనిని వ్యాధి నివారణౌషధముగా వాడుచున్నాము. మిరపకాయనుండి 'కాప్సికమ్' అను ఔషధము తయారుచేసినచో నోరు మంట, నోటిపూత, కన్నుల వెంట, ముక్కుల వెంట నీరు, కడుపులో మంట, గ్యాస్ట్రిక్ వ్యాధులు మున్నగు వేదనలతో కూడిన రోగము నివారణమగును. అట్లే ఉప్పునుండి తయారుచేసిన 'నేట్రమ్ మూర్' అను మందు ఘోరవ్యాధులను నివారించుచున్నది.

**సూత్రము 22:** వ్యాధి దానియొక్క వేదనా సముదాయము రూపమున వ్యక్తము అగుచున్నది. మందులోని ఔషధ గుణము, అది పుట్టించు వేదనా సముదాయము నందలి సామ్యమునుబట్టిగాని, విపరీత లక్షణములను బట్టిగాని అనుభవ పూర్వకముగా మందులను రోగములకు గురిపెట్టి వాడవలెను.

వివరణము: రోగము పుట్టించు లక్షణములు రోగియందుండును. ఔషధము పుట్టించు వేదనలు ఔషధమునందుండును. ఈ రెండింటికిని సమాన

లక్షణములను గమనించి జతపరచుట యొక పద్ధతి. రోగి లక్షణములకు విపరీతములైన లక్షణములను పుట్టించు మందులను ప్రయోగించుట మరియొక పద్ధతి.

ఎ) ఎండలో తిరిగివచ్చినవాడు వేడినీళ్ళతో స్నానముచేయుట వంటిది సమాన లక్షణములు గల మందులను వాడుట. దీనితో వడదెబ్బ తగ్గి రోగికి విశ్రాంతి చేకూర్చును.

బి) ఎండలో తిరిగివచ్చినవాడు కుండలోని చల్లని నీటితో స్నానము చేయుటవంటిది విపరీత లక్షణములుగల మందులు వాడుట. ఈ పద్ధతిలో మొదట తాపము తగ్గినట్లనిపించినను రోగి వడదెబ్బ కొట్టి చనిపోవును. అట్లే విపరీతలక్షణ ప్రయోగమైన ఔషధములతో చికిత్స చేసినచో బాధలు తాత్కాలికముగ నుపశమించుటయు, రోగము ముదిరి రోగి చనిపోవుటయు జరుగును.

**సూత్రము 23:** ఉపశమనము చేసినచో కేవలము తాత్కాలికమైన మార్పిడి మాత్రము జరుగును. ఉపశమనమునకై నిర్ణయింపబడిన ఔషధము నివారణ చేయుట కుపయోగపడదు. అది విపరీత లక్షణములను పుట్టించును. అవి రోగ లక్షణములను తాత్కాలికముగ తొలగించి చివరివరకు అణచిపెట్టి చిక్కుగ లుంగచుట్టునే

గాని నివారణ మే మాత్రము చేయజాలవు. ఈ సత్యము అలోపతి మందులు పనిచేయు వైఖరిలో కొల్లగా అనుభవమునకు వచ్చినది.

వివరణము: సమాన లక్షణములను ప్రేరేపించు నౌషధములను, విపరీత లక్షణములను ప్రేరేపించు నౌషధములను వాడుట ఇంతకుముందు చెప్పబడినది. ఇందు విపరీత లక్షణ ప్రయోగ విధానమునందు ఇమిడియున్న సూక్ష్మాంశములు వివరించబడుచున్నవి.

రోగియొక్క బాధలకుగాని, వేదనా సముదాయమునకుగాని వ్యతిరేకమైన లక్షణములను పుట్టించు నౌషధములను వాడునపుడు ఉపశమనము కలుగుచున్నది. అది కేవలము తాత్కాలికము. దానివలన బాధలు తాత్కాలికముగా మాయమగును. ఈ మాయమగుట కూడ అణచిపెట్టబడుటయేగాని నిజముగ మాయమగుట కాదు. వేదనలు రోగమున్నట్లు తెలియచేయు వార్తహరుల వంటివి. వాని నణచి పెట్టినచో రోగమున్నట్లు తెలియదు. తెలియనపుడు నివారణమెట్లు సాధ్యము? ఈ మార్గము వరుసగా కొంతకాలము ప్రయోగించినచో రోగమున్నట్లు తెలియకుండగనే ముదిరిపోవును. ముదిరి శరీరధాతువులను కూడ



పాడుచేయును. అవయవములు పాడయిన తరువాత నివారణము సాధ్యము కాదు. వ్యాధి అవయవ ధాతువులదాక రాకముందే మానసిక వేదనలను, ఇంద్రియ వికారములను ఆధారముగా చేసికొని ఔషధ నిర్ణయముచేసి నివారణము చేయవలెను. వేదనలు మాయమగుటకు ప్రాణశక్తియొక్క గమనమును మార్చవలెనేగాని వేదనల నణచిపెట్టి వానితో చెలగాట మాడరాదు.

వేదనలు తత్త్వమున నేర్పడిన ఆపదకు వార్తాహరుల వంటివని చెప్పియుంటిమి. కోటలో శత్రువులు ప్రవేశించుచున్నారని యొకడు వార్తను తెచ్చినచో వినుటకు భయపడి వాని నోరు మూసి చంపినచో నేమగును? తెలియకుండగనే సుఖముగా కోట శత్రువుల పాలగును. అట్లే విపరీత లక్షణ ప్రయోగముచేత వేదన లణచిపెట్టబడి రోగము రోగిని చంపును.

**సూత్రము 24:** దీనినిబట్టి తేలునదేమనగా ఒక వ్యాధికి చికిత్స చేయవలెనన్నచో సమాన ధర్మముల నుత్పాదించు నౌషధమును ప్రయోగించుట తప్ప మరియొక మార్గము లేదు. ఈ మార్గము ననుసరించి నిర్ణయింపవలసిన ఔషధము నెట్లు గుర్తింపవలెను? చికిత్స చేయవలసిన రోగమునకు గల వేదనల సముదాయమును గమనించి దాదాపు దానని పూర్తిగా పోలియున్న వేదనా సముదాయ

మును పుట్టించు సామర్థ్యము గల మందును స్వీకరింప వలెను. రోగి యందలి నైసర్గిక రోగమునకు చక్కని పోలిక గల యొక కృత్రిమ రోగమును పుట్టించు శక్తి ఔషధమున కుండవలెను.

వివరణము: విపరీతగుణ ప్రయోగము, సమానగుణ ప్రయోగము అను రెండే ఔషధ ప్రయోగమునకు లభ్యము లయిన పద్ధతులు. అందు విపరీత గుణ ప్రయోగము ఆపదను పుట్టించునని చెప్పియుంటిమి. ఇక మిగిలినది సమానగుణ ప్రయోగమే. సమాన ధర్మముల ననుసరించి ఔషధ నిర్ణయము చేయవలెను.

రోగి యందలి రోగ లక్షణములైన వేదనల సముదాయమును గుర్తింపవలెను. అదే వేదనా సముదాయమును ఆరోగ్యవంతునిలో పుట్టించునట్టి ఔషధమును నిర్ణయింపవలెను. రోగి యందలి రోగము నైసర్గిక వ్యాధి అనబడును. ఔషధము పుట్టించు రోగము కృత్రిమ వ్యాధి యనబడును. నైసర్గిక వ్యాధి నివారణకై సమాన గుణములుగల కృత్రిమ వ్యాధి నుత్పాదింప చేయవలెను. ఇదియే సమానౌషధ చికిత్స లేక సారూప్య ఔషధ చికిత్స (హోమియోపతి).

**సూత్రము 25:** అనుభవమునుబట్టి తెలియునది

ఏమనగా నొక ఔషధమును చక్కగా సూక్ష్మీకరణము (Potentization) చేసినచో అందలి అతి సూక్ష్మతర కణములకు సక్రమమైన స్వేచ్ఛ ఏర్పడి ఉత్తేజితము లగును. అపుడవి ఉత్పాదించు వేదనా సముదాయముతో సరూపమైన వ్యాధిని నివారణము చేయును. ఇది ఋజువు చేయబడిన సత్యము. "సారూప్యములను సారూప్యములతో నివారణము చేయుట" అను హోమియోపతి సిద్ధాంత మిదియే.

**సూత్రము 26:** ఈ హోమియోపతీ సిద్ధాంతము ఇంతకు ముందే గమనింపబడినది గాని తగిన గుర్తింపునకు రాలేదు. ఆయా సందర్భములందు అజ్ఞాతముగా వాడబడు చుండుటయు, గుణము నిచ్చుచుండుటయు గమనికకు వచ్చియే ఉన్నవి.

**వివరణము:** పాశ్చాత్య వైద్యవిజ్ఞానమున హానిమన్ కాలమునాటికి అలోపతి విధానము తప్ప మరియొకటి వ్యాప్తిలోనికి రాలేదు. గృహ వైద్యములలో హోమియోపతీ వంటి పద్ధతులను పూర్వకాలపు పాశ్చాత్యులు అక్కడక్కడ వాడుచున్నను అది వైద్యశాస్త్రముగా గుర్తింపబడలేదు. ఆయుర్వేదశాస్త్రమున ఈ హోమియో సిద్ధాంతము చాలకాలమునుండి శాస్త్రీయమైన వాడుకలో నున్నది. హానిమన్నాటికి పాశ్చాత్యులకు ఆయుర్వేదశాస్త్ర మున్నదని

తెలియదు. బ్రిటిష్ పరిపాలననాటికి కూడ భారతీయులు అనాగరికజాతి యను గ్రుడ్డి నమ్మకమే పాశ్చాత్యులకు గలదు. కనుక ఆయుర్వేదశాస్త్రమున్నట్లు హానిమన్‌కు తెలియుట కవకాశములేదు. అతడు స్వతంత్రముగనే తన శాస్త్రమును దర్శించి సాధించి ఇచ్చెను.

ఆయుర్వేదశాస్త్రము నేటికి కనీసము 10,000 సంవత్సరముల నాటినుండి పరిపూర్ణత చెందియున్నది. అందు "సమానగుణైః సమాన గుణభూయిష్ఠైః విపరీతైః విపరీత గుణభూయిష్ఠై వా భేషజమ్" అని చెప్పబడినది. దీని యర్థమేమనగా సమాన గుణములు గల వ్యాధులకు సమాన గుణములు గల మందులతోను, విపరీత గుణములు గల వ్యాధులకు విపరీత గుణములు గల ఔషధములతోను వ్యాధి నివారణము చేయబడుటచే చికిత్సా విధానము రెండు విధములుగా నున్నది అని. ఈ రెండు విధానములలో దేని నెప్పుడు వాడవలెనో కూడ వివరింపబడినది.

ఆయుర్వేదశాస్త్రమున జ్వరముతో కూడిన రోగికి నేతిని తినిపించి, వేడినీళ్లు త్రాగించి, వేడి నీళ్లతో తలస్నానము చేయించవలెనని చెప్పబడియున్నది. అట్లే ఎండలో తిరిగివచ్చినవారికి వేడినీళ్లలో నెయ్యి కలిపి త్రాగించుట మున్నగు చికిత్సలు చెప్పబడినవి. ఇవన్నియు

సారూప్య ఔషధ ప్రక్రియను క్రమబద్ధముగా వాడిన ఉదాహరణలే. ప్రసుత కాలమున నవీనులకు ఆయుర్వేద శాస్త్రమును గూర్చి అజ్ఞానము కలిగినది గనుక ఇది తెలియుటలేదు.

**సూత్రము 27:** ఈవిధముగా పరిశీలించిన పర్యవసాన మేమనగా నొక వ్యాధి యొక్క వేదనలను అంతకన్న విస్పష్టముగా నుత్పాదింప చేయగల ప్రభావము మీదనే ఔషధము యొక్క శక్తి ఆధారపడియున్నది.

**సూత్రము 28:** ఇది ప్రకృతియందున్న ధర్మము. ఇది స్వచ్ఛముగా చేయబడిన ప్రయోగముల ఫలితములచేతను, త్రికరణశుద్ధియైన అనుభవము చేతను నిదర్శన పూర్వకముగ నిరూపింపబడినది. దీనిని ప్రయోగము చేసిన తావులం దెల్ల ఆశ్చర్యకరమైన ఫలితములు కలిగి అనుభవ శాస్త్రముగా నిరూపితమైనది. కనుక దీనిని శాస్త్రీయముగా వివరింపగల్గుట, ఇది యెట్లు పనిచేయునో విప్పి చెప్పగలుగుట అనువానికి ప్రాధాన్య మక్కరలేదు. మానవుడు భేదింపరాని అధికార ముద్రలను ప్రకృతి తన రహస్యములపై ముద్రించి యుంచును. అతడు వానిని చూడవచ్చును. వినవచ్చును. వినియోగించు కొనవచ్చును. అయినను అందలి మర్మము నర్థము చేసికొనలేక పోవచ్చును.

వివరణము: చెప్పబడిన సారూప్య సిద్ధాంతము ననుసరించి ఔషధమును నిర్ణయించి సూక్ష్మీకరించి వాడిన తావులం దెల్ల రోగములు తగ్గుచున్నవి. తగ్గుటయే నిదర్శనము గాని ఎట్లు తగ్గుచున్నవో వివరింపగలుగుట కాదు. ఈ రెంటిలో తగ్గుటయే ఎక్కువ ప్రమాణము. వివరింపలేక పోయినచో అది ప్రమాణము కాదు. అన్నము తిన్నచో ఆకలి తీరునన్నది అనుభవము. ఎట్లు తీరునో విమర్శన కందదు. భోజనము విస్తరిలో వడ్డింపబడి యుండగా దానిని తిన్నచో ఆకలి ఎట్లు తీరునో ఋజావు చేయజాలక పోయినచో, భోజనము చేయనని ఎవడైన వాదించినచో వాడు మూర్ఖుడు. ప్రకృతిలో విద్యుచ్ఛక్తి యున్నది. దానిని పుట్టించి ఇచ్చునట్టి ఇంజనీరింగు శాస్త్రజ్ఞునకు విద్యుచ్ఛక్తియననేమో తెలియునా? తెలియదు. తెలియకున్నను నిదర్శనముచే సాధించి ఇచ్చుచున్నాడు. శాస్త్రజ్ఞుడే గాక పామర జనులు కూడ నిదర్శనము సహాయముననే నిత్యజీవితమున వాడుకొనుచున్నారు. ప్రకృతి యందలి శక్తుల ధర్మములన్నియు నిట్టివే. "ఇది ఇట్లు జరుగును" అని ముద్రించి శాసించునేగాని ప్రకృతి విడమర్చి చెప్పదు. చెప్పవలసిన గతి దానికి లేదు. అవసరమును బట్టి మానవుడే ప్రకృతి నాశ్రయించి, చూచి, విని, తెలిసికొని వినియోగించుకొనును. దానిని వదలి

హేతువాదమున పడువాడు మూర్ఖుడు.

**సూత్రము 29:** శస్త్రచికిత్స వరకును ముదరని ఏ వ్యాధియైనను, రుగ్మత చెంది విషమ పరిస్థితి లోనికి పరిణమించిన ప్రాణశక్తి యొక్క ప్రత్యేక పరిస్థితియే గాని వేరు కాదు. దాని నివారణకు సారూప్య విధానము నవలంబించుటలో గల సూత్రములను నిదర్శనమున కన్న వేరుగా వివరింపవలసినపని లేదు. ఐనను కుతూహలము గలవారి కోరికపై దాని సంభావ్యతను గూర్చి ఈదిగువ నుదహరింపబడుచున్నది. ఇందలి హేతువు కేవలము ఊహా నిర్మితము కావచ్చును. సారూప్యము చెందిన ఔషధము రోగనివారణము చేయు విధానమును వివరించుచున్నాము. రోగమును నివారించుటకు ఒక ఔషధమును ప్రయోగింప దలచి నప్పుడు, అది నివారణకు కావలసిన ప్రతిక్రియా ప్రభావము కలదియై యుండవలయును. ఈ ప్రతిక్రియ రోగి రోగమునకు సరిపోవునదియై యుండవలయును. అది రోగి యొక్క ప్రాణశక్తి యందు ఒక కృత్రిమ వ్యాధి పరిస్థితిని కల్పింపబడి యుండవలెను. ఈ కల్పించుటయే ప్రాణశక్తిని రేపెట్టుట కావలయును. ఈ కృత్రిమవ్యాధి యొక్క ఫలితములు నివారింపబడు వ్యాధి లక్షణములతో సారూప్యము చెంది యుండవలెను. ఔషధము యొక్క

మోతాదు శరీరమందలి ప్రాణశక్తి పుట్టించు ప్రతిక్రియను మించి పోవునదిగా నుండరాదు. కనుక ఔషధమును సూక్ష్మీకరించి వాడవలయును. ఇట్టి ఔషధప్రయోగము దేహమందు సరూపమైన ప్రతిక్రియను పుట్టించును. అది ప్రాణశక్తిచే కష్టము లేకుండ బహిష్కరింపబడునంత తీవ్రతను మాత్రమే కలిగి యుండవలెను. ఈ ఆవశ్యకతను బట్టి సరియైన మోతాదును ప్రయోగించుటయు, మోతాదులను రెట్టించుటయు జరుగవచ్చును. ఈ వివరణము మాత్రము సరియైనది కావచ్చును. వీనిని పరిశీలించి నీ యభిప్రాయమును నీవు కూడ నేర్పరచుకొనవచ్చును. ప్రకృతి సత్యములును, ప్రకృతి శక్తులును అర్థము కానక్కరలేకయే వాడుకొనబడుచున్నవి గదా!

వివరణము: ప్రకృతియందుగల శక్తులు నిదర్శనమునుబట్టి తెలియుచున్నవిగాని వానివివరణమును బట్టికాదు. ప్రకృతిలో గల విద్యుచ్ఛక్తి శాస్త్రజ్ఞునిచే కనిపెట్టబడి, పామరునిచే వాడుకొనబడుచున్నది. అయినను, విద్యుచ్ఛక్తి అననేమో నేటివరకును పామరునికే గాక శాస్త్రజ్ఞునకు కూడ తెలియదు. తెలియవలసిన అవసరమును కూడ లేదు. తెలియుట సాధ్యము కాదు. అది యున్నట్లు మానవునకు నిదర్శనము లభించుటయే జ్ఞానము. దానిని

వినియోగించుకొను ప్రకృతి ధర్మములను గౌరవించుటయే సంస్కారము. అట్లే సారూప్య విధానమున రోగ నివారణమగుట ప్రకృతిలోగల సత్యము. అది ఎట్లు జరుగుచున్నది అను విమర్శనవలన లాభము లేదు. జరుగుటలో కనిపించు అనుభవమే నిదర్శనము. ఐనను కుతూహలముగలవారి కొరకై యొక చిన్న వివరణమును హానిమన్ చూపుచున్నాడు.

రోగి దేహమునందు వ్యక్తమగు వేదనల సముదాయ మంతయు రోగ నివారణకు ప్రాణశక్తి చేయు ప్రతిక్రియకు ఫలితమే. ప్రాణశక్తి రోగమును బహిష్కరించుటకు, ఆరోగ్యమును మరల స్థాపించుకొనుటకు చేయు పోరాటము ఫలితములే వేదనలు. అట్టి సందర్భమున ఔషధమును ప్రయోగించినచో ప్రాణశక్తి మరింత తీవ్రముగా పోరాటము చేయును. కారణమేమనగా ఔషధము తన రోగమును దేహమున పుట్టించును. ఇది కృత్రిమ రోగము. దీని లక్షణములు రోగి లక్షణములతో సారూప్యము చెంది యున్నచో రెండింటియందును నొకే ప్రయత్నము జరుగును. ఔషధము నెక్కువగా వాడినచో ప్రాణశక్తికన్న ఔషధ రోగము యొక్క శక్తి ఎక్కువగును. అప్పుడు ప్రాణశక్తి దెబ్బతినును. కనుక ఔషధమును మోతాదు తగ్గించి సూక్ష్మీకరించి ప్రయోగించినచో ప్రాణశక్తిని

పోరాటమునకు పురిగొల్పునంతవరకే పనిచేయును. పోరాటము రెట్టింపగును. ఔషధము అల్పమే గనుక, ఔషధవ్యాధి సులభముగా బహిష్కరింపబడును. ఈ ప్రయత్నమున అంతకుముందున్న వ్యాధి కూడ బహిష్కరింపబడును. ప్రకృతియందలి నిదర్శనమునకు నిదియే సరియైన వివరణము కావచ్చును. లేదా దీనిని చదివిన వెనుక నెవరి నిర్ణయమును వారు చేసికొనవచ్చును. మనకు కావలసినది నివారణము గాని నిర్ణయముకాదు.

## నైసర్గిక వ్యాధులు - ఔషధ వ్యాధులు

**సూత్రము 30:** నైసర్గిక వ్యాధుల ప్రభావము కన్న ఔషధముల ప్రభావము ఎక్కువ నిశ్చితముగను, వాంఛనీయముగను ఉండును. పొంగు జ్వరము మొదలగు వ్యాధుల ప్రభావము సోకకుండునట్లు చేయచ్చునుగాని నాభి మొదలగు విషపదార్థముల ప్రభావమునకు గురికాకుండుట సాధ్యము కాదు.

వివరణము: వ్యాధులు నైసర్గికములని, కృత్రిమములని విభాగము చేయబడినవి కదా! అందు మానవులకు సంక్రమించు జబ్బులన్నియు నైసర్గికవ్యాధులు, ఔషధ ద్రవ్యముల వలన నుత్పాదింపబడినవి కృత్రిమ వ్యాధులు. ఈ రెండింటిలో నైసర్గిక వ్యాధుల నుండి తప్పించు

కొనవచ్చును గాని కృత్రిమ వ్యాధులనుండి తప్పించుకొనుట సాధ్యము కాదు. అంటువ్యాధులు మొదలైనవి పరిసరములలో నున్నను, అంటువ్యాధుల రోగులను తాకి సేవ చేసినను కొన్ని జాగరూకతలను వహించినచో ఆ వ్యాధులు సోకకుండ కాపాడుకొన వచ్చును. కాని నాభి అను విషము ప్రయోగము చేసినచో దాని ప్రభావము తనపై సోకకుండ తప్పించుకొనుట సాధ్యము కాదు. ఎట్టి విషద్రవ్యమును ప్రయోగించినను, అనగా ఔషధమును ప్రయోగించినను దాని ప్రభావమునకు గురికాకుండుట సాధ్యము కాదు. ఈవిధముగా మందులో నుత్పాదింపచేసిన వ్యాధి నైసర్గిక వ్యాధి కన్న నిశ్చితముగను, నిర్దిష్టముగను దేహమున సోకును. ఔషధము మోతాదు మన చేతిలో నుండును. పరిసరములనుండి సంక్రమించు వ్యాధులను మోతాదుగా సంక్రమింపచేయుట సాధ్యముకాదు. కనుక ఔషధ వ్యాధిని వాంఛనీయముగా మార్చుకొనవచ్చును.

**సూత్రము 31:** నైసర్గిక వ్యాధుల ప్రభావమున కలుగు మార్పులును, వేదనలును రోగియొక్క దౌర్బల్యమును బట్టి తీవ్రరూపము ధరించును. దౌర్బల్యము దేహతత్వము యొక్క చాంచల్యముమీద నాధారపడి యుండును. వ్యక్తిగతమైన చాంచల్యము అతని తత్త్వముపైనను, దాని తరహాపైనను ఆధారపడి యుండును. ఇది ముఖ్యముగా జీవస్రవంతి యొక్క దృఢత్వముపై నాధారపడి యుండును.

వ్యాధులు సంక్రమించుట విషయమున సూక్ష్మజీవులు, వ్యాధికారణ శక్తులు అప్రధానములు. ఆరోగ్యవంతుడైన వ్యక్తి సులభముగా అంటువ్యాధులచే స్పృశింపబడడు. ఉపద్రవములైన అంటువ్యాధులు సంభవించిన కాలమున ఆ ప్రదేశమందలి వ్యక్తులలో నెక్కువమందికి దాని స్పర్శ యున్నను అందు కొద్దిమంది మాత్రమే ఆ వ్యాధులకు గురి యగుదురు.

వివరణము: కలరా గాని, మశూచి గాని గ్రామము నందున్న దినములలో గ్రామస్థు లందరికిని ఆ వ్యాధి రాదు కదా! కాని గ్రామస్థులందరును దాని స్పర్శలోనే యున్నారు. అంటువ్యాధి యొక్క సూక్ష్మజీవులు గాలిలోను, నీటిలోను, ఆహారము నందును విహరించుచునే ఉన్నవి. గాలిలో అందరును వానిని పీల్చి విడుచుచునే ఉన్నారు. వారికందరికిని ఆ రోగము రాదు. కొందరికే వచ్చును. దీనినిబట్టి ఏమి తెలియుచున్నది? వ్యాధి సంక్రమించుటకు కారణము వ్యక్తియందే యుండును గాని సూక్ష్మజీవు లందుండదు. ఒక్కొక్క వ్యక్తి యందు ఆ వ్యాధికి చుట్టరికము వంటి దౌర్బల్యము ఉండును. వాని దగ్గరకే ఆ వ్యాధి వచ్చును. వానియందే సూక్ష్మజీవుల వంశాభివృద్ధి యుండును. ఆరోగ్యవంతుని దేహమునకు సూక్ష్మజీవులు సోకినచో అవి చనిపోవును.

**సూత్రము 32:** ఔషధముయొక్క ప్రభావము అట్టిది కాదు అది వ్యక్తి తత్త్వముపైనను, తరహాపైనను ఆధారపడి యుండదు. ప్రయోగించినపుడు రోగము పుట్టింపక వ్యర్థముగా పోదు. ఇది ప్రకృతి ధర్మము. ఇది లేనిచో శాస్త్రీయమైన ప్రభావమును నమ్ముట కాధారము లేదు. ప్రాణమయకోశమందలి కారణములు ఆ కోశమునందే కార్యములను పుట్టించును.

**వివరణము:** కలరా మున్నగు అంటువ్యాధుల వలెనే మందులు కూడ శరీర తత్త్వమును బట్టి పనిచేయుట, పనిచేయకుండుట అని ఉండదు. అట్లున్నచో మందులపై నెవ రాధారపడుదురు? ఔషధగుణముపై శాస్త్రీయముగా గురి కుదురుట ఎట్లు? ప్రకృతి యందలి ధర్మమును పరిశీలింపగా ఔషధముల ప్రభావము వ్యాధుల ప్రభావముకన్న భిన్నముగా పనిచేయును. ప్రకృతిసిద్ధముగా వ్యాధులు కొద్దిమందికి సంక్రమించి మిగిలినవారికి సంక్రమింపవు. మందుల ప్రభావము మాత్రము అందరిమీదను పనిచేయునదియై శాస్త్రీయ పరిశీలనకు కావలసిన నమ్మకము పుట్టించునదియై ఉన్నది. ప్రకృతిలో సూక్ష్మజీవులు మున్నగునవి భౌతికముగ మాత్రము సోకినపుడు ప్రాణశక్తిపై పనిచేయవు. ఔషధములను

ప్రాణమయ కక్ష్యలోనే సూక్ష్మీకరించి ప్రయోగించుచున్నాము గనుక ప్రతి వ్యక్తియందును ప్రాణమయ కక్ష్యలో పనిచేసి తీరును.

**సూత్రము 33:** మానవుని భావములను, అనుభవములను మార్పుచేయుటలో జబ్బులకన్న ఔషధములు నిశ్చయముగా పనిచేయునని సిద్ధాంతము.

**సూత్రము 34:** జబ్బుల వేదనలను పోలియున్న వేదనలనే మందులు కూడ పుట్టించును. జబ్బుల వేదనలకు సంబంధించిన చుట్టరికము ఔషధములు పుట్టించు వేదనలలో నున్నది. ప్రకృతి ఎపుడును సరూపమైన వేదనలను జతపరచుట వలన వ్యాధులను నివారించుచున్నది గాని వ్యతిరేక లక్షణములైన వేదనలను జతపరచి నివారించుట లేదు.

వివరణము: ప్రకృతి సిద్ధముగా కూడ మందులు వాడకయే జనులకు కొన్ని వ్యాధులు నివారణమగుచున్నవి. అందు సక్రమముగా నివారణమైన ఉదాహరణములను గ్రహించి ఆ నివారణమెట్లు జరుగుచున్నదో పరిశీలించవలెను. ఈ పరిశీలనల వలన తేలిన దేమనగా ప్రకృతి సిద్ధముగా నివారణమయిన వ్యాధులు అన్నియు సారూప్యము గల వేదనల బలములతోనే నివారణ

మగుచున్నవి. విపరీత లక్షణముగల వేదనలు పుట్టినచోట తాత్కాలికోపశమనమేగాని నివారణము జరుగుట లేదు. దీనికి కావలసిన ప్రకృతి పరిశీలన మెట్లు చేయబడినదో ఈదిగువ సూత్రముల వలన తెలియును.

## మూడు విధములైన ఔషధ ప్రయోగము

**సూత్రము 35:** వ్యాధి నివారణ ప్రయత్నమున ద్రవ్యముల నౌషధములుగా ప్రయోగించుటలో వేదనలను పుట్టించు ద్రవ్యములు వాడుటకు మూడు విధానములున్నవి.

**సూత్రము 36:** అందు మొదటి విధానము: సమాన బలము గల రెండు వ్యాధులు ఒకదానితో నొకటి పోలిక లేనివైనచో ఆ రెండును ఒకే కాలమున రోగి తత్త్వమునందు ఉండవచ్చును. నివారణమునకు లొంగని ఒక దీర్ఘవ్యాధి దానితో పోలిక లేని అంటువ్యాధు లనేకములను తన కన్న తక్కువ బలము కల వానిని సోకనీయకుండ కాపాడును. దీనికి ప్రమాణము లున్నవి.

వివరణము: సోరా వంటి దీర్ఘవ్యాధి దేహమున స్థిరపడిపోయి ఉన్నచో కొందరికి పొంగు జ్వరములు, టైఫాయిడ్, కలరా మున్నగునవి సోకవు. సోకకుండ ఆ సోరా కాపాడుచుండును. ఒక జంతువును చంపి తినుటకు పొదలో పులి వేచియున్నచో

దానిని మరియొక జంతువు చంపి తినకుండ కనిపెట్టి యుండును కదా! అట్లే సోరా స్థిరపడిన శరీర తత్త్వమున చిన్న చిన్న అంటువ్యాధులు సోకవు. అనగా తనకన్న తక్కువ బలము గల వ్యాధులను సోకనీయదు.

**సూత్రము 37:** సంవత్సరముల తరబడి అలోపతి వైద్యము చేసినను దీర్ఘవ్యాధులు నివారణ కావు. ఆరోగ్యవంతుని దేహమున పై వ్యాధి వేదనలతో సమానమైన వేదనలు పుట్టించలేని మందులతో తీవ్రమైన వైద్యము చేయకున్నచో ఆ మొదటి దీర్ఘవ్యాధి పెరుగకుండ అట్లే నిలబడి యుండవచ్చును. అప్పుడు వానియందు ప్రయోగింపబడిన ఔషధములలో పొరపాటున సారూప్యము చెందియున్న మందు ప్రయోగింపబడినచో ఆ దీర్ఘవ్యాధి నివారణము కూడ జరుగవచ్చును.

వివరణము: సోరా వంటి దీర్ఘవ్యాధి యున్నవారికి అలోపతి విధానమున సుదీర్ఘ కాలము వైద్యము చేసినను నివారణము కాదు. కారణమేమనగా అలోపతి మందులు వ్యాధితో సారూప్యము చెంది యుండవు. అవి పుట్టించు సంచలనము దేహమందలి వ్యాధితో సామ్యము లేనిది గనుక వ్యాధికన్న తక్కువ బలము కలిగి యున్నచో నెట్టి మార్పును పుట్టించదు. అట్లు జరుగుచుండగా చాలాకాలము ఆ

మొదటి దీర్ఘవ్యాధి వృద్ధిచెందక నిలబడి యుండవచ్చును. కాని దానికన్న బలమైన ఔషధములు విజాతీయ లక్షణములు కలిగియున్నచో ఆ మొదటి వ్యాధి అణచిపెట్టబడి వృద్ధి జెందును. అపుడు నివారణకు సాధ్యముకాదు.

ఈ విజాతీయ ఔషధములను దుర్బలములైన వానిని వాడుచున్నంత కాలము ఆ మొదటి వ్యాధి విజృంభింపక పోవచ్చును. అనుకొనకుండ ఒక సారూప్య ధర్మముగల ఔషధము తగిలినచో పూర్తిగా నివారణము కూడ పొందవచ్చును.

**సూత్రము 38:** ఇక రెండవ విధము: విజాతీయ లక్షణములు గల ఈ రెండవ వ్యాధి మొదటి దానికన్న బలీయమైనచో దానిని కనిపింపకుండ అణచిపెట్టును. ఈ రెండవ వ్యాధి దేహమును విడచిపోయిన వెంటనే మరల ఆ మొదటి వ్యాధి తలయెత్తి విజృంభించును. దీనికి కూడ నుదాహరణములు చూపబడినవి.

**వివరణము:** మొదట దేహమునందున్న దీర్ఘవ్యాధికన్న విభిన్న లక్షణములు కలిగి, దానికన్న బలముగా నొక రెండవ వ్యాధి దేహమున సంక్రమించె ననుకొనుము. రెండింటిలో అది బలవంతమైనపుడు మొదటిదాని

లక్షణములను తాత్కాలికముగా పూర్తిగా మాయము చేయును. ఈ రెండవ వ్యాధి తొలగిపోయిన వెంటనే మరల ఆ మొదటి వ్యాధి లక్షణములు ప్రత్యక్షమై తీవ్రముగా విజృంభించును. ఉదాహరణకు: పదిసంవత్సరములనుండి నిలబడియున్న కాలివాపు జ్వర మారంభించినంతనే మాయమగును. మరల జ్వరము నివారణ మయినంతనే యథాస్థానమున కాలి వాపు వచ్చును. దీనిని బట్టి గ్రహింపవలసిన దేమనగా, ఉన్న వ్యాధి కన్న భిన్నమైన వేదనలు పుట్టించు మందును అంతకన్న నెక్కువ బలముగా ప్రయోగించినచో వ్యాధి లక్షణములు మాయమగును. ఔషధ ప్రభావము తొలగిపోయినంతనే మరల ఆ వ్యాధి లక్షణములు పూర్తిగా తిరిగి వచ్చును. ఉదాహరణకు: తలనొప్పి పుట్టించు వ్యాధి దేహమున నున్నపుడు బలమైన ఆస్ప్రో మోతాదు వాడినచో తలనొప్పి మాయమగును. మోతాదు ప్రభావము తొలగినంతనే మరల తలనొప్పి వచ్చును. అందు మొదట నున్న వ్యాధికి తలనొప్పి పుట్టించు లక్షణమున్నది. ఆస్ప్రో ఔషధమునకు తలనొప్పిని పోగొట్టు లక్షణమున్నది. ఈ రెండింటికిని సారూప్యము లేదు. కనుక వ్యాధి నివారణ కాదు.

**సూత్రము 39:** ఒక వ్యాధి ఎంత తీవ్రముగా దేహమున ప్రవర్తించినను, అంతకుముందున్న వ్యాధి లక్షణములతో

పోలిక లేనపుడు ఆ లక్షణములను అణచిపెట్టగలదు. ఎంత గట్టిగా అణచిపెట్టినను నివారణ చేయలేదు. ఈ సత్యము కొన్ని వందల సంవత్సరముల పరిశీలనవలన తెలియును. అట్లే లక్షణములతో పోలిక లేని ఔషధమును ఎంత తీవ్రముగా వాడినను, అంతకుముందున్న వ్యాధి లక్షణములను అణచిపెట్టినను నివారణము సాధ్యము కాదు. కాకపోగా రోగిని నీరసింపజేసి, ఉన్న రోగమున తికమకలు పుట్టించును.

**సూత్రము 40:** ఇక మూడవ విధానము: రెండు విజాతీయములైన వ్యాధులు ఒకదానినొకటి నివారణ చేయలేవు గనుక ఒకే శరీర తత్త్వమున సమకాలికముగా కాపురము చేయుటకు వీలున్నది. అందొక్కొక్కటి తన కనుకూలమైన దేహభాగమును కేటాయించుకొని ఆక్రమించును. కాలపరిమితితో సంబంధము లేక దీని వేదనలను అది వేరు వేరుగా పుట్టించును. దీని కుదాహరణములు చూపబడినవి.

వివరణము: సోరా వ్యాధి దేహమున నుండి మూర్ఛలను కొందరికి పుట్టించుచుండును. మూర్ఛల నాపుటకు గార్డినాల్, టెగ్రిటాల్, డైలాంటియన్ - సోడియం మొదలగు మందుల మోతాదులను వాడుదురు. ఇవి

మూర్ఛకన్నా బలమైన మోతాదులు వాడినపుడు విజాతీయ లక్షణములు కలవి గనుక మూర్ఛలను అణచిపెట్టును. ఉన్న వ్యాధికి లక్షణములు మూర్ఛలు, ప్రయోగించిన ఔషధము లక్షణము మత్తును కలిగించుట, మూర్ఛను రాకుండ అణచి పెట్టుట. కనుక నివి విజాతీయములు. వీనికి వేదనా సామ్యము లేదు. ఈ వైద్యము కొంతకాలము జరుగగా నివారణ సాధ్యముకాదు గనుక మూర్ఛవ్యాధి పెరిగి బలిష్ఠమగును. దానితో బలము సరితూగక పోవుటచే ఔషధము అణచిపెట్టలేక పోవు స్థితి వచ్చును. దానితో ఔషధము మోతాదును పెంచుదురు. నిరంతరము పెంచుచు వాడబడిన ఔషధము తన వ్యాధిని వేరుగా దేహమును వృద్ధిచేయును. మూర్ఛల వ్యాధి వలన నరములు నీరసించుట, కండరములు మున్నగునవి దెబ్బతినుట జరుగును. దానితో సంబంధము లేకుండ ఔషధవ్యాధి వలన మత్తు, జ్ఞాపకశక్తి కోల్పోవుట, తెలివి తగ్గిపోవుట, ఉన్మాదము కలుగును. కాలక్రమమున ఈ రెండు వేరు వేరు వ్యాధులును బలిష్ఠములై రోగిని చంపును.

**సూత్రము 41:** ఈవిధముగా రోగి లక్షణములకు సరిపడని ఔషధములను నిరంతరముగా వాడుటవలన ఉన్న వ్యాధితో సంబంధము లేని ఔషధవ్యాధి వేరుగా, కృత్రిమముగా పుట్టింపబడును. అది మొదటి వ్యాధితో

తికమకలు కలుగుచేయును. ఇక తగ్గుటకు వీలుకాని పరిస్థితినో, చాలా శ్రమతో తగ్గవలసిన పరిస్థితినో తయారు చేయును. రోగి యందు మొదటనున్న నైసర్గిక వ్యాధులు తేలికగా నివారణ మగునట్టి లక్షణములు కలిగి ఉండును. కనుక సిద్ధముగా తయారుచేసి అమ్మబడుచున్న మందులను తెలివి తక్కువగా వాడుట వలన జనులలోని ఆరోగ్య సంపద తరిగిపోవుటయు, దీర్ఘవ్యాధులు పెరిగిపోయి అవిటివారగుటయు జరుగును. ఇట్టి మందుల వలన కలిగించు తాత్కాలికమైన ఉపశమనము మోసకారి. అది నివారణకు వీలుకాని హానికరములైన దీర్ఘవ్యాధులను ఆహ్వానించుటకు సహాయపడును.

## ప్రకృతియందు జరుగుచున్న వైద్యము

**సూత్రము 42:** రెండు విజాతీయములైన వ్యాధులను దేహమున నుండనిచ్చుట, ఉండుట సాధ్యమగుట ప్రకృతి లక్షణము, అందొకవ్యాధి రెండవ దానిని ఉన్మూలనము చేయుటగాని, రద్దుచేయుటగాని, నివారణ చేయుటగాని సాధ్యముకాదు.

**సూత్రము 43:** రెండు సారూప్యము గల వ్యాధులు అదే

శరీరమున కలసినచో ఫలితములు వేరుగా నుండును. ఈ విధమైన ఉదాహరణమును గమనించినచో ప్రకృతి ఎట్లు వ్యాధులను నివారించు చున్నదో, దానిని ఒక కళగా అనుకరించినపుడు వ్యాధి నివారణ విద్య మన కెట్లబ్బునో నిదర్శనపూర్వకముగా తెలియును.

**వివరణము:** మశూచి వ్యాధి పుట్టించు వేదనలలో మంట పుట్టునట్టి నీటిపొక్కులొక లక్షణము. కనుక చాల కాలమునుండి నీటిపొక్కులు వచ్చుచు తగ్గుచున్న వానికి మశూచి వచ్చి తగ్గినచో నీటిపొక్కుల వ్యాధి శాశ్వతముగా నివారణ మగును. అట్లే చీము పొక్కులు, సుదీర్ఘముగా బాధించు దగ్గు, నీళ్ళ విరేచనములు మున్నగు వేదనలు కొన్ని వందలు మశూచి వ్యాధియందు ఒక్కొక్కరికి కొన్ని కొన్ని చొప్పున వారి తత్త్వమును బట్టి పుట్టుచుండును. ఈ వేదనలతో దేనికి సామ్యమున్న వ్యాధియైన అంతకు ముందున్నచో అది మశూచిలో పూర్తిగా నివారణమై పోవును. ఇది పరిశీలనము వలన నిదర్శనముగా తెలియునట్టి ప్రకృతి ధర్మము. అనగా ప్రకృతి రోగులలో సారూప్య విధానము పుట్టించి రోగ నివారణకు సహాయపడుచున్నదని తెలిసి కొనవలెను.

**సూత్రము 44:** పోలికలు గల రెండు వ్యాధులలో నొకదాని

నొకటి ఎదుర్కొనుటగాని, అణచిపెట్టుటగాని, తికమకలు కలిగించుటగాని సంభవము కాదు. సామ్యము లేని రెండు వ్యాధులు ఈ మూడప్రకారములను కలిగించును.

**సూత్రము 45:** రెండు వ్యాధులకు స్వభావములో భేదమున్నను వేదనలు పుట్టించుటలో సామ్యమున్నపుడు, అవి యొకే శరీరమున ఏక కాలమున సంభవించినపుడు అందు బలీయమైనది రెండవదానిని శాశ్వత నివారణ చేయును. వ్యాధులు భౌతికములు గాక శక్తియొక్క వికారము లగుటచేత అందు శక్తి యుండునుగాని వ్యాధి యనబడు పదార్థ ముండదు. అట్టివి రెండు ఒకదానిలో నొకటి ఇమిడినప్పుడు చిన్నది పెద్ద దానిలో అంతమగును. ఈ సూత్రము ననుసరించి ఆటలమ్మ వ్యాధి చీముచేత అంటుపరచినపుడు ఇక వాని శరీరమునకు మశూచికము సోకకుండ కాపాడునట్టి ప్రతిఘటన శక్తి ఏర్పడును. ఆటలమ్మకును, మశూచికిని వేదనలయందు సామ్యముండుటయే ఇట్లు నివారణ మగుటకు కారణము.

**వివరణము:** 1. రెండు వ్యాధుల స్వభావములో భేదమున్నను వేదనలు పుట్టించుటలో సామ్యముండవలెను. ఒకనికి పాదమున తేలు కుట్టినచో బాధ పాదమునుండి ఊర్ధ్వముగా నెగబ్రాకును. మరియొకనికి పాదముమీద దురదతో కూడిన చర్మవ్యాధి ఆరంభించి ఊర్ధ్వముగా

కాలిమీదకు ప్రాకును. మూడవవానికి కాలి వ్రేలియందు తిమ్మిరి ప్రారంభించి క్రమముగా కాలిమీదకు వ్యాపించును. ఈ ముగ్గురికిని వ్యాధుల స్వభావమున భేదము ఉన్నది. కాని ఊర్ధ్వముగా ప్రాకుట అను వేదనలో సామ్యమున్నది. ఇట్టి వ్యాధులొకే దేహమున నేర్పడినపుడు బలమైనది రెండవదానిని శాశ్వత నివారణ చేయును.

2. వ్యాధియందు శక్తియొక్క వికారమేగాని పదార్థము ఉండదు గనుక ఒక వ్యాధి యింకొక దానిని నివారణ చేయుట సంభవము. ఒక చోటనే సన్నని వెలుగు, దానిపైన పెద్ద వెలుగు కిరణములను ప్రసరింప చేసినచో సన్నని వెలుగునకు వేరుగా అస్తిత్వముండక అంతరించును. పెద్ద వెలుగు ఒక్కటే ఉండును. అట్లే ఎక్కువ బలముగల వ్యాధి తక్కువ బలముగల దానిని శాశ్వత నివారణ చేయును.

అట్లుగాక దేహ ద్రవ్యమునందు వ్యాధియున్నదని భ్రమపడి ఔషధ ద్రవ్యమును ప్రయోగించుచున్నారు గనుకనే అలోపతిలో శాశ్వత నివారణ ముండుట లేదు. ఉదాహరణకు: రేడియం ప్రసారముతో క్యాన్సరు జీవకణములను కాల్చినపుడు మిగిలిన కణములు క్యాన్సరు అగును. దీనిని బట్టి వ్యాధి కణములలో ఉండదని తెలియుచున్నది. అది శక్తి స్వరూపముగా నుండి కణములలో

మార్పు తెచ్చుచున్నది.

సూత్రము 46: ప్రకృతి సిద్ధముగా జరుగుచున్న పై సంఘటనలకు నిదర్శనములే ఈ దిగువ ఉదాహరణములు:

·1. ఒకనికి మశూచి వచ్చి పోయిన తరువాత కంటి జబ్బు నయమైనది.

2. ఒక చర్మవ్యాధి నణచిపెట్టుట వలన నొకడు గ్రుడ్డివాడయ్యెను. కొంతకాలమునకు మశూచి వచ్చి తగ్గగా వాని దృష్టి చక్కబడెను.

3. మశూచి వలన నొకనికి చెముడు పూర్తిగా నివారణ మయ్యెను.

4. మరియొకనికి చాలకాలమునుండి స్థిరపడి యున్న వృషణముల వాపు తగ్గిపోయెను.

5. ఆటలమ్మ వచ్చి తగ్గిన వానికి మశూచి వచ్చినచో చాలా తేలికగా వచ్చి పోవును.

6. ఆటలమ్మ చీముతో టీకాలు వేసినవానికి మశూచి రాదనుట ఎల్లరు నంగీకరించినదే.

7. ఆటలమ్మ వలన దురదలు, పొక్కులు తరచుగా

నివారణ మగును.

8. పొంగు జ్వరము చర్మవ్యాధులను నివారించును.

9. ఆటలమ్మ వలన మలేరియా జ్వరము నివారణ మయ్యెను. దీనిని ఆధారముగా గొని హంటర్ అను శాస్త్రజ్ఞుడు ఒక సిద్ధాంతము చేసెను. "సామ్యముగల వేదనలతో కూడిన రెండు జ్వరవ్యాధులు ఒకేమారు సోకుట సంభవము కాదు."

వివరణము: ఈ తొమ్మిది ఉదాహరణములను బట్టి తేలున దేమనగా వేదనా సామ్యమున్నచోట చిన్నవ్యాధిని పెద్దవ్యాధి పూర్తిగా నివారించును.

**సూత్రము 47:** వైద్యము నొక కళగా నభ్యసింప దలచిన వాడు వ్యాధి నివారణ మెట్లు చేయవలెనో అను విధానమును ప్రకృతి ప్రయోగ పూర్వకముగా ప్రదర్శించుచున్నాడు. ఔషధముల వలన కృత్రిమ వ్యాధుల రూపమున శక్తిని ఉత్పాదించి నైసర్గిక వ్యాధులయందు ప్రయోగించుటకు వైద్యుడెట్లు ఔషధ నిర్ణయము చేయవలెనో, ఔషధము నకును, వ్యాధికిని గురిపెట్టుట ఎట్లో ఆ విధానమును గూర్చిన సిద్ధాంతమును ప్రకృతి హేతుబద్ధముగా సిద్ధపరచి చూపుచున్నది.

వివరణము: వేదనా సామ్యము గల రెండు వ్యాధులలో నొకటి ఇంకొకదానిని నివారించుట ప్రకృతియందు గమనించితిమి గదా! దీనినిబట్టి వైద్యుడు రోగియందున్న వ్యాధిని నివారించుటకు రెండవ వ్యాధిని ఉత్పాదించుట నేర్చుకొనవలెను. దానిని కృత్రిమముగా పుట్టించుటకు మాత్రమే ఔషధము వాడవలెను. వేదనా సామ్యము గల కృత్రిమ వ్యాధిని పుట్టించు మందును గురిపెట్టుట నేర్చుకొనవలెను..

**సూత్రము 48:** ప్రకృతియందైనను, వైద్య కళయందైనను వ్యాధులు నివారణమగుటకు వేదనా సామ్యము గల రెండవ వ్యాధిని పుట్టించుట తప్పదు. ఈ రెండవ వ్యాధి రోగియందలి నైసర్గిక వ్యాధి కన్న నెక్కువ బలమైనదిగా నుండునట్లు పుట్టింపవలెను.

**సూత్రము 49:** ఈ మూల సూత్రమును నిరూపణ చేయుటకు నుదాహరణములు కొల్లలుగా కనిపించును. మనము దీనిని ఋజువు పరచుటకు ప్రయోగాత్మకములైన ఉదాహరణములను కూడ కొల్లలుగా పుట్టించవచ్చును.

**సూత్రము 50:** వ్యాధి నివారణకు నిస్సహాయముగా ప్రకృతియొకటే పనిచేయుచున్నపుడు దాని సాధనసంపత్తి పరిమితమైనది. ఒక వ్యాధితో దానిని పోలిన మరియొక

వ్యాధిని నివారణ చేయుట ఆచరణీయము కాదు. ఎట్టకేలకు వ్యాధి ద్రవ్యముల నుపయోగించు పద్ధతిని ప్రజలపై ప్రయోగించుటలో కొంతవరకు ఆచరణీయత లభించినది. కంఠసర్పి (Diphtheria) నివారణకు డిప్తీరియా వ్యాధి ద్రవ్యము వాడబడుచున్నది. ఇచ్చట సామ్యము గల మరియొక వ్యాధికి బదులు అదే వ్యాధి ద్రవ్యము వాడబడుచున్నది. ఇట్టి వ్యాధి ద్రవ్యములు మున్నగునవి అదే వ్యాధిని నివారణ చేయుటకుగాని, రాకుండ చూచుటకుగాని వాడబడు చున్నవి. శీతజ్వరములు సోకునట్టి లక్షణమును పోగొట్టుటకై రోగికి ఏ పుష్పము యొక్క పుప్పొడి పడదో దానినే వాడుచున్నారు. ఇంతకన్న (అదే వ్యాధి ద్రవ్యము నుపయోగించుట కన్న) లక్షణ సామ్యముగల వ్యాధిని పుట్టించు ద్రవ్యమును వాడుట ఉత్తమము. ఔషధము సరిగా సరిపోయినపుడు ఔషధ లక్షణములకును, వ్యాధి లక్షణములకును అభేదమే కలుగుచున్నది. ఈ మార్గముననే మానవుడు వ్యాధి విమోచనము చేసికొనవలెను. ప్రకృతిధర్మములపై నాధారపడిన మార్గమును కల్పించుకొని ఇట్లు ప్రయోగము చేసినచో వ్యాధి నివారణము శీఘ్రముగను, సౌమ్యముగను, పరిపూర్ణముగను జరుగును. నివారణ సూత్రమును ప్రకృతి ధృవపరచుచున్నది గనుక దానిని కల్పించి వినియోగము

చేయు మార్గము కూడ ప్రకృతియే సమర్థించుచున్నది. ఇట్లు వైద్యకళ యొక్క ఆవశ్యకతను తెలుపుటయు, దారి చూపుటయు కూడ ప్రకృతియే చేయుచున్నది.

వివరణము: 1 మానవులకు పరిసరములు కారణముగా వచ్చుచున్న రోగములచేత ఉన్న రోగములను నివారణము చేయుట సాధ్యముకాని పని. ఒక రోగమున్నవానికి మరియొక రోగము వచ్చువరకు వేచి ఉండవలెను. అది కూడ మొదటి రోగముతో సారూప్యము చెందిన వేదనలు గల రోగమే రావలెను. ఇది సాధ్యము కాదు. కాదని వేచియున్నచో రోగి చనిపోవును. కనుక ప్రకృతి సిద్ధములైన రోగములతో ఉన్న రోగమునకు చికిత్సచేయుట హాస్యాస్పదము. ప్రకృతిలోని ధర్మములను గ్రహించి వానిని తన వైద్యవిద్య యందు అమలుపరచుకొనవలెను. రోగములను నివారించుటకు సూటిగా కావలసిన రోగములను కృత్రిమముగా పుట్టించుట నేర్చుకొనవలెను. దానికొరకే మందులు, మరియు ఈ కృత్రిమ రోగమును ఆ నైసర్గిక రోగముకన్న కొంచెము ఎక్కువ బలముగా పుట్టించుట నేర్చుకొనవలెను. మందు పరిమాణమును, మోతాదును మార్చుటవలన నిది సాధ్యమగును.

2. అలోపతి వారు ఈ సిద్ధాంతమును వాడుట

నొకవిధముగా నేర్చుకొని యున్నారు. టీకాలు వేయుట, డిప్తీరియా వ్యాధి ద్రవ్యమును ఉపయోగించుట, కలరా నివారించుటకు ఇనాక్యులేషన్ చేయుట హోమియో సిద్ధాంతమునకు దగ్గర సంబంధముగల పద్ధతులే. మశూచి చీమును రక్తస్పర్శ చేయుట వలన దేహమందలి ప్రాణ శక్తియందు పోరాటము రేగి ఆ వ్యాధి సోకకుండ రక్షించుకొను శక్తి మేల్కొనుచున్నది. కనుకనే టీకాలు సవ్యముగా వేయించుకొనిన వారిలో చాలమందికి మశూచి రోగము రాదు. అట్లే డిప్తీరియా, పోలియో, కోరింత దగ్గు, క్షయవ్యాధి మున్నగువాని విషయమునను అలోపతివారు ఈ మార్గము నవలంబించుచున్నారు.

అయినను వారవలంబించు మార్గమునకును, స్వచ్ఛమయిన హోమియో విధానమునకును కొంత భేదమున్నది.

ఎ) టీకాల చీము మున్నగు వ్యాధి ద్రవ్యములను వారు సూక్ష్మీకరించి వాడక భౌతికమైన చీమునే ఎక్కించుచున్నారు. కనుక కొందరికి పొక్కుట, బాడెలుపడి మానకుండుట, నెలల తరబడి జ్వరము, దగ్గు, న్యుమోనియా మొదలగు దుష్టబాధలు పీడించుట, కొందరు శుష్కించి చనిపోవుట జరుగును.

బి) ఇట్టి స్థూల విషములను వ్యాధి నివారణమునకు గాక వ్యాధి రాకుండ కాపాడుటకు వాడుచున్నారు. దానితో ఆరోగ్యవంతులకు ఈ చీము విషముతో, ఉన్న ఆరోగ్యము చెడిపోయిన సన్నివేశములు కూడ గలవు.

సి) వ్యాధిని పోలిన వేదనలు పుట్టించు ద్రవ్యమును వాడుట ప్రకృతినుండి హోమియోవారు నేర్చిన సూత్రము. టీకాల విషయమున అట్లుకాక అదే వ్యాధి ద్రవ్యమును వాడుచున్నారు. ప్రకృతి మనకు నేర్పునది పోలికయున్న మరియొక వ్యాధిచే నివారణ చేయించుటయే గాని ఆ వ్యాధినే ఆ వ్యాధిపైన ప్రయోగించుట కాదు. టీకాల విషయమున కూడ ఆటలమ్మ విషద్రవ్యముచే మశూచి నివారించుట, రాకుండ చేయుట ఉత్తమ ఫలితముల నొసగును గాని మశూచి చీమునే వాడుట వలన ఈ పరిపూర్ణత సిద్ధించుట లేదు. కాబట్టి టీకాలు, ఇనాక్యులేషను మున్నగునవి హోమియోపతీ వంటి పవిత్ర పద్ధతులని నమ్మి మోసపోరాదు.

**సూత్రము 51:** ప్రకృతి మన రోగ నివారణకు సహాయపడుటకై మనపై ప్రయోగించు రోగముల సంఖ్య మిక్కిలి పరిమితము. ఇక మానవుని యధీనమున నున్న ఔషధ ద్రవ్యములు వందల సంఖ్యలో నున్నవి. ప్రకృతిలోని అనేక కక్ష్యల నుండి గ్రహింప దగిన ఔషధ ద్రవ్యములు

కొల్లలుగా నున్నవి. వానిని సూక్ష్మీకరించి, కావలసిన బలముతో నుపయోగించుట నిర్వహింపవచ్చును. మోతాదు పరిమాణమును కూడ తానే నిర్ణయింప వచ్చును. ఎన్ని మోతాదులను వాడవలెనో, వ్యాధిని త్వరగా నిర్మూలనము చేయుటకు వానిని ఎట్లు మార్చుకొనవలెనో దానికి వీలున్నది.

వివరణము: 1. ప్రకృతిలో సంభవించు మశూచి వంటి వ్యాధులు మానవుని ఇతర వ్యాధులను పోలిక యున్నంత వరకు నివారింప గలవు. కాని మానవులకు సంభవించు వ్యాధులు వందల సంఖ్యలో ఉన్నవి. ఇవన్నియు వ్యాధుల బాధలు, అయినను ఒకని వ్యాధి రూపమునకును, మరియొకని వ్యాధి రూపమునకును సంబంధము లేదు. వీనిని నివారింపగల వ్యాధులు ప్రకృతిలో నెక్కువ సంఖ్యలో లభింపవు. ఇక మందుల విషయ మట్లు కాదు. ఎన్ని వందల వ్యాధి భేదములు వున్నవో అన్నిటిని మించిన వందల ఔషధ ద్రవ్యములు ఉన్నవి. లక్షణముల పోలికను బట్టి ఎన్నుకొనుట సులభము.

2. ప్రకృతిలో అనేక కక్ష్యల నుండి మనకీ ఔషధ ద్రవ్యములు లభించును. అనగా వృక్షములు, ఖనిజములు, రసాయనిక పదార్థములు, జంతువుల విషములు, అయస్కాంత ద్రవ్యములు, విద్యుత్ప్రసారము చేయబడిన

పదార్థములు, వ్యాధి గ్రస్తుల శరీరమునుండి స్వీకరింపబడిన ద్రవ్యములు, ఎక్సురే, రేడియం, యురేనియం మొదలగు జ్యోతి ప్రసార ద్రవ్యములు మున్నగు కక్ష్యల నుండి అపారముగా ఔషధ ద్రవ్యములు లభించును.

3. మశూచి మున్నగు వానిని అవకాశము తీసికొని వ్యాధులను నయము చేయవలెనన్నచో ఉన్న వ్యాధికి గల బలమును తూకము కట్టి దానిని బట్టి కావలసిన బలముతో రోగములు పుట్టించుట సాధ్యము కాదు. ఔషధములతో నిట్లు పుట్టించుట సాధ్యము. ఉన్న రోగతీవ్రతను బట్టి మోతాదును కాలవ్యవధిని నిర్ణయించి ఔషధములను వాడి నివారణమును శీఘ్రముగను, సక్రమముగను పొంద వచ్చును. కనుక ప్రకృతి చూపిన మార్గమున మానవుడు మందులతో వైద్యము చేయుట చక్కని పురోగతిని తెలియచేయును.

**సూత్రము 52:** ఉన్నవి మూడు పద్ధతులు.

ఎ) బాధలకు ఉపశమనము తాత్కాలికముగ చేయుట.

బి) సంబంధము లేని గుణములు గల మందులను వాడి వానితో వ్యాధి బాధలను కప్పిపుచ్చుట.

సి) మందులవలన పుట్టిన క్రొత్త వ్యాధులతో పాతవానిని పెనవేసి గజిబిజి చేయుట.

ఈ మూడు పద్ధతుల నవలంబించుట అలోపతి యొక్క ప్రత్యేకత, వాని దుష్ఫలితముల నెరిగిన వైద్యుడు, బాధ్యత నెరిగి తెలివి గలిగినవాడెవడును ఆ మార్గముల నవలంబింపడు.

వివరణము: బాధ్యత తెలిసి గ్రహణశక్తి గల వైద్యునకు హోమియోపతీ విధానము తప్ప మరియొకటి ఆచరణీయము కాదని చెప్పుచున్నాడు.

సూత్రము 53: నిజమైన నివారణ సౌమ్యమైన పద్ధతిలో జరుగవలెనన్నచో హోమియోపతీ నియమములను అనుసరించుటయే మార్గము. ఈ నియమములు శాశ్వతమైన, నిర్వికల్పమైన ప్రకృతియందు లభించిన నివారణ ధర్మములను అనుసరించినవి.

వివరణము: ప్రకృతి మానవునికన్న శాశ్వతము. అది మానవునే గాక సమస్త జీవరాసులను, పంచభూతములను, ద్రవ్యమయ, ప్రాణమయాది కోశములను, సప్తధాతువులను, మనసు బుద్ధి మున్నగు ప్రజ్ఞలను, పరమాణువులను, సౌరకుటుంబములను సృష్టించి పెంచుచున్నది గనుక

అందున్న ధర్మములు సత్యములు. వాని ననుసరించి వైద్యము నేర్పుట సత్యమైన మార్గము.

## అలోపతి విధానము వలన గలుగు నష్టములు

**సూత్రము 54:** అలోపతి విధానము, ఉపశమన విధానము, హోమియోపతీ విధానము అను మూడింటిలోను మూడవ దానివలన మాత్రమే నివారణము సాధ్యము.

**సూత్రము 55:** అలోపతి విధానము పూర్వమే వివరింపబడినది.

**సూత్రము 56:** ఉపశమన విధానము రోగిని సంతోషపెట్టును. వైద్యుని ఘనతను పెంచును. కాని పర్యవసానమున ఈ రెంటిని భంగపరచును. దానివలన రోగ నివారణకు మందులు తెలియని స్థితి వచ్చును. వైద్యుడు రోగతంత్రమును పరిశీలించు నాస్తికుడు అగును.

**సూత్రము 57:** అలోపతి విధానము వేదనలను తొలగించుటకు యత్నించునుగాని వ్యాధిని తొలగించుటకు ప్రయత్నము చేయదు. నొప్పి తెలియకుండుటకు, నీళ్ళ విరేచనములను బంధించుటకు నల్లమందు వాడుదురు.

విరేచన బద్ధకము తొలగించుటకు విరేచనము పుట్టించు మందులు వాడుదురు. దేహమునందే భాగమునకైన బాధ తొలగించుటకై మలద్వారమందలి మలమును తొలగింతురు. దేహము చల్లబడు చున్నపుడు వేడినీళ్ళ స్నానము చేయింతురు. నీరసముగా నున్నపుడు ఉత్తేజము కలిగించుటకై ద్రాక్ష సారాయిని త్రాగింతురు. ఒరసికొనిన భాగములకు శీతలోపచారములు చేయుదురు. ఇట్టి ప్రక్రియలలో వాడుటకు పనికివచ్చునని అల్ప సంఖ్యాకములైన కొన్ని మందులు కేటాయింపబడినవి.

**సూత్రము 58:** ఇట్టి అలోపతి విధానము నందుగల దోష మేమనగా అందలి ప్రక్రియ యొక్కొక్కటి ఒక్కొక్క వేదన నుద్దేశించి యుండును గాని వ్యాధికి సంబంధించి ఉండదు. రోగ నిర్ణయ పరీక్ష ఎంత సూక్ష్మముగా, స్వయం సంపూర్ణముగా జరిగినను, అందలి వైద్యము తాత్కాలికమైన ఉపశాంతిని మాత్రవేు కలిగింవ గలదు. ఈ అసంతృప్తికరమైన ఫలితములకు కారణము వ్యాధిని గూర్చిన దురభిప్రాయము, వ్యాధిలోనొక భాగమునకు మాత్రమే సంబంధించినట్లు వాడబడు పరిమిత ద్రవ్యములు ఉండును. ఉన్న వేదనలలో నేది ఎక్కువ ప్రాముఖ్యము వహించునో దానిని ముఖ్యముగా నుద్దేశించి, కేటాయించి, నివారించు భ్రాంతిలో నీ వైద్యము జరుగును. ఇట్లు

కలిగించిన ఉపశమనము అయిపోయినంతనే వ్యాధి బాధలు మరింత తీవ్రముగా తిరిగి ప్రత్యక్షమగును. ఈ ఉద్రిక్త పరిస్థితిని గూర్చి అలోపతి వైద్యులు చెప్పునట్టి సమాధానమేమి? వెనుకటి వ్యాధి మరల తిరుగబెట్టినదని చెప్పుదురు. లేదా క్రొత్తగా మరల వ్యాధి సంభవించినదని చెప్పుదురు. ఈమారు అంతకన్న విపత్కరముగను, శౌర్యవంతముగను వ్యాధిపై దాడిచేయుదురు. ఔషధముల మోతాదును, బలమును పెంచి మరల అదేవిధమున తగని పద్ధతిలో పోరాడుదురు. చిట్టచివరకు ఈ మందుల వలన పుట్టిన దుష్పరిణామములు ముదిరి ముదిరి రోగి ఆరోగ్యమును శిధిలము చేయుటయు, రాను రాను ఆ మందుల వలన ఆశించిన ఉపశమనము గూడ లభింపక పోవుటయు జరుగును. హమాండ్ అను వైద్యనిపుణుడు నిద్రపుట్టించు వైద్య ప్రక్రియలో నిపుణుడని ప్రసిద్ధి చెందెను. నిద్రకు బ్రోమైడ్ ద్రవ్యములను వాడుట నేర్పెను. దీర్ఘకాల పరిశీలన తరువాత ఆ బ్రోమైడ్ మందులే చాలమందికి పిచ్చిపుట్టించి ఉన్మాదవైద్యాలయమునకు తరలించుటకు కారణములైనవని అతడే అంగీకరించి వ్రాసెను. అట్లే విరేచనములు అగుచుండుటకు వాడునట్టి మందులు ఎట్టి ఆపదలను పుట్టించునో అను విషయము వానిని వాడు వైద్యులలో నొక్కడును గ్రహింపలేదు. విరేచనము లగుటకు

తరచుగా మందులు వాడుట కూడ పిచ్చిని పుట్టించుటకు కారణము. వానివలన పెద్ద ప్రేవులు దౌర్బల్యము చెంది శిధిలమగుటయు, క్రమముగా మైకము పుట్టి తెలివి తప్పుటయు వాని దుష్పరిణామము. ఇదిగాక అనేక చిల్లరబాధలు కూడ కలుగును. ఈ విరేచనముల మందులతో కాలేయము (Liver), మూత్రపిండములు (Kidneys) చిన్నప్రేవులు, పెద్దప్రేవులు మొదలగునవి ఎట్టి ఆపదలకు గురి అగునో తెలియలేరు. కాలక్రమమున ఈ అవయవములు వికలములై, ఔషధముల వలన అతిగా పనిచేసి అలసిపోయి ఇక మలవిసర్జనమును చేయలేని స్థితికి వచ్చును. తిన్నగా పనిచేయుచున్నఅవయవము తాను చేయవలసిన పనిని సక్రమముగా నిర్వర్తించును. ఎక్కువగా పనిచేయించుటవలన అలసిపోయిన అవయవము తాను చేయకూడని పనులను చేయును. అతిగా పని చేయించిన ప్రేగులలోని మృదువైన చర్మము దుష్టపదార్థములను పీల్చుకొనును. దానివలన మత్తు మైకము, అధికమైన రక్తపోటు, కీళ్లనొప్పులు, గుండె కండరములు జబ్బు పడుట, కాలేయము చెడుట, మూత్రపిండములు మందకొడి యగుట సంభవించును. ఇంకను నాగరికులు పడుచున్న బాధలన్నియు దీనివలననే పుట్టుచున్నవి. ఇట్టి దుర్విధి రూపములైన ప్రాణప్రమాదకర

ములగు బాధలు జీవిత సౌఖ్యమును అపహరించి త్వరగా తుదముట్టించును. ఈ విపరిణామములు రెండు విధములుగా జరుగుచున్నవి.

ఎ) వ్యాధి ప్రాథమికదశలో వాడగూడని మందులను వాడుట.

బి) నిత్యజీవితమునందు ఆహార విహారములతోపాటు నజరుగా, కృత్రిమముగా కొన్ని ఆహార భాగములను తొలగించిన వస్తువులను వాడుట నభ్యాసము జేసికొనుట.

**వివరణము:** 1. ఒకే వ్యాధికి అనేక వేదనలుండుట సహజము. ఉన్న వేదనలలో నేది ప్రాముఖ్యము వహించి బాధించుచున్నదో దానిని ముఖ్యమైన వ్యాధిగా భావించి, దానిని కొట్టుటకై అలోపతిలో మందులు వాడుదురు. అది వ్యాధి కాదు గనుక ఈ ప్రక్రియవలన నివారణ కాదు. ఉపశమనము కలిగినను ప్రాంతీయము, తాత్కాలికము అయి ఉండును. జ్వరము, విరేచన బద్ధకము కల వానికి తలనొప్పి తీవ్రముగా నున్నచో ఆస్ప్రో వాడుదురు. అది తలనొప్పి మాత్రముతొలగించుట వలన జ్వర కారణమును తొలగింపదు. రోగ కారణము తొలగకుండ బాధను శమింప చేసినచో మరియొక బాధను పుట్టించును. ప్రాణశక్తిచేయు పోరాటములో బాధలు పుట్టుచున్నవి గాని రోగ కారణము

వలన పుట్టుటలేదు. రోగ మెక్కువై రోగి నీరసించుచున్న కొలదియు బాధలు తగ్గును. అవసానదశ రోగికి సమీపించుచున్న కొలదియు బాధల తీవ్రత తగ్గి, నీరసము ఎక్కువై మౌనముద్ర పెరుగును. ఇది సంపూర్ణమగుటయే మృత్యువు. కనుక రోగమును తగ్గించకుండ బాధలు తగ్గించుటకు చేయు వైద్యము మృత్యువునకు చేరువగా కొనిపోవు చుండును.

2. మందుల కంపెనీలు తయారుచేసి సిద్ధము చేసిన ఔషధములను (Specifics) వాడరాదు. ఇవి రోగి కొరకుప్రత్యేకింపబడుట సాధ్యము కాదు గనుక రోగులు ఈ మందులకు నప్పింపబడుట జరుగును. నివారణకు ముఖ్య సూత్రము రోగిని మిగిలినవారినుండి ప్రత్యేకించుట, వాని లక్షణములను బట్టి ఒక మందును మిగిలినవాని నుండి ప్రత్యేకించుట. మందులు కలిపి తయారుచేసిన ఔషధములలో ఔషధనిర్ణయము సాధ్యము కాదు కనుక స్థూలముగా రోగులను గణవిభజన చేసి మందులు నిర్ణయించుట అలోపతి విధానము. (ప్రస్తుత కాలమున హోమియోపతీ మందులమ్మువారిలో కూడ ఇట్టి కక్కుర్తి కనిపించుచున్నది. ఇది అసమర్థమగు అనుకరణ విధానము. కుక్కను జూచి పులి మొరుగుట వంటిది.) ఇట్లు మందులు వాడుట పత్రికలలో వార ఫలములు చదువుకొని మందులు

వాడుట వంటిది. నక్సు వామిక, ఆంటిమోనియంక్రూడం, సల్ఫర్, చైనా, లైకోపోడియం కలిపి గుళికలు తయారు చేసినచో సకల జీర్ణకోశ వ్యాధులకు పనికివచ్చు ననుట ఇట్టిదే.

3. నాగరికుల దినచర్యలో వాడబడు నజరైన వస్తువులు అను వాక్యము ఆహారాది విషయములందు వర్తించును. దీని కుదాహరణములు:

ఎ) ఆరోగ్యకరమైన దంపుడు బియ్యపు అన్నము కంటికి మసకగా కనిపించును గనుక బియ్యమును జాజిపూలవలె మరబట్టించి అమ్ముచున్నారు. దానివలన సోరా ముదిరి వ్యాధులకు గురి అగుచున్నారు.

బి) అన్నము కంటికి నజరుగా కన్పించుటకై గంజి వార్చి తినుచున్నారు. దానితో ఆహారద్రవ్యము తొలగిపోయి పిండిపదార్థము మాత్రము భుజించి దేహమునకు అన్న దారిద్ర్యము (malnutrition) కలిగి శుష్క రోగములు పుట్టుచున్నవి.

సి) కూరలను, మాంసమును, వండిన పదార్థములను శీతల యంత్రములలో దాచుకొని రోజుల తరబడి ఆ పాచి పదార్థములను తినుట వలన రోగములు

విజృంభించును.

డి) కూరలు విల్వచేయుటకు శోషణ ప్రక్రియ (de-hydration) నుపయోగించి వానినిమరల నానబెట్టి వండి తినుచున్నారు. అట్లే వరుగులు, వడియములు, అప్పడములు తినుట కూడ. ఊరగాయలు కూడ నిట్టివే. వీని నుపయోగించు నాగరికులు "కుణప ఖాదకులు" (శవములను తినువారు) గా ఆయుర్వేద శాస్త్రమున చెప్పబడిరి. దీనివలన జీవకళ తగ్గి ఆయుస్సు క్షీణమగును. ఇట్టివే హానిమన్ చెప్పిన నాగరికములైన నిత్యోపయోగ ద్రవ్యములు, ఆరోగ్యము చక్కని ఆహారము వలన నిర్మాణమగును గాని మందులవలన కాదు. పాలపిండి, మాల్ట్ చేయబడిన ఆహార ద్రవ్యములు, డబ్బా పాలు కూడ నిట్టివే. పండ్లను డబ్బాలలో నిలువచేసి తినుట కూడ నిట్టిదే.

**సూత్రము 59:** అలోపతి మందులు వాడి నీళ్ళ విరేచనములు, నొప్పులు, దగ్గులు, విరేచన బద్ధకము, అజీర్ణము తగ్గించుటవలన అవి మరల తిరిగివచ్చుటయే గాక ఇతర వ్యాధులు కూడ సంభవించుచున్నవి. నీరసము, నిస్సత్తువ, చలిగా నుండుట, మంటలు అరికట్టబడుటవలన కూడ వ్యాధులు కలుగును. పడిశము, కన్నులనుండి,

చెవులనుండి కారు నీరు, చీము బంధించుట వలన మిక్కిలి హాని కలుగును. మూత్రాశయము నీరసించిన స్థితిలో మందులతో దానిని పని చేయించుట ప్రాణ మోసము. పక్షవాతములకు చేయు వైద్యము కూడ నట్టిదే. రక్తము తలకెక్కి బరువెక్కుట వలన దేహమున రక్తమెక్కువ ఉన్న దని భ్రమపడి జలగలు పట్టించుట మున్నగు పద్ధతులలో కొంత రక్తమును తీసివేయు సంప్రదాయ ముండెడిది. దేహము, మనస్సు మందకొడిగా నున్నపుడు నాడి నీరసించినపుడు లేక ఉద్రిక్తముగా కొట్టుకొనుచున్నపుడు వాని నుత్తేజపరచుటకై మందులను వాడినచో నీరసమెక్కువై ఆపద కలుగును. అట్లే నిద్రపట్టని వారికి మత్తులను కలిగించు మందులు వాడుట. ఈ పద్ధతులవలన తాత్కాలికోపశమనము తరువాత అవే బాధలు మరింత తీవ్రమగును. వాడిన మందుల వలన పుట్టిన క్రొత్తబాధలు వానితో కలగల్పు చెందును. వీని ఫలితములుగా నివారణకు లొంగని దీర్ఘరోగములు, వికలత్వము, ఉన్మాదము కలుగును. వ్యాధులకు అలోపతిమందులను వాడినచో ఫలితము లిట్లుండును. బాధానివారణకై సుప్రసిద్ధులైన వైద్యుల పంచచేరినవారి కిట్లు పరిణమించిన దుర్విధియొక్క ఫలితములను వర్ణించుచు పోయినచో గ్రంథము పెరిగిపోవును.

**సూత్రము 60:** అలోపతి విధానము ఫలితముగా మందుల మోతాదు పెంచుకొనుచు పోవుట వలన రోగమును తగ్గించుట జరుగదు.

**సూత్రము 61:** అలోపతి వైద్యులకు విశ్వాసమేగాని విధానము లేదు. వారు క్రమశిక్షణ పొందిన పరిశీలన మెరుగరు. కనుకనే కంటికి కనిపించుచున్న విషయములను చూడలేకున్నారు. ఈ చెప్పబడిన విషయములన్నియు ఎవరికైన సులభముగా నందునట్టివే.

**సూత్రము 62:** ఫలితములే యధార్థస్థితిని వివరించును. సహజముగా నేమి జరుగును అను విషయము అనుభవమును బట్టియు, ప్రయోగమును బట్టియు తెలియును. ఇంతవరకును గమనిక నుండి మరుగుపడియున్న విధాన మిచ్చట వివరింపబడినది. అది ఎపుడును అనుభవమున కందునది. మిక్కిలి ప్రధాన్మైనది.

## ఔషధగుణములు

**సూత్రము 63:** ప్రతి ఔషధమునకును రెండు విధములైన గుణము లున్నవి.

ఎ) ఔషధముయొక్క ప్రాథమిక ప్రభావము.

బి) రెండవది యగు ప్రాణశక్తియొక్క ప్రతీకారము.

ప్రాణశక్తిని చాలనముజేయు నౌషధమునకుగాని, వ్యాధికిగాని ఈ రెండు విధములైన ప్రభావము లున్నవి.

**వివరణము:** మందును వాడినప్పుడు మొదట మందుయొక్క ప్రభావము దేహముపై చూపును. తరువాత ప్రాణశక్తి ఆ మందునకు ప్రతిక్రియగా తన ప్రభావము చూపును. ఔషధమున్కైనను, వ్యాధికైనను దేహమున నీ రెండు విధముల ప్రభావము లున్నవి.

**సూత్రము 64:** మందు యొక్క గుణములను దేహము మొదట ప్రతీకారము లేకుండ స్వీకరించును. అటుపైననొక ప్రతిక్రియా ప్రవర్తనమును దేహము చురుకుగా పుట్టించును. ఇది నివారణకై పుట్టించు కల్లోలము. ఇది ఆ మొదటి ప్రభావమును రద్దుచేయును. ఆ మొదటి ప్రభావము అతి తీవ్రమై ప్రాణమునకు హాని కలిగించు నంతటిది కానిచో ఈ రెండవ ప్రతిక్రియా ప్రభావము దానిని రద్దుచేయును.

**వివరణము:** వేడినీళ్ళలో స్నానము చేసినచో దేహము వేడెక్కును. ఇది ప్రాథమికమైన వేడి నీటి ప్రభావము. అటుపైన వెంటనే చెమట పోసి దేహము చల్లబడును. ఇది ప్రాణశక్తి చూపిన ప్రతిక్రియయైన రెండవ ప్రభావము. అట్లే ఆహారమున ఈగ పడి కడుపులోనికి పోయినచో దాని మలిన విషము పొట్టలో వ్యాపించును. దానికి

ప్రతిక్రియగా ప్రాణశక్తి కదలించి, కుదిలించి ఆ పదార్థమును వాంతి చేయించును. ఇట్లు స్వీకరింపబడిన విషము ప్రాణము తీయునంతటిది కానిచో ప్రాణశక్తి పోరాడి దానిని బహిష్కరించి దేహమును శుద్ధిచేసి రక్షించును.

సూత్రము 65: దీనికి ఉదాహరణలు: వేడినీరు మొదట దేహమును వేడెక్కించి తరువాత చల్లబరుచును. అట్లే వ్యాయామ పరిశ్రమయును. చన్నీరు మొదట చల్లబరచి తరువాత వేడెక్కించును. కాఫీ మొదట నుత్తేజపరచి తరువాత నిస్సత్తువ కలిగించును. నల్లమందు మొదట నిద్రపుట్టించి తరువాత నిద్రాభంగము చేయును. విరేచనముల మందులు మొదట విరేచనమును సాఫీచేసి తరువాత మలబద్ధము కలిగించును. ఇట్లే అన్ని ఉదాహరణములును.

సూత్రము 66: సూక్ష్మీకరణము వలన శక్తి చాలనము చేయబడిన హోమియోపతీ మందులు తమ ప్రాథమిక ప్రభావమును అతి సూక్ష్మముగా, గమనికకు రానంతగా మాత్రమే పుట్టించును. అదికూడ పుట్టింపక పోవచ్చును. రెండవది యగు ప్రతీకార ప్రక్రియను వ్యాధి నివారణకు కావలసినంతగా పుట్టించును. సూక్ష్మ సూక్ష్మముగా ద్రవీకరణము చేయబడిన ఈ మందులను తరచుగా

వాడకుండ భద్రముగా వాడినచో వ్యాధి నివారణకు కావలసినంత ప్రతిక్రియను స్థాపింప వచ్చును. వ్యాధి లక్షణములతో బాధపడుచున్న రోగికి సమాన లక్షణములను పుట్టించు ద్రవ్యముల ప్రభావమునకు లొంగిపోవు గుణముండును. అట్టి ద్రవ్యమును ఎన్నుకొని వాడినచో ప్రతిక్రియా ప్రభావము తప్పక పుట్టితీరును.

**సూత్రము 67:** పరిశీలింపగా హోమియోపతీ విధానమువలన జరుగు నివారణములు క్షేమకరములు. ఉపశమన రూపమైన అలోపతి విధానము హానికరమై, ఆరోగ్య ధ్వంసకమై విశ్రాంతిని కూడ నశింపచేయును. అలోపతి వైద్యము ఆరోగ్యమునకు శాశ్వతముగా ధ్వంసము చేసి రోగస్థితిని స్థిరము చేయును. మందులు పెట్టు తికమకల వలన నివారణ కష్టమగుటయో, అసాధ్యమగుటయో జరుగును.

**సూత్రము 68:** ఔషధమును హోమియో విధానమున వాడుట వలన వ్యాధి నివారణమైన వెనుక ఔషధ ప్రభావము అతి స్వల్పముగా మిగుల వచ్చును. అంతమాత్రము మిగిలినను వ్యాధి తొలగిన వెనుక అది కూడ అదృశ్యమగును.

**సూత్రము 69:** అలోపతి విధానము వలన దీనికి

వ్యతిరేకముగా జరుగును. అనగా ఉపశమనము తరువాత వ్యాధి స్థితి ఔషధ ప్రభావము తొలగినంతనే ఉద్రిక్తమగును.

**సూత్రము 70:** ఈ అంశముల నన్నిటిని సింహావలోకనము చేసినచో సారాంశము ఈ దిగువ విధముగా తేలును:

ఎ) వ్యాధి అనునది ఇంద్రియములచే గమనించి గుర్తు పట్టగలిగిన వేదనల రూపమున తప్ప మరి ఏవిధముగను తన లక్షణమును విస్పష్టము చేయదు. ఈ వేదనల కన్న తొలగింప వలసిన ఏ భాగము వ్యాధియందు లేదు. ఔషధ నిర్ణయమును సూచించు సాధనము కూడ వానికన్న మరియొకటి లేదు.

బి) ఆరోగ్యవంతుని ఆరోగ్యమున మార్పులను కలిగింపగల పదార్థము తప్ప మరి ఏ ఇతర పదార్థముగాని, మందుగాని వ్యాధి నివారణమున కుపయోగపడదు.

సి) వ్యాధి లక్షణములతో సరిపోలని లక్షణములను ఆరోగ్యవంతునియందు పుట్టించు మందులేమియు ఆ వ్యాధిని నివారణము చేయజాలవు. నైసర్గిక వ్యాధి లక్షణములతో సరిపోలిన వేదనల తోడి కృత్రిమ వ్యాధిని కల్పింపగల మందుతో మాత్రమే నివారణము సాధ్యమగును.

డి) వ్యతిరేక లక్షణములను పుట్టించుమందులు ఆ బాధలకు తాత్కాలికోపశమనము మాత్రమే కలిగించునని అనుభవము చెప్పుచున్నది. ఉన్న వ్యాధి లక్షణములను ఉద్రిక్తపరచు సామర్థ్యము లేని మందు లెన్నడును నివారణము కలిగింపవు. కనుక విపత్కరములైన దీర్ఘవ్యాధులయందు అలోపతి విధానము పనికిరాదు.

ఇ) సారూప్యము చెంది ఉన్న వేదనలను పుట్టింపగల సామర్ధ్యము కలిగిన ఔషధమునకు సరియైన పరిణామమును కల్పించి, సరియైన మోతాదులో వాడుట క్షేమమయిన పద్ధతి. అట్టి మందు, నివారణకు తగిన కల్లోలమును రేపి ఆరోగ్యము చేకూర్చును. సమాన లక్షణములు గల వ్యాధులను పుట్టించి ప్రకృతి ఏవిధముగా కొన్ని వ్యాధులను నయముచేయుచున్నదో గమనించి చేయుట మంచిది.

సూత్రము 71: ఎ) నివారణము నిర్వహించుటకు కావలసిన వ్యాధి విజ్ఞానము వైద్యుడెట్లు ఆర్జించుకొనునో తెలియ వలెను.

బి) అట్లే వైద్యుడు ఔషధములను వ్యాధి నివారణకై నిర్ణయించుకొన గల విజ్ఞానమును కూడ నార్జించుకొన వలెను.

సి) ఆర్జించుకొనిన విజ్ఞానముతో ఏ ఔషధమును ఏ వ్యాధి యొక్క సక్రమ నివారణకు వాడవలెనో తెలిసికొనవలెను.

## వ్యాధుల వర్గీకరణము

**సూత్రము 72:** మానవజాతికి సంభవించు వ్యాధులను రెండు విధములుగా విభజించవచ్చును.

ఎ) ప్రాణశక్తులను అతితీవ్రముగా కల్లోల పరచి దానివలన వేగవంతమైన అనారోగ్యములను పుట్టించునవి ఒక రకమయిన వ్యాధులు. అట్టి వ్యాధులు కొంచెము హెచ్చు తగ్గులలో పరిమిత కాలముననే వర్తించును. వానిని తరుణ వ్యాధులు అందురు. ఇక రెండవ తరగతికి చెందిన వ్యాధులు మనము గమనించి లక్ష్యపెట్టుటకు వీలుకానంత స్వల్ప విషయములుగా ప్రారంభించి వృద్ధిపొందును. అవి తమ తమ ప్రత్యేక వైఖరులలో విపాకము చెంది ముదురును. శక్తిమంతములై జీవితారోగ్యమును మార్చి తెలియకుండగనే ఆరోగ్యమును కబళించును. ప్రకృతిలోని శాశ్వత సత్యముల ననుసరించి నివారింపనిచో ఈ వ్యాధులు మరణముతోనే అంత మగును. ఇవి దీర్ఘవ్యాధులనబడును. దీర్ఘవ్యాధి విపాకములలో నివి యుత్పన్న



మగును. (వీనిని గూర్చి 'దీర్ఘవ్యాధులు' అను గ్రంథమున విశదముగా వివరింప బడినది) సిఫిలిస్ అనునది అనేక వైఖరులు గల దీర్ఘవ్యాధులకు ప్రాథమిక కారణము, ప్రేరణ కారణము అయి ఉన్నది. ఇది కాక మరి రెండు దీర్ఘవ్యాధుల విపాకములు కూడా నిట్లే వర్తించును. వాని పేర్లు సోరా, సైకోసిస్. ఎక్కువ కాలము వ్యాధులతో బాధపడు వారందరును దీర్ఘవ్యాధులు కలవారనరాదు.

వివరణము: తరుణవ్యాధులు, దీర్ఘవ్యాధులు అను విభాగము అలోపతి విధానమున శాస్త్రీయముగా వివరింపబడలేదు. తక్కువకాలమున నివారణమయిన వానిని తరుణవ్యాధు లనియు, ఎక్కువకాలము వైద్యము జరుగుచుండునవి దీర్ఘ వ్యాధులనియు మాత్రమే వివరింపబడినది. ఒక తరుణవ్యాధి వైద్యము సక్రమముగా లేనందువలన చిక్కు లేర్పడినపుడు అది దీర్ఘవ్యాధి అయినదని కూడ అలోపతిలో చెప్పుదురు. సోరా, సైకోసిస్, సిఫిలిస్ అను విపాకములు గూఢమైన వ్యాధులుగా దేహమందుండి మాటిమాటికి అనేక వ్యాధి రూపములను పుట్టించునను సత్యమునుగూడ వారెరుగరు. ఎరుగకపోగా చెప్పినను నమ్మునట్టి స్థితిలో లేరు. వారు అనేక బాధలనే అనేక వ్యాధులుగా గుర్తించి వేరు వేరుగా చికిత్స చేయుటకు ప్రయాసపడుచున్నారు. కనుక ఈ సూత్రమున హానిమన్

చేసిన తరుణవ్యాధులు, దీర్ఘవ్యాధులు అను వర్గీకరణము వేరు. ఇందలి తరుణవ్యాధులలో అంతర్భాగములు ఈదిగువ సూత్రములలో చెప్పబడుచున్నవి:

**సూత్రములు 73, 74:** పరిశీలన సదుపాయమునుబట్టి తరుణవ్యాధులు అనేక విధములుగా విభేదము చెందు చున్నట్లు గమనింపగలము.

1. ఆభాస తరుణవ్యాధులు
2. నైసర్గిక తరుణవ్యాధులు

ఇందు ఆభాస తరుణవ్యాధులు నిజముగా వ్యాధులు కావు. అవి అనేక బాహ్యకారణముల వలన తాత్కాలికమైన బాధల రూపమున నేర్పడును. శక్తిని మించి అలసటపడుట కారణముగా కలుగు జ్వరము, తలనొప్పి ఇట్టివే. అట్లే గాయములు, దెబ్బలు, పడుట మున్నగు కారణములుగా కొన్ని బాధలు సంభవించును. అతిభోజనము, అతి కాముకత, ఉపవాసాదులతిగా చేయుట, అతినిద్ర, పనిలేక, పరిశ్రమలేక కాలము గడుపుట మున్నగు కారణములవలన కొన్ని బాధలు కలుగును. మద్యము, నల్లమందు, గంజాయి, పొగాకు అనుదినము అలవాటు చేసికొనిన ఆస్ప్రో, నిద్రమందులు మున్నగువాని వలన కొన్ని బాధలు

కలుగును. చలికాలమున మంచునకు, వేసవికాలమున ఎండకు గురి అగుట వలన, గాలి మార్పుల వలన, నీటి మార్పుల వలన కొన్ని బాధలు కలుగును. గాలి, వెలుతురు లేని ప్రదేశములలో నివసించుట, మురుగు కాలువలు నిలువ నీరు ప్రదేశములలో నివసించుట, పసరు కోనేరు మున్నగు ప్రదేశముల నీరుత్రాగుట, క్లోరిన్ కలిసినది, లోహపు వంపు గొట్టములలోనిది అగు నీటిని ఉపయోగించుట మున్నగు కారణములవలన మరికొన్ని బాధలు కలుగును. ఇవన్నియు ఆభాస తరుణవ్యాధులు, లేక మిధ్యావ్యాధులు.

నైసర్గిక తరుణవ్యాధులు నైసర్గికములైన కారణముల వలన కలుగును. అందు అంటువ్యాధులు కొన్ని, దేహమునందు పుట్టు వ్యాధులు కొన్ని, ప్రకృతి వైపరీత్య ములవలన కలుగునవి కొన్ని, ఒకరినుండి సంక్రమించునవి కొన్ని, చాలకాలము వరకు తగ్గక బాధించున వన్నియు దీర్ఘవ్యాధులని చెప్పలేము. అందు కొన్ని అలోపతి వైద్య దోషముల వలన కలిగినవియు కలవు. అందు తీవ్రతరమైన, శౌర్యవంతమైన ఔషధములను రోగ ప్రతీకారమునకై పెద్ద పెద్ద మోతాదులలో చీటికి మాటికిని వాడుచుండుట వలన కలుగు వ్యాధులు నయముగాక చిక్కులు పెట్టుచుండగా వానినికూడ అలోపతివారు దీర్ఘవ్యాధు లనుచున్నారు.

క్యాలమెల్ మొదలగు పాదరసపు మందులను, సిల్వర్ నైట్రేట్, ఐయోడిన్ మొదలగు రసాయనిక పదార్థములతో చేయబడిన పైపూతలు వాడి చర్మ రోగములను అణచిపెట్టుటవలన కొన్ని వ్యాధులు ముదురును. నల్లమందు, క్వినైన్, బొగ్గు, తారుతో తయారైన మందులు కొన్ని బాధలను పెంచును. నొప్పిని అణచిపెట్టునట్టి మందులను, బాలింతలకు ఎర్గాట్ మందులనిచ్చుట, గంధకము పైపూతలు, విరేచనములను పుట్టించు లవణము, మాత్రలు మున్నగువానిని ఆశ్చర్యకరముగా బాధలు తొలగించు మందులని తయారుచేసి లాభమున కమ్ముకొనుచు అమాయిక ప్రజలను నమ్మించి మోసపుచ్చుచున్నారు. వీనివలన కూడ తరుణవ్యాధులు మొండి వ్యాధులుగా మారుచున్నవి. ఇవి చాలవన్నట్లు వైద్యులు సులభముగా కళ్లుమూసికొని వాడుటకు తయారు చేసిన మందులు, అందును మత్తు ద్రవ్యములతోతయారు చేయబడిన వానిని రోగుల కభ్యాసము చేయగా వారు వానికి దాసులై వదలలేక వాడుచు, తమ జబ్బులను నివారణకు దుష్కరములైనవిగను, లొంగనివిగను చేసికొనుచున్నారు. ఇట్టి నిస్సహాయులను గుంపులు గుంపులుగా చూచినపుడెల్ల వైద్యశాస్త్రము మానవునకు శ్రేయస్సును గూర్చుట మాని ఒక మహాశాపముగా

పరిణమించిన దనిపించును. ఇట్టి వైద్యవిధానము నూతన విధానములచే తీవ్ర విమర్శలకు, అనాదరణకు గురిఅయిన దన్నచో తప్పేమియును లేదు.

**సూత్రము 75:** మందులే ఇన్ని విధములుగా ఆరోగ్యమును నాశనము చేయుట సంభవమా యని సంశయము కలుగవచ్చును. కాని నేటి కది సంభవమైనది.

**సూత్రము 76:** హోమియోపతీ విధానము సర్వ వ్యాధులను నివారణ చేయునా అని ప్రశ్నింపవచ్చును. అది నైసర్గిక వ్యాధులన్నిటిని నిస్సంశయముగా నివారణ చేయును. కాని చిరకాలము చీటికి మాటికి కన్నుమిన్నెరుగక మందులను వాడుట వలన కలిగిన వ్యాధులను మాత్రము నివారణము చేయజాలదు.

**సూత్రము 77:** నిజమయిన దీర్ఘవ్యాధులు దుర్విపాక ముల (chronic miasms) వలన కలిగినవేగాని అనారోగ్యకరమైన జీవిత విధానము వలనను, పరిసరముల వలనను కలిగినవి కావు. అవి సరి అయిన మందులకు తప్ప వేరుగా నివారణ కావు.

వివరణము: ఇక్కడ నిజమయిన దీర్ఘవ్యాధులను నిర్దేశించి చెప్పుచున్నాడు. అవి అంతర్గూఢము లైన సోరా, సిఫిలిస్, సైకోసిస్ అను విపాకముల వలన కలుగుచున్నవి

గాని మురికినీరు, దోమలు మున్నగు అపరిశుభ్ర కారణముల వలన కలుగుట లేదు. విపాకములు లేనివారికి మలేరియా దోమ కుట్టినను, దానినుండి మలేరియా పురుగు రక్తములోనికి ఎక్కినను అది చనిపోవునే గాని వ్యాధి కలుగదు. అందరిని ఈ దోమలు కుట్టుచునే ఉన్నవి కదా! మలేరియా మాత్రము కొందరికే సంక్రమించుచున్నది.

**సూత్రము 78:** దీర్ఘవ్యాధుల విపాకములున్నవారు ఆరోగ్యదాయకమైన ఆచారకాండను నిష్ఠతో పాటించినను ఆ వ్యాధులు నివారణము కాకున్నవి.

వివరణము: సరియైన ఔషధ సహాయముతో తప్ప దీర్ఘవ్యాధులు నివారణ కావు. ఆరోగ్య సూత్రములను వల్లెవేయుటకును వాని నివారణకును సంబంధము లేదు. కుష్ఠురోగి నిత్యము స్నానముచేసి ఉదికిన వస్త్రములు ధరించి శుచిగా నున్నను తగ్గదు. ఫినైల్, డెట్టాల్, కలరా ఉండలు, ఆరోగ్యమును కలిగించు సబ్బులు నిత్యము వాడుచున్నను, ఆహారశుద్ధి పాటించినను కూడ కుష్ఠురోగము కలుగునే గాని తగ్గదు. అట్లే క్షయవ్యాధి, గుండెజబ్బు, లివరుజబ్బు కూడ. నిజమయిన దీర్ఘవ్యాధి వలన కలిగిన బాధలు ఏవియును ఆరోగ్య సూత్రములకు, ధర్మప్రశ్నాలకు భయపడవు. కీలు ఎరిగి వాత పెట్టినట్లు సక్రమముగా మందులు వాడినపుడే తగ్గును. పై

ఆరోగ్యపద్ధతులు వ్యాధులు లేనివారికి వ్యాధులు కలుగకుండుటకు పనిచేయును. ఆయుర్వేదమున ఈ ఆచారకాండను 'స్వస్థవృత్త' మనిరి. అనగా ఆరోగ్యవంతులు ఆరోగ్యవంతులుగా నుండుటకు వీని ఆవశ్యకత ఉన్నది.

ప్రకృతి చికిత్స (naturopathy) వారు ఈ వ్యాధులను కూడ మందులు లేకుండ నయము చేయ గలమని చెప్పుచున్నారు. అనుభవమున కిది సరిపడుట లేదు. సోరా మున్నగు దీర్గవ్యాధుల విషయము వీరికి దృష్టిలో లేదు. సోరా మున్నగు మూడు దీర్ఘవ్యాధులు కలవారు ప్రకృతి చికిత్స చేసికొనినను బాగుపడుట లేదు. కొన్ని సందర్భములలో కొన్ని సంవత్సరములు అణచి పెట్టుట జరుగుచున్నది. ప్రకృతి చికిత్సకు సంబంధించిన ఆహార నియమము పాటించినన్నాళ్లు వ్యాధి కనిపించదు. మరల మానినంతనే వ్యాధి తన పని తాను చేయును. అయినను అలోపతి మందుల వలన కలుగునట్టి తీవ్ర నష్టములు అదనముగా కలుగవు గనుక దానికన్న ప్రకృతి వైద్యమెంతో మంచిది. ప్రకృతి చికిత్స నవలంబించు చున్నంత కాలము దీర్ఘవ్యాధి దేహమున నున్నను తపస్సు చేయువాని ప్రక్కనున్న త్రాచుపామువలె తల ఎత్తక సుఖజీవనము చేయనిచ్చును.

## విపాక వ్యాధుల వర్ణనము

**సూత్రము 79:** సిఫిలిస్, సైకోసిస్ అను రెండును దీర్ఘవ్యాధి విపాకములు. అవి మందుల సహాయము లేనిచో ప్రాణశక్తిచేత నివారణము కావు. అవి అంతర్గూఢమైన వ్యాధులుగా నుండును. నిపుణమైన హోమియోపతీ వైద్యముచే నివారింపబడనిచో చివరిదాక నిరంతరము దురంతములను పుట్టించుచునే యుండును.

**సూత్రము 80 :** ఇక సోరా అనునది అనేక శిరస్సులతో విజృంభించు దీర్ఘవ్యాధి. నేడు వేరు వేరు వ్యాధులని పేర్కొనబడుచుమానవజాతి నేడిపించుచున్న బాధల గుంపు లన్నిటికిని సోరాయే మూలకారణము. దీనిని గూర్చిన విపులమైన వివరణము 'దీర్ఘవ్యాధులు' అను ప్రత్యేక గ్రంథమున తెలిసికొనవలెను.

**సూత్రము 81:** ఈ సోరా విపాకముఒక్కొక్క వ్యక్తియొక్క వాతావరణమునుబట్టి, దేశ కాల పరిస్థితులనుబట్టి, నాగరిక పద్ధతులనుబట్టి, జీవిత విధానములనుబట్టి ఒక్కొక్క విధమైన ప్రత్యేక పరిణామమును పొందును. శరీరతత్త్వము యొక్క ప్రత్యేకతను బట్టి అది ప్రత్యేకరూపమును ధరించుచున్నది. లెక్కలేనన్ని పురుషాంతరములలో కొన్ని కోట్లమంది యందు సోరా వృద్ధిపొంది తరతరములుగా

పాతుకొని కొన్ని లక్షల ప్రత్యేక రూపములను ధరించి నిర్దిష్టములైన ప్రత్యేక వ్యాధులుగా పిలువబడునట్లు రూపొందింవబడినది. మానవజాతి ఈ దీర్ఘ దుర్విపాకమునుండి తప్పించు కొనలేకపోయినది. దానికి కారణము మనము నిరంతరము అవ్యక్తముగా అనేక చర్మవ్యాధులను అణచిపెట్టుటకు చేయు ప్రయత్నమే. తరతరములుగా వైద్యులు, ముసలమ్మలు ఈ చర్మ వ్యాధులను అణచిపెట్టుటకు ఔషధములను, కషాయ ద్రవ్యములతోడి పైపూతలను, క్షాళనములను చేయుచు తిప్పలు పడుచున్నారు. ఇదియే ఈ వ్యాధినుండి తప్పించుకొన లేకుండుటకు కారణము.

వివరణము: హానిమన్ శాస్త్రదర్శనము ప్రకారము చర్మవ్యాధులు లోపలి వ్యాధులకు ప్రాయశ్చిత్తరూపములైన బహిష్కరణలు, వానిని అణచిపెట్టుట వలన లోపలనున్న సోరా ముదిరి పోవును. పాప ఫలము బహిర్గతమై నివారణము కావలెను గాని అణచిపెట్టుటవలన కాదు. సరియైన ఔషధ ప్రక్రియవలన మనస్సునకు, ఇంద్రియ ములకు వేదనల రూపము అంటియున్న వ్యాధి తొలగును. అపుడే ఈ చర్మవ్యాధులు నివారణ మగును.

**సూత్రము 82:** దీర్ఘవ్యాధులలో నొక్కొక్క రోగినే ప్రత్యేకించి అతని ప్రత్యేక వైఖరిని వేరుగా నిర్ణయింప

గలుగుట లేకుండ ఔషధమును వాడరాదు. అట్లు వాడినచో సోరా నివారణకాదు.

**సూత్రము 83:** ప్రతి రోగి విషయమునను ప్రత్యేకతను నిర్ణయించవలెను. బాధ్యతతో గూడిన పద్ధతిలో వ్యాధి నిర్ణయపట్టికను ఆ వ్యాధి వృత్తాంతముల వివరణముతో తయారు చేయవలెను. పక్షపాతము లేని నిర్ణయదృష్టితోను, సక్రమమైన గ్రహణశక్తితోను చేయవలెను. దానికి బద్ధకించినచో చక్కని గ్రహణశక్తి ఎట్లుండును?

## రోగపట్టికను నిర్మాణముచేయు విధానము

**సూత్రము 84:** రోగియు, అతనికి సేవచేయు వారును రోగమును గూర్చిన పూర్వచరిత్రను వివరింతురు. మరియు రోగి వేదనలను, ప్రవర్తనను, సంస్పర్శములను కూడ వివరింతురు. వైద్యుడు చూచి, విని, స్పృశించి గ్రంథమునుకూడ గమనించి మరికొన్నిటిని తెలిసికొనును. చెప్పుచున్న వారిని పూర్తిగా చెప్పనీయ వలెను. అక్కరలేని సోది చెప్పుచున్నపుడు మాత్రము మరల విషయములోనికి మరలింపవలెను.

**సూత్రము85:** ఒక్కొక్క విషయమునే ఒక్కొక్క వాక్యమున వేరు వేరు పంక్తులలో దూరదూరముగా

వ్రాసిపెట్టుకొనవలెను.

**సూత్రము 86:** చెప్పినవారు తమంతట తామే ఆపిన వెనుక తిరిగి చదివి వినిపించి మరల వారిచే చెప్పించి సరిచూడవలెను. నొప్పియున్న సరియైన ప్రదేశమును, ఆ నొప్పియొక్క తరహాను చూపి చెప్పించవలెను. నొప్పి నిరంతరముగా నుండునా, ఆగి మరల వచ్చునా, ప్రదేశముమారునా,వచ్చి ఎంతకాలము ఉండునో చెప్పించవలెను. బాధయొక్క ఉద్రేకము, ఉపశమనము నెట్లు పొందునో తెలియువలెను. వేడి, చల్లదనము, గాలితగులుట, విశ్రాంతి, కదలిక, ఒక స్థానమున నుండుట, స్పర్శ పొందుట, నొక్కుట మొదలగు పరిస్థితులలో నెట్లు మారుచుండునో చెప్పించవలెను. ప్రతిపర్యాయము బాధ వచ్చి పోవుట ఎట్లుండునో వర్ణించి చెప్పించవలెను.

**వివరణము:** రోగిగాని, పరిచారకుడుగాని మొట్ట మొదటగా చెప్పుట ఆరంభించేపుడు అడ్డ ప్రశ్నలు వేయక చెప్పనీయవలెను. చెప్పుచున్నపుడు ప్రశ్నలను అడ్డుపెట్టినచో చెప్పబోయిన దానిని మరచిపోవును. అక్కరలేని సోది మొదలుపెట్టినపుడు మాత్రము మెల్లగా విషయము మీదకు మరలింపవలెను. కసర రాదు. కసరినచో భయపడి వివరములు చెప్పలేరు.

వారు చెప్పిన వానిని ఒక్కొక్క వాక్యమునే వేరు పంక్తులలో వ్రాసికొనవలెను. పంక్తికి పంక్తికి నడుమ నెక్కువ దూర ముంచవలెను. ఆ నడుమ మనము ప్రశ్నించి తరువాత తెలిసికొను వివరములను వ్రాసికొనవలసి ఉండును.

నొప్పులు అని వ్రాసికొనక తలనొప్పి వేరుగా, నడుమునొప్పి వేరుగా విశదముగా వ్రాయవలెను. ప్రతిబాధయు పుట్టునట్టి ప్రదేశమును చూపుమని గుర్తించి వ్రాయవలెను. నొప్పియొక్క తరహా గుర్తింపవలెను. అనగా పోటు పొడిచినట్లుండునా, మెలిపెట్టినట్లుండునా, బరువుపెట్టినట్లుండునా, నొక్కు కొనినట్లుండునా, కట్టినట్లుండునా తెలియవలెను. వచ్చిన నొప్పి ఏకధాటిగా నుండునా, వచ్చుచు పోవుచు నుండునా, తెరలు తెరలుగా వచ్చునా మున్నగు వివరములు తెలియవలెను. వచ్చునపు డెట్లుండునో, పోవునపుడెట్లుండునో తెలియవలెను.

ఉద్రేకించు విధానము, ఉపశమించు విధానము గమనింపవలెను. అనగా కూర్చుండుట, పండుకొనుట, ఒత్తిగిలుట, లేచి నిలబడుట, దిండుపెట్టుకొనుట, తీసివేయుట, చేరగిల పడుట, చేతులు కాళ్ళ ముడుచుకొనుట, చాచుట మున్నగు వైఖరులలో నెప్పుడు

బాధ ఎక్కువగునో, ఎప్పుడు శమనముగా నుండునో గ్రహింపవలెను. కాపుపెట్టుట, వెచ్చచేయుట, చన్నీళ్ళలో తడుపుట, తడిగుడ్డ పెట్టుట, మంచుగడ్డ నుంచుట, చల్లగాలి వీచుట మున్నగు వానిలో నేవి సదుపాయముగా నుండునో, ఏవి బాధాకరముగా నుండునో తెలిసి కొనవలెను. కదలినచో, నడచినచో, పొరలినచో శమనముగా నుండునో, బాధగా నుండునో కనుగొనవలెను.

**సూత్రము 87:** సూటిగా ప్రశ్నించుట, అవును కాదని సమాధానము చెప్పు ప్రశ్నలు వేయుట కూడదు.

**వివరణము:** "నీ బాధ ఏమీ?" అని అడిగినచో రోగి వివరించి చెప్పును. అట్లుగాక "నీకు నొప్పి వచ్చునా" అని ప్రశ్నించినచో వచ్చుననిగాని, రాదనిగాని చెప్పి యూరకుండును.

**సూత్రము 88:** ఏదో ఒక సమాధానమును వానిచేత చెప్పించునట్టి ప్రశ్నలు వేయరాదు.

**వివరణము:** "నీకు విరేచనబద్ధకము ఉన్నపుడు తలనొప్పి వచ్చుచుండునా" అని ప్రశ్నింపరాదు. ఆ ప్రశ్న విన్నపుడు అది నిజమే అని రోగికి భ్రమ కలుగవచ్చును. "జ్వరముగా ఉన్నపుడు నీకు ప్రాణభీతి కలుగునా?" అని ప్రశ్నింపరాదు. రోగి దుర్బలుడైనచో ఆ ప్రశ్న వలన

ప్రాణభీతి కలుగవచ్చును. నిర్లక్ష్యము గలవాడైనచో ఉన్నను లేదని చెప్పవచ్చును.

**సూత్రము 89:** రోగి చెప్పవలసిన దంతయు చెప్పి ఆపిన వెనుక ప్రత్యేకముగా ప్రశ్నలు వేయవచ్చును. విరేచనము వైఖరి ఎట్లుండునో, నొప్పి స్వభావ మెట్లుండునో తెలిసికొనవలెను. రోగి బాధపడుచున్నపుడు మూలుగుట, అరచుట, ఏడ్చుట యున్నచోకంఠధ్వనినిబట్టి బాధయొక్క స్వభావమును గమనించి వ్రాసికొనవలెను. రోగి నిద్రించునపుడెట్లుండునో, శ్వాస ఎట్లు చేయునో, గురక పెట్టునా, ఆ గురక ఉచ్ఛ్వాసమునందా, నిశ్వాసమునందా అని గమనింపవలెను.

**సూత్రము 90:** ఇట్టి అంశము లన్నిటిని వ్రాసికొనుట పూర్తి అయిన వెనుక రోగియొక్క భౌతికపరిస్థితిని పరిశీలింపవచ్చును. దానికి సాధ్యమయిన విధానముల నుపయోగించవచ్చును. రోగప్రదేశము యొక్క పెరుగుదలను గాని, అవయవము పని చేయుటను గాని పరిశీలింపవలెను. వ్యాధి కలుగుటకు ముందు ఆరోగ్యవంతునిగా ఉండగా ఆ భాగములు ఎట్లు ఉండినవో ప్రశ్నించి తెలిసికొనవలెను.

వివరణము: ప్రశ్నల కుత్తరములను, రోగి స్వయముగా చెప్పిన వివరములను వ్రాసికొనుట మొదట పూర్తి

చేయవలెను. వానిని బట్టి భౌతిక పరీక్ష చేయవలెను. కడుపు నొప్పి యని చెప్పినపుడు లివరు, గర్భకోశము మున్నగు భాగములను తాకి అందు గడ్డగాని, కణితిగాని, కురుపుగాని, కాయలుగాని, చర్మరోగములుగాని యున్నవేమో, ఉన్నచోనెంత పెరిగినవో గమనింప వలెను. అట్లే గుండెపై మెల్లగా అరచేయి పెట్టి హృదయస్పందనము, శ్వాస తీయు విధానములోని హెచ్చుతగ్గులను, గురగుర మున్నగు వానిని గమనింప వచ్చును. చేతికి పక్షవాతము వచ్చి తగ్గినవానిని తన చేయి నొక్కుమని ఎంత పట్టు ఉన్నదో గమనింపవలెను. రెండు చేతులతో నొక్కుమని రెండిటికి పట్టులో నెంత భేదమున్నదో గ్రహింపవలెను. అట్లే కన్ను, చెవి, ముక్కు, గొంతుక మున్నగువానిని గూడ టార్చిలైటు, భూతద్దములు మున్నగు సాధనముల సహాయముతో పరిశీలింపవచ్చును.

**సూత్రము 91:** అంతకుముందు వాడిన మందులను గూర్చి ప్రశ్నింపవలెను. అంతకుముందు గాని వాడుచున్నపుడుగాని, వాడిన తరువాత గాని గల భేదములను గూర్చి ప్రశ్నింపవలెను. ఒక వ్యాధి లక్షణ ములను, వేదనలను సముదాయముగా కూర్పుచేసికొను ప్రయత్నమున మందుల వలన పుట్టిన వేదనలను

కలగలుపు చేసికొనక తొలగించి మిగిలిన వానినే వ్రాసి కొనవలెను. హోమియోపతీ వైద్యుడు మందులు పుట్టించు వేదనలయందు గడించిన అనుభవము వలన మందులు పుట్టించిన వేదనలను సులభముగా గుర్తించు చున్నాడు. అట్టి వేదనలు తొలగు వరకును వేచియుండి ఈలోపున వట్టి చక్కెర మాత్రల మోతాదులతో కాలక్షేపము చేయవలెను. లేదా మందులు పుట్టించిన వేదనలను స్పష్టముగా గుర్తింప గలిగినపుడు వానిని విరుగుడు చేయు మందును వాడి తొలగింప వచ్చును.

వివరణము: రోగి రోగమునకు సహజములైన వేదనల సముదాయము ఒకటి వేరుగా నుండును. దానిని వేరుగా గుర్తించి కూర్పు చేసికొనవలెను. అంతకుముందు మందులు వాడి ఉన్నచో ఆ మందుల వేదనలతో రోగి వేదనలు కలగలుపుగా నుండును. ఆ మొత్తమును కలిపి వ్రాసికొనరాదు. కొంతకాలము వేచి ఉన్నచో ఆ మందుల ప్రభావము పోయి నైసర్గిక వ్యాధి లక్షణములు మిగులును. లేదా ఏ మందులు వాడెనో తెలిసినచో దానికి విరుగుడైన మందును వాడవచ్చును. దానితో ఔషధ వేదనలు మాయమగును. ఉదాహరణకు: తలనొప్పి, విరేచన బద్ధకము, కీళ్ళనొప్పులు, మాటి మాటికి మూత్రమునకు పోవుచుండుట అను వేదనా సముదాయము కలవాడు

నిత్యము వి రేచనమునకు అగ్నితుండి వంటి మాత్రలుగాని, మ్యాగ్‌సల్ఫ్‌గాని వాడుచుండును. దాని ప్రభావమున నిత్యము విరేచన మగుచుండుట వలన విరేచనబద్ధక మున్నట్లు తెలియదు. దానిని గమనించి ఒక వారము దినములు చక్కెర మాత్రలు పెట్టుచు కాలక్షేపము చేయవలెను. రెండు మూడు దినములలో మరల విరేచనబద్ధకము కలుగును. లేదా నక్సువామిక 200 ఒక మోతాదిచ్చి వారము దినములు గమనింపవలెను. అంతకుముందు వాడిన మందులు విరుగుడై నిజస్వరూపమైన విరేచనబద్ధకము బయటపడును. నక్సువామికాతో విరేచనము సాఫీగా కావలసియుండగా విరేచనబద్ధకము వచ్చినదేల యని ఆశ్చర్యపడరాదు. మరి నాలుగు దినములు నిదానించినచో ఆ నక్సువామికా మోతాదే పనిచేసి విరేచనము సాఫీగా నగుట ఆరంభించును. అపుడు వ్యాధినివారణ ప్రారంభ మయినదని గుర్తింపవలెను.

**సూత్రము 92:** మందుల శక్తిచే మార్పులకు గురిచేయబడని వ్యాధులను నయము చేయుట చాల సులభము. మందుల వేదనలతో కలగాపులగము చేయ బడిన వ్యాధులను నయము చేయుట చాల కష్టము.

**సూత్రము 93:** వ్యాధియొక్క ప్రారంభము బాహ్యములైన

ప్రేరణ కారణములచే జరిగి ఉన్నచో దానిని గూడ వేరుగా గుర్తింపవలెను. విషపదార్థములవలనగాని, దెబ్బలు తగిలించు కొనుటవలనగాని, హస్తప్రయోగము వలనగాని, అతికాముక ప్రసక్తివలనగాని, అతిభోజనము, మద్యపానము అంటువ్యాధులు, సుఖవ్యాధులు మున్నగు బాహ్యకారణములతోగాని వ్యాధి ప్రారంభమగును. పెరుగుదల ఉన్నచో వేరుగా గమనింపవలెను. అట్లే కుటుంబమందలి వైషమ్యములు, అనుకూల దాంపత్యము లేకుండుట, దుఃఖము, పేగు జారుట, ముక్కులో నెముక పెరుగుట, చిరకాలము నుండి కలిగిన అపెండిక్సు వ్యాధి, గొంతులో గ్రంథులు మున్నగునవి పెరుగుట, కొండనాలుక బాధలు, జ్ఞానదంతములు వచ్చుట, దంతక్రిముల వలన కలిగిన దంతవికారములు, అవయవములు లోపల వంపులు తిరుగుట మున్నగువానివలన వ్యాధి ఆరంభమయినదేమో చూడవలెను. ధననష్టములు, అవమానము, భయము, దారిద్ర్యము, బ్రహ్మచర్యము, దాంపత్యమునకు ముందరి ఉద్రేక జీవితమున నేర్పడిన పరిణామములు, మర్మావయవముల నిర్మాణమునగల వికారములు, పొట్టలోను, నడుములోనుగల అవయవములు పొడుచుకొనివచ్చుట మున్నగు బాహ్య కారణములున్నవేమో గమనింపవలెను. ఉన్నచో ఈ కారణములను

తొలగింపవలెను.

వివరణము: పై చెప్పిన బాహ్య కారణములన్నియు వ్యాధి లక్షణములు కావు. కాని ఈ కారణముల వలన వ్యాధు లున్నట్లు బాధలు కలుగుచుండును గనుక అందలి కారణములను గమనించి తొలగించుటకు ప్రయత్నించ వలెను. మద్యము, అతి భోజనము, అతికాముకత వలన వికారచేష్టలు కలవారికి వ్యాధిని గమనించి వైద్యము చేసినను లాభములేదు. ఆ కారణములను తొలగింపనిదే నివారణము సాధ్యము కాదు. అట్లే ధననష్టము, దారిద్ర్యముతో బాధపడువారికి గూడ వైద్యమువలన శాశ్వత నివారణము జరుగదు.

**సూత్రము 94:** దీర్ఘవ్యాధుల పరిశీలనము చేయునపుడు రోగి అభ్యాసములు, కుటుంబ సంబంధ వైఖరులు, నిత్యజీవవమునకును ఆరోగ్యవిధానమునకును సంబం ధించిన పొరపాట్లు కూడ గమనించి వానియందు తొలగింపవలసిన వ్యాధి కారణములను కూడ గమనింప వలెను. ఉన్నచో వానిని తొలగింపవలెను.

వివరణము: ఇంతవరకును వివరించిన వ్యాధి పరిశీలన విధానము తరుణవ్యాధులకును, దీర్ఘ వ్యాధులకును సమానమే. ఇటుపైన దీర్ఘవ్యాధుల పరిశీలనమున

గమనింపవలసిన మరికొన్ని ప్రత్యేకాంశములు చెప్పబడుచున్నవి. అభ్యాసములనగా కాఫీ, టీ, నస్యము, పొగత్రాగుట, నల్లమందు, గంజాయి, మద్యమును సేవించుట మున్నగునవి. ఇంకను వక్క, నిద్రమందులు వాడుట, రాత్రి పరుండబోవునపుడు జీర్ణశక్తిని గూర్చియు, సుఖ విరేచనమును గూర్చియు మందులు వాడుట మొదలగునవి. కొందరు నిత్యము ఎనీమా చేసికొందురు. దానితో ప్రేగులు దుర్బలమై నిస్సత్తువ, మత్తు మున్నగు రోగములు పుట్టును. ఇంకనురాత్రి యంతయు మేల్కొని పనిచేయుట, జాగరణములు, ఉపవాసములు, పేకాడుట, క్లబ్బులు, వ్యభిచారము, నగ్న నృత్యములు చూచి ఆనందించుట మున్నగు వానిని కూడ లెక్కలోనికి తీసికొనవలెను. నిత్యజీవితమున చేయు పొరపాట్లు అనగా గ్రుడ్డిదీపము దగ్గర ప్రొద్దుపోవు వరకు చదువుట, వ్రాతపని చేయుట, దీపమునకు ఎదురుగా తిరిగి చదువుట మున్నగునవి ఎన్నియో కలవు. వేళల నియమము లేక చీటికి మాటికి నేదో తినుచు, త్రాగుచునుండుట కూడ వ్యాధులను కలిగించును.

కుటుంబ సంబంధ వైఖరులు అనగా కొందరికి భార్యగాని, పిల్లలుగాని మాటవినక తిరస్కరించుచుందురు.

కొందరిని భర్తలు సణుగుట, కొట్టుట, తిట్టుట, నీచముగా చూచుట, అనుమానించుట చేయుచుందురు. కొందరి ఇండ్లలో బంధువులు, మిత్రులు వచ్చిపోవుచుండుటకు వేళపాళ యుండదు. అన్నివేళలలో వంట, వార్పు, వడ్డనలు, స్త్రీలకు భర్తలనుండి సంక్రమించిన సుఖవ్యాధుల విషము వలన కలిగిన విపాకము విజృంభించి నడివయస్సున క్యాన్సరు, గుండెజబ్బు, క్షయవ్యాధి, ప్రసవసమయ వ్యాధులు కలిగి మరణింతురు.

కొందరికి ఇద్దరు భార్యలు, వేరు వేరు కుటుంబములు, వాని బరువు బాధ్యతలు ఉండును. దానితోపాటు ఇద్దరికిని తృప్తికరముగా సంసారము చేయుట వలన ప్రాణశక్తి ఎక్కువ ఖర్చగును. కొందరికి ఇండ్లలో దీర్ఘరోగములు ఉండుట వలన సంరక్షణ చేయువారికి నిద్ర ఉండక సోరా విజృంభించును.

ఇక ఆరోగ్య విషయములలో పొరపాటులు అనగా నిత్యము స్నానము చేయకుండుట, దుస్తులు, ప్రక్కబట్టలు మార్చుకొనకుండుట, ఇంటి శుభ్రము లేకుండుట, వంటయింటి గోడ నానుకొని పాకీదొడ్డి యుండుట మున్నగునవి. వ్యాధుల కిట్టి కారణములతో సంబంధ మున్నచో వానిని తొలగింపనిచో ఆ వ్యాధులు నివారణ కావు. ఇక వృత్తుల విషయమున ఫ్యాక్టరీలలో, బొగ్గు

గనులలో, రసాయనిక ద్రవ్యముల నడుమ, రేడియో, అణుశక్తి, అల్ట్రావైలెట్ కిరణములు, రేడియం మున్నగు ద్రవ్యముల నడుమ పనిచేయుట కారణముగా రోగములు వచ్చును. వారు ఉద్యోగమును మార్చనిచో వ్యాధి నివారణకాదు.

**సూత్రము 95:** దీర్ఘ వ్యాధులను ప్రత్యేకించు పరిశీలనలో నెంత సూక్ష్మదృష్టి యున్నను చాలదనవచ్చును. స్వల్ప విషయములు, మారుమూలల విషయములు కూడ నిర్లక్ష్యము చేయరాదు. రోగికి అనిపించునది, ఇతరులకు కనిపించునది అగు నెట్టి వేదన అయినను వేదనా సముదాయమునకు పరిపూరకమై సారూప్య ఔషధ నిర్ణయము చేయుటకు ఉపాధిగా సహాయపడవచ్చును.

**సూత్రము 96:** కొందరు రోగులు నుతిమెత్తన, సుకుమారము పోవువా రుందురు. కొందరు బాధల నేమాత్రము భరింపలేని స్వభావము కలిగి ఉందురు. వారు వర్ణించునట్టి అతిశయోక్తులకు మోసపోరాదు.

వివరణము: గుండెదడ, నీరసము గల రోగికి మందిచ్చినపుడు అవి తగ్గి పాదముల నొప్పులు, దురదలు ఏదోఒకరోజు కనిపించి మాయమగును. అతడు తగ్గిన ప్రధాన లక్షణములను చెప్పక "ఈ నొప్పులతో చచ్చి

పోవుచున్నాను. ఈ దురదలు తగ్గవా ఏమి? బాధలన్నియు నెక్కువైపోయినవి" అని ధర్షించును. వానికి భయపడి మందు మార్చినచో తికమక లేర్పడును. వ్యాధి నివారణము దుర్లభమగును. ఒక్కొక్కడు రైలులో, బస్సులో సందులేక నిలబడి ప్రయాణముచేసి వచ్చి ఆ విషయము చెప్పక "నొప్పులు ఒడలు విరుగకొట్టినట్లున్నవి" అని పిర్యాదు చేయును. దానికి మందిచ్చినచో అంతకుముందు వేదనా సముదాయమునకు గురిపెట్టి ఇచ్చిన ఔషధము పట్టు తప్పును. అటుపైన వైద్యము తాళము తప్పినవాని సంగీతకచేరివలె ఉండును. ఇట్టి సందర్భములలో రోగి చేయు పిర్యాదులను అతిశ్రద్ధతో వినుచున్నట్లు నటించి చక్కెర మాత్రల మోతాదులనిచ్చి పంపినచో మరునాటికి అతడు చెప్పిన బాధలు మాయమగును.

**సూత్రము 97:** సిగ్గు, లజ్జ, పిరికితనము కారణముగా వేదనలు చెప్పలేనివా రుందురు. అస్పష్టమైన పదములలో చెప్పువా రుందురు. వానివలన రోగ పరిశీలనము పాక్షికము, అసంపూర్ణము కాకుండ చూచుకొనవలెను.

**వివరణము:** సిగ్గుతో నొక్కొక్కడు అండము వాచిన దని చెప్పుటకు బ్రహ్మాండము చేయును. వాని కులుకులతో తృప్తిపడరాదు. కొందరు లజ్జతో, మొగమాటముతో కొన్ని

బాధలను చెప్పి కొన్నిటిని దాచుకొందురు. కొన్ని మాసముల తరువాత వ్యర్థమైన వైద్యము జరిగిన వెనుక "పూర్తిగా చెప్పకుంటివేమి" అని ప్రశ్నించినచో "డాక్టరుగారూ! ఎన్ని బాధలను చెప్పి మిమ్ములను విసిగించగలను?" అని వినయము పోయి ప్రాణము విసిగింతురు. పిరికితన మనగా ఒక్కొక్కడు తనకు సుఖరోగమున్న సంగతి చెప్పడు. ఒకడు పుంస్త్వము తక్కువైనచో చెప్పడు. ఇట్టి సందర్భములలో వేదనా సముదాయము లభ్యముకాదు. అస్పష్టముగా చెప్పుట అనగా కొందరు "ఒంటిలో ఏదో ఇదిగా నున్నది. అదొక విధమైన బాధగా నున్నది" అని చెప్పుదురు. కొందరు "తమకు తెలియనిదేమున్నది" అని నవ్వి యూరకుందురు. కొందరు వినబడకుండ గొణగుట, రహస్యముగా మాట్లాడుట చేయుదురు. వీరందరిచేత వేదనలను స్పష్టముగా చెప్పించు నేర్పరితనము లేనిచో దీర్ఘవ్యాధులు తగ్గవు. కొందరు తమ పిల్లవాడు సన్నగా ఉన్నాడని చెప్పుటకు బదులు నీరసముగా ఉన్నాడని చెప్పుదురు. ఎద్దువలె భుజించి ఇంటిదగ్గర ఆడుకొనుచున్న పిల్లవానిని గూర్చి అతని తల్లి పరోక్షముగా వైద్యునితో "మావా డేమియు తినుట లేదు. చిక్కిపోవు చున్నాడు" అని జాలిగా చెప్పును. వానిని చూడకుండ మందులను నిర్ణయము చేయరాదు.

**సూత్రము 98:** రోగి స్నేహితులలో ఆదుర్దా పడువారును బాధ్యత తెలియని వాగుడు కలవారును ఉందురు. వారు సత్యదూరములైన విషయములను చెప్పకుండ నిషేధింప వలెను.

**వివరణము:** వైద్యము చేయించుకొనుచున్న ఆమె చుట్టము ఒకతె క్రొత్తగా పొరుగూరునుండి వచ్చును. ఆమె రోగి తరపున వచ్చి "రోగి సగమై పోయినది. మాటలాడుటకు శక్తి లేదు" అని లేనివి ఉన్నట్లు చెప్పును. బాధ్యత లేనివాడు రోగి వివరములను విచారింపక మందునకు వచ్చును. 'జ్వరమున్నదా' అని అడిగినచో తెలియకయే ఉన్నదో లేదో అని చెప్పును. అట్టి వారిని గమనించి రెండవ మారు మందునకు పంపకుండ చూచుకొనవలెను.

**సూత్రము 99:** దీర్ఘవ్యాధులకన్న తరుణ వ్యాధులు త్వరగా అవగతమగును. కారణమేమనగా దీర్ఘవ్యాధుల బాధలకన్న తరుణవ్యాధుల బాధలు ఎక్కువ తీవ్ర ములుగను, తాజా వార్తలుగను ఉండును గనుక రోగి మనస్సున విస్పష్టముగా ముద్రింపబడును.

**వివరణము:** పది సంవత్సరములనుండి రోగి అనుభవించుచున్న విరేచనబద్ధకము కన్న ఆనాడు వచ్చిన చలిజ్వరము తీవ్రత రోగి దృష్టిలో నెక్కువ ప్రశంస

నీయముగా నుండును. కనుక తరుణవ్యాధుల బాధలను సవిస్తరముగా విశేషములతోపాటు చెప్పుట సహజము.

**సూత్రము 100:** రోగలక్షణముల పట్టికను వ్రాసి కొనుటలో అత్యంత ప్రాధాన్యము వహించునట్టి వేదనల పేర్లను వ్రాసికొన్నచో చాలదు. సవివరముగా వ్రాయవలెను. తొలుదొలుత ప్రశ్నించి ప్రత్యేక పరిశీలనము చేయకయే రోగిని గూర్చి తనకంతయు తెలిసినట్లు నటించు వైద్యుడు మోసగాడు. అతని నటనమంతయు గాడిదవంటి అహంకారమున ప్రకటన చేసి కొనుటయే. ప్రతిరోగిని ప్రత్యేకించి పరిశీలింప వలెనను సూత్రము దీర్ఘవ్యాధులకే గాదు, శీతజ్వరములు, జలుబు జ్వరములు, పొంగు జ్వరములు, కంఠసర్పి, మశూచి, గవదబిళ్ళలు, టైఫాయిడ్ మొదలగు తరుణవ్యాధులకును తుదకు కేవలము జలుబులకు, దగ్గులకు వచ్చు వారి విషయమునను గూడ సత్యమే.

వివరణము: కేవలము జలుబులని, దగ్గులని వచ్చిన వారిని నిర్లక్ష్యము చేయక ప్రత్యేకించు సామర్థ్యము నేర్చుకొన వలెను. సోరా కలవాని జలుబునకును, లేనివాని జలుబునకును వేదనలలో సంబంధముండదు. అట్లే సోరావాని జలుబు, సైకోసిస్ రోగి జలుబు, సిఫిలిస్ రోగి జలుబు వేరు వేరువిధములుగా నుండును. ఇందరికి గలిపి

జలుబునకు మందు నిర్ణయము చేయరాదు.

**సూత్రము 101:** ఒక సమయమున వ్యాపించు అంటువ్యాధి యొక్క, వేదనా సముదాయము యొక్క సమగ్ర స్వరూపము ఒకే రోగివలన తెలియదు. సద్బుద్ధిగల వినయవంతుడైన వైద్యుడు సామూహికముగా పరిశీలనచేసి, ఒక అంటు వ్యాధిని చక్కగా నివారించు నొకే ఔషధమును నిర్ణయించి, దానిని మానవజాతి శ్రేయస్సునకును, వైద్యశాస్త్రము ప్రతిష్ఠ నిల్పుటకును ఉపయోగించును.

**వివరణము:** ఒక ఋతువు మార్పు కలిగినపుడు గాని, ఒకచోట విశేషముగా జనసమ్మర్దము చేరినపుడుగాని క్రొత్త లక్షణములతో నొక యంటువ్యాధి పుట్టి విజృంభించును. మొట్టమొదటి రోగి తన దగ్గరకు వచ్చినపుడు వైద్యుడు వ్యాధిపత్రికను నిర్మాణముచేసి పరిశీలించును. ఆ రోగియందు ఆ వ్యాధికి సంబంధించిన కొన్ని వేదనలు మాత్రమే వ్యక్తమగును. వానిపైననే ఆధారపడి ఔషధ నిర్ణయము చేసి వైద్యుడు నివారణ చేయును. అదే వ్యాధి సంక్రమించిన మరియొక రోగి వచ్చినపుడు శరీర తత్త్వములోని భేదము ననుసరించి మరికొన్ని వేదనలు వానియందు కనిపించును. అపుడు వైద్యుడు ఓపికతో ఆ ఇద్దరు రోగుల పరిశీలనము పోల్చి చూచి ఆ వ్యాధి

వేదనలను కూర్పు చేయును. అట్లే పదిమంది ఆ వ్యాధి సంక్రమించినవారు వచ్చి నివారితులైపోయిన వెనుక ఆ మొత్తమునుండి వేదనలను కూర్పుచేసి సంస్కరించి ఒక వేదనా సముదాయమును నిర్మాణము చేయును. దానికి సరిపోయిన ఔషధము నొకదానిని ప్రత్యేకించును. ఆటుపైన వచ్చునట్టి అసంఖ్యాకులగు అంటువ్యాధుల రోగులకు ఆ యౌషధము ఒక్కటే ప్రాణదానము చేయును.

**సూత్రము 102:** అనేక శరీరతత్త్వములు గల వేరు వేరు రోగులు అదే అంటువ్యాధికి సంబంధించిన వారు వచ్చినపుడు వారందరి సామూహికమైన ప్రతిబింబముగల వేదనా సముదాయము లభించును. దానిని ఆధారముగా గొని ఆ వ్యాధి యొక్క ప్రత్యేకత నిర్ణయమగును. ఇట్లు సాముదాయికముగా నిర్ణయింపబడిన సంపూర్ణ వ్యాధి స్వరూపమే అప్పటి ఆ యంటువ్యాధికి కావలసిన ఔషధమును నిర్ణయించును. ఆ మహౌషధము ఆ వ్యాధిని దమించి, మరణించువారి సంఖ్యను తగ్గించి ఆ వ్యాధి వలన భయోత్పాతము తొలగించును. ఈ పద్ధతి సరియైన ప్రజాసేవకు వైద్యులను అంకితము చేయును.

**సూత్రము 103:** దీర్ఘవ్యాధి విపాకములు సోరాయొక్క ప్రతిబింబమును నిర్మాణముచేయుట, అనేక దీర్ఘవ్యాధుల

వేదనలను కలిపి సముదాయముగా నేర్పరచిననే లభించును. ఇట్టి నిరంతర శ్రమ వలన మాత్రమే ఈ దీర్ఘవ్యాధి యొక్క స్వభావ విజ్ఞానము పరిపూర్ణముగా లభించును. అప్పుడే మానవజాతిని పీడించుచున్న ఈ సోరా వ్యాధిని మానవు డనుభవింపకుండునట్లు నిర్మూల నము చేయుట సాధ్యమగును.

వివరణము: పార్శ్వపు నొప్పులు, కీళ్ళజబ్బు, గుండెజబ్బు, క్షయవ్యాధి, లివర్‌జబ్బు, జలోదరము, క్యాన్సర్, పక్షవాతము, కంటిజబ్బులు, దంతరోగములు, మూలవ్యాధి, భగంధరము, కంఠవ్యాధులు మున్నగునవి వేరువేరు వ్యాధులుగా పరిగణింపబడుచున్నవి. ఇవన్నియు సోరా యనబడుద నొకే వ్యాధినుండి పుట్టిన వికారములనియు, సోరా నివారణ కానిదే ఇవి తగ్గవనియు తెలిసిన వారు తక్కువ. ఇట్టి వివిధ వ్యాధులు వందల కొలది యుండుట, రోగుల నేడిపించుట మనకు విదితమే. అందొక్కొక్క దానికే వేదనా సముదాయముకనిపెట్టినచో దాని ప్రత్యేక లక్షణములు, నివారణౌషధము తెలియును. దానిని నిపుణతతో వాడిన సందర్భమునందు కూడ ఈ వ్యాధులు పూర్తిగా నివారణకాక పీడించుటయు, నివారణమైనట్లు కనిపించి కొన్ని నెలల తరువాతనో, సంవత్సరముల తరువాతనో మరల తిరుగబెట్టుటయు హానిమన్

గమనించెను. వేదనా సముదాయము ననుసరించి సారూప్య పద్ధతిలో శాస్త్రీయముగా నివారణచేసిన చోట గూడ కొందరికి పూర్తిగా తగ్గిపోవుటయు, కొందరికి తగ్గక తిరుగబెట్టుటయు జరుగుచుండుటకుకారణమేమని హానిమన్ మరల దీర్ఘ తపస్సు చేసెను. దానికి ఫలితముగా ఈ దిగివ అంశములను కనుగొనెను:

ఎ) దీర్ఘవ్యాధి విపాకము లేనివారు కొందరు, ఉన్నవారు కొందరు కలరు. లేనివారికి సారూప్య వైద్యము వలన పూర్తిగా నివారణమగుచున్నది. దీర్ఘ వ్యాధులున్న వారికి నివారణమై మరల పుట్టుచున్నది.

బి) ఇట్లు తిరుగబెట్టుటకు కారణ మేమనగా నివారింపబడిన వ్యాధి అతనికున్న వ్యాధిలో కొంత భాగము మాత్రమే. మొత్తము వ్యాధి అంతర్గతమై సోరా విపాకము రూపమున నున్నది. అది వాని జీవితము మొత్తముతో నేకీభవించుకొని యున్నది.

సి) వక్రీకరణము చెందిన జీవిత వైఖరి రూపమున నున్న సోరాలో నొక్కొక్కని యందు కొంతభాగము మాత్రము బయటపడి దాని బాధలను మాత్రము వ్యక్తము చేయుచున్నది.

డి) దాని సమగ్ర స్వరూపము ఏ ఒక్కనియందును

బయటపడుటలేదు. ఒక్కొక్క శరీర తత్త్వమును బట్టి ఒక్కొక్క మహావ్యాధిగా మాత్రము బయటపడి పీడించు చున్నది. దీని నానాత్వమంతయు నొక్కొక్క వ్యక్తియొక్క కుటుంబాచారములు, వాతావరణము, వృత్తి, పరిసరములు మున్నగు భేదముల ననుసరించి ఏర్పడుచున్నది. అడవిలో నొకేచెట్టు దశదిశలలో తీగ దుబ్బులవలె అల్లుకునిపోయి దూర దూరముగా వేరు వేరు మొక్కలవలె భ్రమ కలిగిం చును. తిన్నగ గమనించినచో ఇన్నిటికిని మొదలొక్కటే లభించును.

ఇ) అట్టి సోరా సమగ్ర స్వరూపమును బట్టి నిర్మూలనము చేయవలెనన్నచో దానికొక్కటే మార్గము. వేరు వేరుగా కనిపించుచున్న మహా వ్యాధులను పరిశీలించినపుడు అన్నింటిని ఒకే వ్యాధిగా పరిగణించి వాని సామూహికమగు వేదనా సముదాయము కూర్పు చేసికొనుచు పోవలయును. ప్రత్యేకించి పరిశీలించి నిర్ణయించిన ఇన్ని వేల వ్యాధులను కలిపి యొకే వ్యాధిగా వేదనా నిర్మాణము చేయవలెను. ఈ నిరంతరకృషి ఫలితముగా ఇన్నిటియందును ఒకే వ్యాధి వేదనలు లభించును. దానిని క్రోడీకరించి ఒక అంతర్యామియగు వ్యాధి స్వరూపమును నిరూపణము చేయుటలో హానిమన్

కృతకృత్యుడయ్యెను. దానికే సోరా వ్యాధి యని పేరుపెట్టెను. సోరా యను వ్యాధి ఉన్నదా లేదా యని అనుమాన పడనక్కరలేదు. లభించిన వివిధ దీర్ఘవ్యాధుల సమాహార లక్షణము సత్యమేగాని భ్రమకాదు కదా! దానికేదో ఒకే పేరు పెట్టవలెను. దానినతడు సోరా అని పేర్కొనెను. కనుక సోరావ్యాధి అస్థిత్వము సత్యమేగాని అసత్యము కాదు.

**సూత్రము 104:** పై చెప్పిన విధమున వివరములతో వ్యాధి పత్రికను తయారుచేసి వేదనాసమాహారమైన ప్రతిబింబము నిర్మించినవుడు దానితో స్పష్టముగా సరిపోలిన లక్షణములను పుట్టించు మందును నిర్ణయించుట కాధారమేర్పడును. అట్లు నిర్ణయింపబడినదే సారూప్య ఔషధము. ఇట్లు ఔషధ నిర్ణయముచేయుటకు పడిన శ్రమయే సారూప్య ఔషధ ప్రయోగ ప్రణాళికలో ముఖ్యాంశ మగుచున్నది. చక్కగా కూర్పు చేయబడిన వేదనల పట్టికయు, చక్కగా స్థిరము చేయబడిన ఔషధ గుణముల పట్టికయు, ఔషధ నిర్ణయమునకు సౌలభ్యము కలిగించి శ్రమ తగ్గించును. ఇట్టి పరిశ్రమ చేయుట యందు రెండంశములు ఇమిడి యున్నవి.

ఎ) నిర్దుష్టమైన వేదనల పట్టికా గ్రంథము (repertory) నొకదానిని పరిచయము చేసికొని దానిపై నధికారము

సాధించుట.

బి) సంపూర్ణముగా ప్రయోగ పరిశీలన చేయబడిన ఔషధగుణపట్టిక (Materia Medica) యందు విలక్షణమైన నిపుణతను సాధించుట. ఈ రెండవదానిని సాధించుట స్వల్పవిషయముకాదు. దానియందు తగిన పద్ధతిలో సమాధి స్థితిని సాధించుట ఎట్లు లభ్యమగును? వ్యాధిపీడితులకు సేవచేయగలుగు సామర్థ్యమునకై అభిలాష యున్నవారికి లభ్యమగును. లోపలికి పుచ్చుకొను ఔషధములను గూర్చిన విజ్ఞానశాఖలలో సాటిలేని నివారణ సామర్థ్యముగల విధానము నవలంబించుట వలన ఈ అభిలాష పెరుగును. ఒక రోగి తన స్థితికి సారూప్యముచెంది ఔషధమును పొంద కలిగినపుడు, నివారణ మార్గమునగల ఇతర విఘ్నములు తొలగింపబడినపుడు, వ్యాధి నివారణము శీఘ్రముగను, సౌమ్యముగను, సంపూర్ణముగను చేయుటకు సాధ్యమయినంతపని చేసినట్లే యగును.

వివరణము: పై చెప్పిన విధమున వందల కొలది మహావ్యాధుల వేదనా సముదాయములను సమీకరించి ఆ మొత్తమునకు వేదనా సముదాయమును సాధించినచో సోరా వ్యాధియొక్క సమగ్ర స్వరూపము లొంగును. దీనిని నిర్విఘ్నముగా కొనసాగింపవలెనన్నచో రెండు శాస్త్ర శాఖలు ఆదరింపబడవలెను.

ఎ) సేకరింపబడిన ఇన్నివేల వ్యాధుల వేదనలను గణవిభజనచేసి కూర్పుచేయబడిన వేదనల పట్టిక (repertory) సంసిద్ధమై యుండవలెను. దానియందు వైద్యునకు అధికారశక్తి యేర్పడవలెను.

బి) ఔషధములు పుట్టించు వేదనా సముదాయము సత్ప్రయోగముగా నిర్ణయింపబడవలెను. దాని ఫలితముగా ఔషధములకు సంబంధించిన శారీర గుణదీపిక (Materia Medica) నిర్దుష్టముగా, సంపూర్ణముగా నిర్మాణము కావలెను. (తన జీవితమంతయు సాధించి జేమ్సుటేలర్ కెంటు ఈ రెండిటిని సాధించెను.)

ఈ రెండు శాస్త్ర శాఖలయందును స్వామిత్వము సాధింపవలెను. ఇది చిన్నవిషయము కాదు. ఇది కేవలము అధ్యయనమువలనగాని, అభిలాష వలనగాని సాధ్యమగునట్టిది కాదు. దీని ఫలితముల విలువ తెలిసిన కొలది ఇది సాధ్యమగును. వ్యాధిగ్రస్తుల బాధా నివారణ విషయమున సహజమైన ప్రేమగలవానికి దీనికి తగినశ్రద్ధ పుట్టును. దాని ననుసరించి సిద్ధహస్తు డగును. ఈ రెండుశాఖలను సమన్వయించి రోగి ఔషధము నిర్ణయించిప్రయోగింపవలెను. అంతటితో తన కర్తవ్యము పూర్తి అగును. నివారణము శీఘ్రముగను, సౌమ్యముగను, సంపూర్ణముగను చేయుటకు తనచేతిలో నున్నంతవరకు పూర్తిగా వినియోగించిన వాడగును.

## ఔషధ విజ్ఞానము

**సూత్రము 105:** ఔషధములను గూర్చిన విజ్ఞానము గడించుట వైద్యుని రెండవ కర్తవ్యము.

**సూత్రము 106:** ప్రతి ఔషధమునకు గల రోగోత్పాదన సామర్థ్యము వలె సకల విషయములు, విస్తృతియు పూర్తిగా తెలియవలెను.

**వివరణము:** రోగోత్పాదన సామర్థ్యమనగా రోగములను పుట్టించు శక్తి. అదియే సారూప్యము గల చోట రోగములను తొలగించు శక్తి. ఏ ఔషధము ఏ బాధలను ఉత్పాదించునో తెలియవలెను. అందు ప్రధానాంశములు తెలిసిన చాలదు. చిన్న చిన్న అంశములతోకూడిన ఔషధ స్వభావము సమస్తము సవిస్తరముగా తెలియవలెను. లేనిచో మిగిలిన మందులకన్న వేరుగా గుర్తింపబడుటకు దానికి గల ప్రత్యేకత ఎట్టిదో తెలియదు. తెలియనిచో ఆ మందును తగిన రోగి కెట్లు ప్రత్యేకింపవలెనో తెలియదు.

**సూత్రము 107:** ఈ ఔషధములు ఆరోగ్యము నెట్లు భిన్నము చేయగల్గునో తెలిసికొనుటకు ప్రయోగపద్ధతి ఆవశ్యకము.

వివరణము: ప్రయోగ పద్ధతి అనగా ఆరోగ్యకరమైన వ్యక్తులపై ప్రయోగించి చూచుట.

**సూత్రము 108:** ఈ విజ్ఞానమును సంభావ్యతలపై నాధారపడి స్వీకరింపరాదు.

వివరణము: సంభావ్యత యనగా నిది యిట్లు ఉండి యుండవలెనని భావించుట, ఉదాహరణకు: గులాబిపువ్వు రమ్యముగా నున్నది కనుక, మంచి పరిమళము కల్గినది కనుక రోగములను పుట్టింపదని నిర్ణయింపరాదు. సెయింట్ ఇగ్నీషియస్ అను జాతి గులాబిపువ్వును ఔషధీకరణము చేసినచో ఆరోగ్యవంతునకు ఉన్మాదము, హిస్టీరియా పుట్టించును. దానినిబట్టి 'ఇగ్నీషియా' అను మందు తయారు చేయబడినది. అట్లే మంచు తెల్లగులాబి అను జాతి పుష్పము నౌషధీకరణము చేసినచో ఘోరమైన నరముల వ్యాధులు, మూర్ఛలు, పక్షవాతము మున్నగు వానిని పుట్టించును. దీనినిబట్టి "హెల్లిబోరస్" అను ఔషధము తయారుచేయబడినది.

**సూత్రము 109:** ఇట్లు ప్రయోగపద్ధతిలో ఔషధముల ప్రభావమును, ప్రత్యేక స్వభావమును కనిపెట్టి ప్రపంచమునకు మొట్టమొదటిగా వెల్లడిచేసి వ్యాధి నివారణ పద్ధతిని సారూప్య విధానముగా నేను నిరూపించితిని.

**వివరణము:** ఈ విధమైన ఔషధ విజ్ఞానమును, దానితో రోగ నివారణ విజ్ఞానమును మొట్టమొదటగా కనిపెట్టినది హానిమన్ అనుటలో సందేహము లేదు. అదివరకు మందుల పరిశోధనము వేరుగా నుండెడిది. పంచదార జలుబు చేయును, మిరియాలు వేడిచేయును అను స్థూలమైన అభిప్రాయముల ననుసరించి మందులను ప్రయోగించి చూచుట, అనుభవమును బట్టి ఆ యా మందుల గుణములతో కొంత పరిచయమేర్పడి మందులు వాడుట, శాస్త్రము చెప్పుట మాత్రమే జరిగినది. అందును రోగులపై మందులు వాడిన అనుభవమేగాని, ఆరోగ్యవంతులపై వాడి వాని ప్రభావము గుర్తించిన అనుభవము పాశ్చాత్య వైద్య ప్రపంచమున ఆనాటివరకును లేదు. నాటివరకే కాదు నేటివరకుకూడ అలోపతీ విధానమున లేదనుట నిశ్చయము. ఎవరును కాదనలేరు.

హానిమన్ నాటికి పాశ్చాత్య ప్రపంచమునకు ఆయుర్వేద మున్నదని తెలియదు. ఆయుర్వేదమున ఔషధ ప్రయోగ నిరూపణ శాస్త్రమున్నదని తెలియదు. కనుక హానిమన్ తానే మొదటివాడనని వ్రాయుటలో దోషము లేదు. అదికాక తాను మరల సొంతముగా దర్శించెను గాని ఎవరి గ్రంథములనుండి సేకరించ లేదు.

**సూత్రము 110:** ఇంతకు పూర్వమున్న శాస్త్రజ్ఞులు

గ్రంథములలో నిర్ణయించిన పదార్థములన్నియు ప్రమాద కరములని ఎట్లు నిర్ణయింపగలిగిరి? వారు విషముల నెట్లు విషములుగా తెలిసికొనిరి? ఆరోగ్యవంతులు పొరపాటున వానిని నుపయోగించినపుడు పుట్టిన విపత్కరములైన ఫలితములను బట్టి గుర్తించిరి. వారి అనుభవము నుపయో గించుకొని ఆత్మహత్యా ప్రయత్నములు చేయువా రుపయో గించుకొనిరి. ఈ రెండు ఆధారముల నుపయోగించి తరువాత శాస్త్రజ్ఞులు వానిని విషములని నిర్ణయించిరి. అటుపైన కొందరు వానిని పరిమితిలో నుపయోగించి మచ్చిక చేసికొనుటవలన ఔషధములుగా వాడవచ్చునని తెలిసికొనిరి. ఈ పరిశీలన చేసిన వారిలో నెవ్వరును తాము గమనించిన ఫలితములు ఆ ద్రవ్యముల రోగోత్పా దన సామర్థ్యములని, ఔషధ ధర్మములని గ్రహించుటకు తగిన శ్రద్ధ చూపకపోయిరి. నేను నా శరీరముపై వానిని ప్రయోగించి వాని ఔషధ ధర్మములను మొట్టమొదటగా నిరూపించితిని. ఈ విషద్రవములు ఉత్పాదన చేయునది మృత్యువు కాదనియు, దానికి సంబంధించిన వ్యాధి లక్షణములనియు తెలిసి కొంటిని. ఆ ద్రవ్యము పుట్టించు కృత్రిమవ్యాధి యొక్క వేదనా సముదాయమని గ్రహించితిని. ఇవియే వ్యాధులను నివారణచేయు ఔషధ శక్తులని గూడ గ్రహించితిని. ఈ గ్రహించుట వానిని

గూర్చిన అభిప్రాయముల వలన గాని, రంగు, రుచి
వాసన వలన గాని నిర్ణయింపలేదు. ఆ పదార్థములో
రసాయనిక ద్రవ్యముల విభాగముపై నాధారపడి కూడ
నిర్ణయింపలేదు. లేదా అట్టి ద్రవ్యములను కొన్నిటి
అనేకవిధములుగా కలగలుపు చేసి రోగులపై వాడి చూచుట
వలన కూడ నిర్ణయింపలేదు. ఈ ద్రవ్యముల గుణముల
ధర్మములు ఔషధ గుణములుగా పరిశీలన చేయబడ
ననిగాని, వ్యాధులను నివారించుట కుపయోగపడున
గాని ఎన్నడును, ఎవ్వరును కలలో కూడ భావింపలేదు.

**సూత్రము 111:** ఈ ద్రవ్యములలో కనుగొనబడిన ఈ
ఔషధ గుణములు శాశ్వతములు. అవి మార్పుటకు
వీలులేనట్టి సిద్ధ గుణములు. నిర్ణీతములు, శాశ్వత
ధర్మములు అగు నీ ధర్మములకు విధేయములై మందుల
పనిచేయును. కారణములలో నున్న సామ్యమే కార్యములలో
సిద్ధించు సామ్యము.

వివరణము: చక్కెర తియ్యగా నుండును. ఉప్పు
ఉప్పగా నుండును. నిప్పు కాల్చును. నీరు తడుపును
వాయువు కదలించును., ఇవి మారని ప్రకృతి ధర్మముల
ఇట్టివే ఔషధ గుణములును. ఈ ఔషధము ఈ
మార్పులను బుట్టించును అనునది గూడ ప్రకృతి ధర్మమే

మార్పులను పుట్టించుకారణమైన ద్రవ్యము ననుసరించి కార్యమైన ఫలితము పుట్టును. నిప్పు కాల్చునను ధర్మమును వినియోగించుట తెలియక అగ్గిపుల్ల గీసి ముట్టించినచో ఇండ్లు తగులబడును. నిప్పునకు కాల్చునట్టి ధర్మము కారణముగా పనిచేయును. దానిపై నాధారపడి ఇండ్లు తగులబడుట కార్యము. అజ్ఞానము ఇచ్చట నిమిత్త కారణము. ఇట్లే జ్ఞానము నిమిత్త కారణమైనచో నిప్పుతో వంటచేయుట యను కార్యము సిద్ధించును. అట్లే ఔషధముల ప్రభావము రోగనివారణము అను కార్యమును పుట్టించును.

**సూత్రము 112:** ఈ విపత్కరములైన ద్రవ్యములు ఎక్కువ పరిమాణములోవాడబడినపుడుకలుగునట్టి నష్టములను వెనుకటివారు వివరించిరి. ఆ ద్రవ్యములే పరిమితములుగా వాడబడినపుడు మానవశరీరము తట్టుకొని నిలబడుట గమనింపదగినది. ఇచ్చట రెండు విధములైన గుణములను గమనింప వచ్చును.

ఎ) ద్రవ్యము దేహముపై పుట్టించునట్టి ప్రాథమిక ప్రభావము.

బి) దాని కెదురు తిరిగి మన దేహమందలి ప్రాణశక్తి పుట్టించు ప్రతిక్రియా ప్రభావము. అందు మొదటిది

విపత్తును కలిగించును. రెండవదియగు ప్రతీకార ప్రభావము ఆ ద్రవ్యము యొక్క విపత్తును బహిష్కరించి మరల ఆరోగ్యమును చక్కబెట్టును. ఈ రెండవది మొదటిదాని వలననే ప్రేరేపింపబడవలెను. ప్రాణశక్తిని ప్రతిక్రియకు ప్రేరేపించుటకు ఆ విషద్రవ్యమును పరిమితముగా, స్వల్పముగా నుపయోగించుట తప్ప మరియొక మార్గము లేదు. ఇట్లు రెండు విధములైన ప్రభావములు విషద్రవ్యముల నుండి వుట్టునని గ్రహింపకపోవుట వలన పూర్వ రచయితలు తికమకపడి ఔషధద్రవ్యములను గూర్చి వివాదములను పెంచుకొనిరి.

వివరణము: విషములను మందులుగా వాడవచ్చునని కొందరును, అవి విపత్కరములు గనుక వాడరాదని కొందరును సిద్ధాంతములను చేసిరి. ఇట్లు వివాదపడుట పైచెప్పిన రెండు విధములైన ప్రభావములను విస్పష్టముగా గ్రహింపక పోవుట వలననే.

**సూత్రము 113:** మాదక ద్రవ్యములు మాత్రము ఈ విషద్రవ్యములకన్న ప్రత్యేకముగా గుర్తింపబడినవి. వాని ప్రాధమిక ప్రభావమువలన చైతన్యమునకు జడత్వ మేర్పడును. ఇదియే మత్తు కలుగుట. కాని రెండవదియగు ప్రతిక్రియలో ప్రాణశక్తి ఆ మత్తును తొలగించుటయేగాక

ఇంద్రియ చేతనమునకు ఉద్రిక్త పరిస్థితిని గూడ నేర్పరచును.

వివరణము: కాఫీ మత్తుపదార్థము. అది మొదట మాదక గుణము వలన చక్కని విశ్రాంతిని కలిగించును. దానిని తొలగించుటకు ప్రాణశక్తి చేయు ప్రతిక్రియవలన ఉత్తేజము కలిగించును. దీనిని తెలియక కాఫీ ఉత్తేజ కరమగు ద్రవ్యమను కొందురు. తరచుగా వాడుచుండుట వలన ప్రాణము నిరంతరము ప్రతిక్రియ చేయుట కలవాటుపడును. దానితో నెక్కువమార్లు కాఫీ సేవించు వారికి నిద్రపట్టకుండుట, నరముల దౌర్బల్యము ఏర్పడును. మద్యము మొదలగు మాదక ద్రవ్యము లన్నియు నిట్లే పనిచేయును.

**సూత్రము 114:** ఔషధ ద్రవ్యములను దేహముపై ప్రయోగించినపుడు కూడ ఈ పనులే జరుగును. ద్రవ్యమును హెచ్చు పరిమాణమున వాడకుండుట, తరచుగా నెక్కువ మార్లు వాడకుండుట అను జాగరూకత పాటించినచో నీ ఔషధములను ప్రయోగించి పరిశీలన చేయువారి దేహములకు కష్ట నష్టము లేవియు జరుగవు.

**సూత్రము 115:** ఇట్లు ప్రయోగము చేయు ద్రవ్యములు పుట్టించు వేదనలలో కొన్ని విచిత్రముగా పనిచేయును.

కొన్ని మందులు వాడునపుడు మందుల ప్రభావమువలన పుట్టిన లక్షణములుగాక వానికి వ్యతిరేక లక్షణములు కూడ పుట్టి పోవుచుండును. వానిని బట్టి ప్రతీకార లక్షణములతో కూడ వానికి వ్యతిరేక లక్షణములు పుట్టి పోవుచుండును. వీనిని అన్నిటిని ప్రతీకార లక్షణములుగా భావింపరాదు. వీనిని పర్యాయ లక్షణములని వేరుగా గుర్తింపవలెను.

వివరణము: ఇంతవరకును ఔషధ ప్రాధమిక లక్షణములు, వానికి ప్రతీకార లక్షణములు మాత్రమే చెప్పబడినవి. ఇవికాక చిల్లర వ్యతిరేక లక్షణము లనేకములు పుట్టుచు పోవుచు ఉండును. వానిని వేరుగా గుర్తించి పర్యాయ లక్షణములని పేర్కొనుట జరిగినది.

**సూత్రము 116:** ఔషధములు ప్రయోగించునపుడు కొన్ని వేదనలు ఎక్కువ మందిలో ఎక్కువ తరచుగా వ్యక్తమగు చుండును. మరి కొన్ని వేదనలు తక్కువ మందిలో తక్కువ తరచుగాను, కొన్ని అరుదుగాను వ్యక్తమగుచుండును.

వివరణము: ఆరోగ్యవంతుని యందు ఒకే ఔషధ ప్రయోగము జరిగినపుడు కొన్ని వేదనలు వారందరిలోను తప్పక కనిపించును. లేదా ఎక్కువ మందిలో కనిపించును.

మరికొన్ని వేదనలు చాల తక్కువ మందిలో కనిపించును. లేదా కొందరిలో కనిపించక పోవచ్చును.

దీని వలన తెలియున దేమనగా:

ఎ) ఎక్కువ మందిలో తరుముగా కనిపించు వేదనలతో సారూప్యముగల రోగికి వ్యాధి సక్రమముగాను, నిస్సందేహముగాను నివారణమగును. తక్కువమందిలో కనిపించు వేదనలలో మాత్రమే సారూప్యముగల రోగికి ఆ మందుతో కొంత భాగమే నయమగును. ఉదాహరణకు: ఆరోగ్యవంతులు వందమందికి బ్రయోనియా ప్రయోగము చేసినచో కొందరికి తలనొప్పి పుట్టును. కొందరికి ఒళ్ళునొప్పులు, కొందరికి జ్వరము, కొందరికి కడుపునొప్పి, కాని అందరికిని విపరీతమైన దాహము, చన్నీళ్లను హెచ్చుగా త్రాగుట, తాపము, చల్లనిగాలి కావలెనిపించుట, కదలినచో విపరీతమైన బాధ మున్నగునవి తప్పక కలుగును. మిగిలిన బాధ లున్నవారికిని, లేనివారికిని ఇవి కలుగును. నూటికి నూరుమంది ఆరోగ్యవంతులకు ఈ బాధలు కలుగును. కనుక సారూప్యమున్న రోగులలో ఈ వేదనలతో కూడిన వ్యాధులు నూటికి నూరుపాళ్లు నయమగును. అట్లుగాక తలనొప్పికో, కడుపునొప్పికో బ్రయోనియా వాడినచో చాల ందికి తగ్గవు.

**సూత్రము 117:** అందు రెండవ తరగతికి చెందిన వేదవలు వేదనా వికల్పములు అవబడును. (Idiosyncrasies) ఈ వేదనలు కలుగువట్టి వైచిత్రి కేవలము భ్రాంతియేగాని సత్యముకాదు. సారూప్యము చెందిన వేదనలు రోగియందు తప్పక నివారణమగుట మనము చూచుచున్నాము. కనుక ఔషధముతో నివారణ చెందునట్టి వేదనలు ఆరోగ్యవంతునిలో తప్పక కనిపించి తీరును. ఇంతకును కొన్ని శరీర తత్త్వములు ఔషధములకు హెచ్చుగా ప్రభావితము లగుటయు, కొన్ని తత్త్వములు తక్కువగా ప్రభావితము లగుటయు కనిపించు చున్నదనుట సత్యము. దీనినిబట్టి ఆ మొదటి తరగతి తత్త్వములు త్వరగా వ్యాధులకు గురి అగుననియు, రెండవ తరగతి తత్త్వములు వ్యాధులకు తక్కువగా లొంగుననియు తెలియును.

వివరణము: ఒకే ఔషధము ఆరోగ్యవంతులలో కొందరిలో నెక్కువ వేదనలను, కొందరిలో తక్కువ వేదనలను పుట్టించుననీ అర్థము. ఇది ఆయా తత్త్వములయొక్క ప్రాణశక్తి దృఢత్వముపై నాధారపడి యుండును. దృఢమైన ప్రాణశక్తిగల చోట తక్కువ వేదనలు మాత్రమే వెలువడును. లొంగునట్టి స్వభావముగల ప్రాణశక్తి గలవాడు ఎక్కువ వేదనలను పుట్టించును. ఈ భేదము

ఆ తత్త్వముల యందలి ఆరోగ్య కక్ష్యయొక్క భేదమేకాని వేరు కాదు. దీనిని వెనుకకు త్రిప్పి చదివినచో ఈదిగువ విధముగా నర్థమగును:

ఎ)ఆరోగ్యవంతునకు కొద్దిగా మాత్రమే ఆరోగ్యము చెడి రెండు మూడువేదనలు మాత్రమే ఉన్నచో అవి ఒకే మోతాదుతో కొంచెము దీర్ఘకాలమువ చక్కబడును. మిగిలిన ఔషధ లక్షణములు వానియందు పనిచేయవు.

బి) అనేక తీవ్రవేదనలతో బాధపడుచున్న వానికి వెంటనే గుణము కనిపించి, అధిక సంఖ్యాకములైన వేదనలు త్వరగా చక్కబడును.

**సూత్రము 118:** ఒక్కొక్క ఔషధము మానవదేహముపై నొకే విధమైన ప్రభావము కలిగియుండును. ఏ రెండు ఔషధములును అదేవిధమైన ప్రభావము కలిగి ఉండవు.

వివరణము: రెండు మూడు ఔషధములకు నొకే విధమైన వేదనలు పుట్టవచ్చునుగాని ఒకే వేదనా సముదాయము పుట్టదు. ఆ వేదనల మొత్తము యొక్క కూర్పు ఆ ఔషధమునకు మాత్రమే ప్రత్యేకము. మనిషిని పోలిన మనిషి ఉండవచ్చునుగాని మొత్తము పోలికలు స్వభావము, మనస్తత్వము కల వ్యక్తులు ఇద్దరు ఉండరు.

**సూత్రము 119:** ప్రకృతిలో నొకే ఖనిజ పదార్థముగాని,

చెట్టుగాని దానికి స్వాభావికమైన ఆకృతి, రసాయనిక గుణములు, రంగు, రుచి, వాసన, కనబడునట్టి వైఖరి రసాయనిక ప్రతిక్రియలు కలిగియుండును. కనుకనే అది తన స్వభావముచే గుర్తింపబడును. ఈ లక్షణ సముదాయముతో రసాయనిక శాస్త్రజ్ఞుడు పరిచయము కలిగించుకొనుటలో దానిని గుర్తించును. అదేవిధముగా వైద్యుడు తన విద్యాకౌశలము వలన ప్రతి మూలికను, ప్రతి రసాయనిక పదార్థమును దానివ్యాధి జననప్రభావముచే గుర్తింపవలెను. ఈ గుర్తింపు ఆరోగ్యవంతుల తత్త్వముచే నొక్కొక్క దానినే ప్రయోగించుట వలన స్పష్టపడును. ఇట్లు గుర్తించిన ఔషధ గుణము ప్రకృతిలో నొక ద్రవ్యముయొక్క రసాయనిక ద్రవ్యముల గుర్తింపువలెనే ప్రయోగ పరిశీలన వలన జరుగుచున్నది. ఇది భౌతిక విభజనా పద్ధతికిగాని,రసాయనిక విభజనకుగాని అందదు. మానవుని ఆత్మ ఇట్టి పరిశీలనకు లొంగి అర్థమగుట లేదు కదా! అట్లే ఔషధముల సారము కూడ.

వివరణము : మానవుడనగా నేమి? శరీర ధాతువులలోని రసాయనిక పదార్థముల మొత్తమా? కాదు, మానవునియందివి అన్నియు ఉండును. వాని యందివి యన్నియు జరుగును. అయినను వాడువేరు. అదియే ఆత్మ. అట్లే ఔషధ మనగా అందలి ద్రవ్యగుణముల

గుర్తింపు కాదు అది చూపు ప్రభావము..

**సూత్రము 120:** కాబట్టి ఔషధ ప్రభావముపైన నాధారపడి మానవుని ఆరోగ్యము, అనారోగ్యము, బ్రతుకు చావుల వైఖరులు ఉండును. ఈ ప్రభావ వైఖరులు ఒక దానికన్న నింకొకటి వేరుగను, స్పష్టముగను, సంపూర్ణముగను గుర్తింపబడవలెను. ఔషధముల శక్తియు, ప్రతిక్రియా సామర్థ్యము తెలియవలెనన్నచో స్వచ్ఛమైన ద్రవ్యములను ఆరోగ్యవంతులపై ప్రయోగింపవలెను. అది జరిగినపుడే వ్యాధులయందు ప్రయోగించుటలో పొరపాట్లుండవు. ఔషధ నిర్ణయము దోషములేకుండ జరుగుట యనగా మానవులకు లభించినట్టి దైవానుగ్రహము. దానివలననే శారీరక, మానసిక స్వస్థత శీఘ్రముగను, సార్వకాలికముగను జరుగును.

**సూత్రము 121:** ఆరోగ్యవంతుని యందు చేయు నౌషధ ప్రయోగమున నొక విషయము గమనింపవలెను. తీవ్రములు, భీకరములు నగు నౌషధములను తక్కువ పరిమితిలో ప్రయోగింప వలెను. ఇవి దృఢమైనవారి దేహములందు గూడ మార్పులు పుట్టించును. సౌమ్యములైన ఔషధములను ఎక్కువ పరిమాణమున వాడవలెను. అనగా అతిదుర్బల శరీరతత్త్వమున గూడ వాని ప్రభావము

గమనింపదగినదిగా నేర్పడవలెను. ప్రయోగమును స్వీకరించువారు రోగములు లేనివారుగను, సున్నితమై ఉద్రేకింప బడుటకు వీలయిన తత్త్వము గలవారై ఉండవలెను.

వివరణము: ఆరోగ్యవంతులు అనగా బాధలు లేనివారు మాత్రమేగాక, సోరా మున్నగువిపాకములు లేనివారుగా నుండవలెను. సున్నితమైన వారనగా మోటుతత్త్వమువారు పనికిరారు. ఉద్రేకింపబడుటకు వీలయిన తత్త్వమనగా విషపదార్థమునకు వెంటనే ప్రతిక్రియకు చెలరేగునట్టి ప్రాణశక్తి కలవారు.

**సూత్రము 122:** ఈ ప్రయోగముల పైననే వైద్యవిద్య యొక్క నిర్దిష్టత ఆధారపడి యున్నది. దానిపైననే రాబోవు తరముల ఆరోగ్యసంపద ఆధారపడి యుండును. కనుక ప్రయోగించు ఔషధములు స్వచ్ఛములై అందలి ప్రభావము నమ్మదగినంత స్పష్టత కలిగిన సుప్రసిద్ధ ద్రవ్యములై ఉండవలెను. కలగలుపు పనికి రాదు.

వివరణము: శొంఠి యను పేరు అందరకును తెలియును. దాని రసాయనిక సంకలనమును ప్రయోగశాలలో నిర్దిష్టము చేయవచ్చును. దానిని స్వచ్ఛముగా గైకొని ఔషధ గుణములను నిర్ణయించి

ప్రకటించినచో ఎల్లరును తేలికగా గుర్తుపట్టగలరు. అట్లుకాక ఒక మూలికకు సంజీవి అని పేరు పెట్టి యొకడు వైద్యమున వాడుచుండగా దాని ఔషధగుణములను నిర్ణయించి మెటీరియా మెడికా కెక్కించినచో వాడు చనిపోయిన వెనుక అది ఎవరికిని పనికిరాదు.

**సూత్రము 123:** స్వీకరింపబడిన ఔషధములు సరళములు, స్వచ్ఛములు అయి వుండవలెను. ప్రాంతీయములైన మూలికలు నవనవలాడుచుండగనే రసము తీసి, చెడిపోకుండ కొంచెము ఆల్కహాల్‌తో కలిపి వాడవచ్చును. ఎచ్చటనో దూరప్రదేశములలో దొరకు చెట్లయొక్క ద్రవ్యములను ఎండబెట్టి చూర్ణముచేసిగాని లేక అవి పచ్చిగా నున్నపుడు ఆల్కహాల్ కషాయము తీసిగాని ఉంచవలెను. తరువాత వాడునపుడు నీళ్లు కలువవచ్చును. లవణ పదార్థములను, జిగురు పదార్థములను మొదట నీటిలో కలిపి తరువాత సేవింపవలెను. ఏదైన నొక వృక్షము ఎండబెట్టినది మాత్రమే లభించునపుడు దాని ద్రవ్య గుణములు సహజముగా తీవ్రములు గానిచో కాచి కషాయములు వాడవచ్చును. కషాయము తీయునపుడు మూలికను చిన్న చిన్న ముక్కలు చేసి దానిపై మరుగుచున్న నీళ్లు పోయవలెను. అందలి ఔషధ భాగములు కషాయముగా దిగును అది వెచ్చగా

నుండగనే సేవింపవలెను. కారణమేమనగా ఆల్కహాల్ కలుపని మూలికా కషాయము లేనైనను త్వరగా పులిసి విరిగిపోవును. దానితో ఔషధ గుణములు నష్టమగును.

**సూత్రము 124:** ప్రయోగము చేయదలచిన ఔషధ ద్రవ్యము నొక్కొక్కదానినే స్వచ్ఛముగను, ప్రత్యేకముగను, మరియొక దానితో కలుపకుండగను స్వీకరింపవలెను. అదే దినమున, లేక తరువాత దినములలో కూడ ఎంతకాలము దాని గుణములను పరిశీలింప దలచితిమో అంతకాలము మరియొక ఔషధ స్వభావముగల ద్రవ్యమును స్వీకరింపరాదు.

వివరణము: స్వీకరించినచో దాని గుణములు మొదటి ఔషధము గుణములతో సంకరము చెందును. అపుడు మొదటిదాని గుణములను పరిశీలించుట సాధ్యము కాదు. ఔషధమును స్వీకరించునపుడు కూడ రోగి ఇదే విధమైన నియమము పాటింపవలెను. లేనిచో పరిశీలింపబడిన ఔషధ గుణముల సహాయముతో జరుగుచున్న వైద్యము సంకరమగును.

**సూత్రము 125:** పరిశోధన జరుగుచున్నంత కాలము ఆహార నియమమును నిశితముగా పాటింపవలెను. మసాలా ద్రవ్యములు, తీవ్రమైన రుచులు, వాసనలు

కలవానిని విసర్జింపవలెను. పచ్చని కూరలు, బలవర్ధకమై సరళమైన ఆహార పదార్థములను స్వీకరింపవలెను. (చిక్కుడు, గోరుచిక్కుడు, అలచందలు, బొబ్బర్లు, ఉడక పెట్టిన బంగాళాదుంపలు, క్యారట్లు వాడవచ్చును.) ముల్లంగి మున్నగు వాసన దుంపలు, గోంగూర, పుదీనా మున్నగు వాసన గల కూరలు వర్జింపవలెను. వీని నెంత జాగరూకతతో వండినను లక్షణ భేదము పుట్టించు ఔషధ గుణములు కల్గియుండును. పానీయములు కూడ వీలయినంత వరకు నుత్తేజకరములు కానివై ఉండవలెను. (ద్రాక్ష సారాయి, బ్రాంది, కాఫీ, టీ మున్నగుమాదక ద్రవ్యములను, ఉత్తేజకరములగు పానీయములను ఔషధ గుణములు కలవానిని మానవలెను.)

వివరణము: కంది, పెసర మున్నగు పప్పులను; తోటకూర, పొన్నగంటి మొదలగు వాసనలేని ఆకుకూరలను; పొట్ల, బీర, సొర, రామములగ, క్యాబేజి మొదలగు వాసనలేని కూరలను; పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి, తేనె, బెల్లము, చక్కెర వాడవచ్చును. ఉప్పు కొంచెము వేయవచ్చును. చింతపండు, మిరపకాయ, మిరియము, శొంఠి, అల్లము, ఏలకి, లవంగము, దాసినచెక్క, కర్పూరము, మెంథాల్, కుంకుమపువ్వు, జాజికాయ, జాపత్రి, తమలపాకు, వక్క మున్నగునవి

ఔషధ గుణములు గలవి కనుక వాడరాదు. అట్లే కాకరకాయ మున్నగు చురుకు అయిన రుచిగల వానిని వాడరాదు. చింతపండు బదులు నిమ్మకాయ, ఉసిరికాయ వాడవచ్చును. ఫలములన్నిటిని వాడవచ్చును. మందులు రోగులకు వాడునపుడు కూడ వీనిని పాటించినచో సక్రమముగా గుణము కనిపించును. ఇంగువ వాడరాదు. ఉల్లిపాయ, వెల్లుల్లి ఔషధ గుణములు గలవి. అట్లే కొత్తిమిరి. కనుక వీనినిగూడ వాడరాదు.

**సూత్రము 126:** ఔషధ ప్రయోగమును స్వీకరించువాడు నమ్మదగినవాడు, నీతిమంతుడు, పాపభీతిగలవాడుగా ఉండవలెను. ప్రయోగము జరుగుచున్నంతకాలము మనస్సునకు, దేహమునకు ఎక్కువ అలసట పనికిరాదు. ప్రాణద్రవ్యము వ్యయమగునట్టివి, కల్లోలము చెందునట్టివి అగునావేశములు పనికిరావు. అత్యవసరములైన కార్యభారముతో మనస్సు తీవ్రత చెందరాదు. తనను తాను జాగరూకతగా పరిశీలించుకొను ప్రయత్నమున నిమగ్నుడై యుండి దృష్టి చెదరరాదు. దేహము తన కనుకూలమై యుండునట్టి మంచి ఆరోగ్యముతో నుండవలెను. తనకు కలిగిన అనుభవములను నిర్దిష్టమైన పదములతో వర్ణించి వ్యక్తము చేయుగల తెలివి యుండవలెను.

వివరణము: నీతిమంతుడు, పాపభీతి కలవాడు అగుటవలన ఉత్సాహము కొరకై లేని వేదనలు ఉన్నట్లు చెప్పువాడును, నిరుత్సాహముతోను, విసుగుతోను కలిగిన వేదనలను చెప్పనివాడును పనికిరాడు. నియమముగల సత్యశీలము కావలెను. దేహమునకు, మనస్సునకు అలసట కలుగునంత చదువుగాని, వ్రాతపనిగాని, ప్రయాణములు గాని, బరువులు మోయుటగాని యుండరాదు. ప్రాణశక్తిని వ్యయము చేయునట్టి ఆవేశము లనగా కామక్రోధాదులు, రోషము, వైరము, పగ కలవారు పనికిరారు. దాంపత్య సౌఖ్యము గూడ ఆవేశకరము గనుక పరిశీలన దీక్షాకాలమున సౌమ్యమనస్సుతో కూడిన బ్రహ్మచర్యము ఆవశ్యకము. సరియైన తెలివితేటలు లేనివాడు వేదనలను సరియైన వాక్యములలో చెప్పలేడు. 'కడుపులో అదేదో ఇదిగా నున్నది' మున్నగు పిచ్చి పదములను ప్రయోగించును. లేదా తప్పులు చెప్పును. "మనస్సు పనిచేయుటలే" దని చెప్పుటకు బదులు "మత్తుగా నున్నదనియో, తల తిరుగుచున్న" దనియో చెప్పును.

**సూత్రము 127:** ఔషధములను స్త్రీలపైనను, పురుషుల పైనను కూడ ప్రయోగింపవలెను. అప్పుడే దాంపత్య విషయములకు సంబంధించిన ఆరోగ్య విపరిణామములు తెలియగలవు.

**వివరణము:** కొన్ని మందులు స్త్రీల ఋతు సంబంధమైన ఆరోగ్యములో మార్పులు కలిగించును. కొన్ని బాలింతలకు, కొన్ని చూలెంతలకు మార్పులు కలిగించును. కొన్ని స్త్రీలయందు కామమును పెంచుటయో, తగ్గించుటయో, వికారములు పుట్టించుటయో చేయును. కొన్ని రజస్వల సమయమునందు లేక బహిష్టు నిలచిపోవు సమయమునందు మార్పులు కలిగించును. కొన్ని క్షీరగ్రంధులను కదిలించి పాలు హెచ్చించుటయో, తగ్గించుటయో చేయును. కొన్ని భర్తయందు, పిల్లలయందు ఆపేక్షను పెంచుటయో, తగ్గించుటయో చేయును. ఇట్టి లక్షణములు పురుషులపై మాత్రము వాడినపుడు తెలియవు కదా!

**సూత్రము 128:** కొన్ని మందులలో ఔషధ ప్రభావము నిగూఢముగా దాగి యుండును. వానిని భౌతికముగా మాత్రమే వాడినపుడు ప్రభావ మేమియు లేనట్లే ఉండును. వానినే సూక్ష్మీకరించి, ఉత్తేజపరచి ఎక్కువ పొటెన్సీలలో వాడినచో ఆశ్చర్యకరమైన ప్రభావమును చూపునని నిరూపితమైనది. కనుక మందులను ప్రయోగము చేయుటలో నొక చక్కని క్రమము పాటించవలెను. దుర్బలములవలె కనిపించు నౌషధములను 30-వ శతాంశపద్ధతి సూక్ష్మీకరణముచేసి దానితో చక్కెర

మాత్రలను తడిపి ప్రతిదినము పరగడుపున నాలుగుగాని, ఆరుగాని మాత్రలను కొంచెము నీటిలో తడిపి వరుసగా అనేకదినములు వాడుచుండవలెను. అపుడు వాని ప్రభావము కనిపించును.

**సూత్రము 129:** ఇట్లు చేయగా ఫలితములు స్వల్పముగా కనిపించినపుడు మాత్రల సంఖ్యను పెంచవలెను. అపు డారోగ్యమందలి మార్పులు బలవత్తరముగా కనిపించును. అందరును మందుల ప్రభావమును ఒకే విధమైన తీవ్రతతో పొందలేరు. వ్యక్తులలో అనేక కక్ష్యల తత్త్వములున్నవి. ఒక్కొక్కడు పైకి దుర్బలునివలె కనిపించువాడు తీవ్రతరముగా పనిచేయవలసిన ఔషధముచే ప్రభావితుడు కాకుండుటయు కనిపించుచున్నది. దుర్బలములగు కొన్ని ఔషధములు తీవ్ర ప్రభావము చూపుటయు కనిపించు చున్నది. చాల దృఢమైన శరీరతత్త్వము ఉన్నట్లు కనపడువారు సౌమ్యమైన ఔషధమునకే అనేక వ్యాధి వేదనలు పొందుచున్నారు. బలవత్తరములైన ఔషధములు పలుచ పలుచని వేదనలు పొందుటయు కలదు. ఇందలి భేదములు ప్రారంభమున తెలియవు గనుక ప్రతి వ్యక్తి యందును ఏ ఔషధమునైనను తక్కువ మోతాదులో ప్రారంభించి అవసరమునుబట్టి మోతాదును పెంచు కొనుచు పోవలెను.

వివరణము: తక్కువ మోతాదు అనగా తక్కువ పొటెన్సీ మరియు తక్కువ సంఖ్యగల మాత్రలు.

**సూత్రము 130:** ప్రారంభముననే మొదటి మోతాదు చాల తీవ్రముగ పనిచేయుట సంభవించినచో పరిశీలనము చాల సుకరమగును. అపుడు ప్రయోగము పొందినవాడు వేదనలను అవి పుట్టుచున్న క్రమమున నెప్పటివాని నపుడు వరుసలో వ్రాయవలెను. దేని తరువాత నెంత కాలమునకు మరియొక వేదన పుట్టినదో కూడ లిఖితము చేయవలెను. దీనివలన ఔషధము యొక్క నైపుణి తెలియుటకు చాల సౌకర్యము ఉండును. ఈ పద్ధతిలో వ్రాసినచో మందు కలిగించు ప్రాథమిక వేదనలను, తరువాత పరిణమించు వేదనా వికల్పమును చక్కగా గుర్తింపవచ్చును. పరిశోధకుడు చక్కని చురుకుతనము కలవాడై కలుగుచున్న అనుభవముల యెడల జాగరూకుడై యున్నచో పరిమితమైన మోతాదే మొత్తము ప్రయోగమునకు సరివడవచ్చును. అనేక ప్రయోగములను పోల్చి చూచినపుడుగాని ఒక మందు పనిచేయు కాలపరిమితి నిర్ణయించుట సాధ్యముకాదు.

**సూత్రము 131:** ఒకే వ్యక్తికి ఒకే ఔషధమును మోతాదును పెంచుచు అనేకమైన మోతాదులను వాడవలసిన సందర్భము కూడ కలుగును. అట్లు జరిగినచో

ఆ యౌషధము అనేక వ్యాధి లక్షణములను పుట్టింపగలదని సామాన్యముగా తెలియునేగాని దేని తరువాత దేనిని పుట్టించునను విషయము మాత్రము తేలదు. ముందు వాడిన మోతాదు యొక్క గుణములను తరువాత మోతాదు తొలగింపవచ్చును. లేదా దానికి వ్యతిరేకములైన లక్షణములను కూడ పుట్టించుట కలదు. ఈ తరగతిలో పుట్టిన వేదనలను వేరుగా కుండలీకరణము చేసి గుర్తుంచుకొనవలెను. అవి సందిగ్ధములని అర్థము. తరువాత మరియొకడు అదే ఔషధమును ప్రయోగము పొందినపుడు కలిగిన ఫలితములను బట్టి ఆ కుండలీకరణములోని వేదనలు ప్రాథమికములైన ఔషధ గుణములా లేక ప్రాణశక్తి చూపునట్టి ప్రతి క్రియా గుణములా గమనింపవలసి యుండును.

వివరణము: ఔషధము పుట్టించు గుణములైనచో వాని సారూప్యము చెందిన వ్యాధులు ఆ మందుతో నుపశమనము మాత్రమే పొందును గాని నివారణము కావు. అట్లుగాక ప్రతిక్రియ యందు పుట్టిన గుణములతో సామ్యము పొందిన వ్యాధులయినచో పూర్తిగా నివారణ యగును.

**సూత్రము 132:** ఒక యౌషధము పుట్టించు గుణముల వరుస క్రమములు గాని, వాని నడుమ గల కాల పరిమితిని

గాని గమనించుట గాక ఆ మందు యొక్క వేదనల మొత్తమును మాత్రమే గమనించుటకు పరిశోధన చేయుచున్నపుడు అవలంబింప వలసిన మార్గము వేరు. ఇట్టి ప్రయోగము ముఖ్యముగా దుర్బలములైన ఔషధముల విషయమున ఆవశ్యకము. ఇట్టి ప్రయోగములలో ప్రతిదినము మోతాదును పెంచుచు చాల దినములు వరుసగా నౌషధ ప్రయోగము చేయవలెను. దీనివలన నెంతో పలుచనైన స్వభావము గల ఔషధము విషయమున గూడ తెలియని వేదనా ప్రభావము చక్కగా ప్రకటితమగును. సున్నితమైన శరీరతత్త్వముగల వారిపై మరింత చక్కగా ప్రకటితమగును.

**సూత్రము 133:** ఒక వేదనను రూపొందించు కొనుచున్నపుడు దాని పరిస్ఫుటమైన స్వభావము తెలియునట్టి ప్రయత్నము చేయవలెను. కూర్చుండుట, నిలుచుండుట, పరుండుట, వంగుట మున్నగు వివిధ వైఖరులలో అదే వేదన ఎట్లనుభవింపబడునో తెలియవలెను. బాధపడుచున్న అవయవము కదలించినపుడు, గదిలో నడచినపుడు, ఆరుబయట నడచినపుడు మొదలగు మార్పులలో నెప్పుడు తగ్గునో, ఎప్పుడు హెచ్చునో, ఎప్పుడు మాయమగునో గమనింపవలెను. మొదట వేదన పుట్టిన స్థితిలో మరల కూర్చుండి, ఏమైన మార్పు కలిగెనేమో

మరల గమనింప వలెను. త్రాగినపుడు, తిన్నపుడు, మాట్లాడినపుడు, దగ్గినపుడు, తుమ్మినపుడు మొదలుగాగల వైఖరులలో నెట్లు పరిణామము చెందుచున్నదో చూడవలెను. పగలుగాని, రాత్రిగాని వేదన పుట్టుట ఏ వేళలలో జరుగునో చూడవలెను. దాని విస్పష్టమైన సంభావ్యతల నన్నిటిని పరిశీలింపవలెను. ఇట్లు ప్రతివేదనయు పుట్టుటయందు ప్రత్యేకింపబడు వైఖరి ఎట్టిదో తెలియవలెను.

వివరణము: ప్రత్యేకింపబడు వైఖరి యనగా రాత్రి హెచ్చుగా నుండును. పగలు తగ్గును. రాత్రి పండ్రెండు గంటలకు ఆకస్మికముగా వ్యక్తమగును. నొక్కుకున్నచో బాగుండును. చలిలోనికి పోయినచో నెక్కువగును మొదలగు వైఖరీ విభాగము చేయగలుగుట.

**సూత్రము 134:** బాహ్య కారణము లన్నియు నారోగ్యము నందేదో మార్పును కలిగించుచునే యుండును. ఆ కారణమునకు, ఆ మార్పునందు ఒక ప్రత్యేకత తప్పక యుండును. ఔషధము విషయమున నిది మిక్కిలి స్పష్టముగా నుండును. ఈ మాట నిజమే కాని ఒక ఔషధమునకు గల ప్రత్యేక ప్రభావములన్నియు నొకే వ్యక్తియందు కన్పింపవు. లేదా ఒకేమారు కనిపింపవు. అంతేగాక ఒకేమారు ప్రయోగము నందుగూడ కనిపించక పోవచ్చును. కొన్ని వేదనలు ఒక వ్యక్తిలో నొక తడవ

కనిపించును. రెండవ ప్రయోగమున మరికొన్ని, మూడవ ప్రయోగమున నింకను కొన్ని వ్యక్తమగును. ఇంకొక వ్యక్తియందు మరికొన్ని వ్యక్తమగును. నాలుగవ, ఎనిమిదవ, పదవ వ్యక్తులందు మరల కొన్ని ఒకే క్రమమున వ్యక్త ము కావచ్చును. అట్లే ఆరవ, తొమ్మిదవ వ్యక్తుల యందు నొకే క్రమమున వ్యక్తము కావచ్చును. అయినపుడు కూడ అదే గంటలో వ్యక్తము కాకపోవచ్చును.

**వివరణము:** ఔషధ లక్షణములు నిర్ణీతములే అయినను వ్యక్తుల తత్త్వములో మార్పు ఉండును. వానిని పట్టలేము గనుక అధిక సంఖ్యగల వ్యక్తుల పైన నొకే ఔషధము ననేక పర్యాయములుగా ప్రయోగించినపుడు తప్ప దాని సమగ్ర వేదనల వైఖరి తెలియుట కష్టము.

**సూత్రము 135:** అధిక సంఖ్యగల వ్యక్తులలో తగినవారిపై స్త్రీ పురుష విభేధముతో ప్రయోగము చేసిన తరువాతనేగాని ఒక మందు పుట్టించు వ్యాధుల యొక్క సూక్ష్మాంశములు బోధపడవు. ఆ ఔషదమును పై విధముగా వాడగా అవే వేదనల మొత్తము మరల మరల కనిపించుట, క్రొత్త వేదనల ప్రసక్తి లేకుండుట అను స్థితి కలుగును. అపుడుగాని ఆ మందు పుట్టించు వేదనా సముదాయము పరిపూర్ణముగా, నిశ్శేషముగా గుర్తింపబడినదని చెప్పుటకు వీలులేదు.

వివరణము: పుట్టుచున్న వేదనలలో క్రొత్త విశేషము పుట్టునంత వరకు నోపికతో ప్రయోగ పరిశీలనము చేయవలెను.

**సూత్రము 136:** అందరిలో అన్ని వేదనలను పుట్టింపక ఒక మందు కొందరిలో కొన్ని వేదనలనే పుట్టింప వచ్చునని తెలిసికొంటిమి, ఇది సత్యమే అయినను ప్రకృతిలోగల యొక మారని ధర్మము ననుసరించి మరియొక సత్యము తెలియుచున్నది. అదే ఔషధము వ్యాధి పీడితుని యందు సక్రమముగా ప్రయోగింపబడినపుడు ఆ వ్యాధి లక్షణములు సారూప్యములైనచో తనలోని సమస్త వేదనా ప్రభావములను ఆ మందు సంపూర్ణముగా వానియందు ప్రేరేపింప గలదు. అట్టి రోగియందు సారూప్యమును బట్టి ఎన్నుకొనబడుట వలన ఆ మందు నెంత చిన్న మోతాదులో ప్రయోగించినను వానిలో నున్న వ్యాధితో సారూప్యస్థితి గల వ్యాధిని కృత్రిమముగా పుట్టించి శీఘ్రముగా, సంపూర్ణముగా నివారణ చేయుట నిశ్శబ్దముగా జరుగును.

వివరణము: ఈ దిగువ సిద్ధాంతములు ఇందు పొందుపరుపబడి యున్నవి:

ఎ) ఆరోగ్యవంతుల శరీర తత్త్వములలో గూడ భేద ముండును. ఔషధ తత్త్వమున అట్టి భేదము ఉండదు.

బి) శరీర తత్త్వముల బేధము ననుసరించి ఔషధ గుణములు కొందరిలో కొన్ని, మరి కొందరిలో మరికొన్ని మాత్రమే వ్యక్తమగును.

సి) ఎక్కువమందిపై ఔషధమును ప్రయోగించుచు పోయినచో ఔషధ లక్షణములు మొత్తము వ్యక్తమగును. ఇక క్రొత్తవి వ్యక్తమగుట లేదని స్పష్టమగు వరకు ఈ ప్రయోగము చేయుచునే యుండవలెను.

డి) అటుపైన వారందరి యందును వ్యక్తమయిన వేదనలను దొరికిన క్రమములో క్రోడీకరింప వలెను.

ఇ) రోగియందలి వేదనలు వాని ఔషధము పుట్టించిన వేదనలతో సారూప్యము చెంది యుండును.

ఎఫ్) ఏ రోగియందును ఔషధ వేదనలు మొత్తము ఉండవు. ఉన్నవి మాత్రము సారూప్యము కలిగి ఉండును.

జి) ఆరోగ్యవంతుని యందువలె ఔషధము రోగి యందలి కొన్ని వేదనలనే ప్రేరేపణ చేయదు. తన వేదనల మొత్తమును ప్రేరేపణ చేయును. కనుక రోగులలో వ్యాధులు గెలువ లేని విధమున నొక కృత్రిమవ్యాధి స్వయం సంపూర్ణమై పుట్టుట సరియైన ఔషధ ప్రయోగము వలన జరుగును.

హెచ్) ఈ కారణమున వ్యాధి శీఘ్రముగా, నిశ్శేషముగా ఏ కల్లోలము లేకుండ నివారణ మగుట అనునది ఔషధ సారూప్యమే సిద్ధించిన తావులలో నిశ్చయముగా జరుగును.

ఐ) ఆరోగ్యవంతునిలో ఔషధము అన్ని వేదనలను పుట్టింప కుండుట, అనారోగ్యవంతునిలో పుట్టించుట అనునది ప్రకృతి పరిశీలనమున తెలియునట్టి ధర్మము.

**సూత్రము 137:** ప్రయోగము పొందుట కంగీకరించు వాడు సత్యప్రియుడు, సర్వ విషయములయందు పరిమితి కలవాడు, సుకుమారమైన అనుభవ గుణము (response) కలవాడు కావలెను. అతి సూక్ష్మమైన తన గ్రహణ శక్తిని తన యనుభవములపై ప్రసరింప చేయగలవాడు కావలెను. అతడు ఔషధమును పరిమితములైన మోతాదులలో సేవింప వలెను. అప్పుడే ప్రాథమికములైన ఔషధ ప్రభావములు వేరుగా గుర్తింపబడును. ఇవియే చాల ముఖ్యములు. వీనితో ప్రాణశక్తి యొక్క ప్రతీకార ప్రభావములు మిళితము కాకుండ కనుగొన వలెను. ఔషధము పరిమితిని మించి ఎక్కువ మోతాదులలో సేవించినచో అనేకములైన ప్రతీకార ప్రభావములతో బాటు ఔషధము యొక్క ప్రాథమిక ప్రభావములు కూడ

గుమికూడి కలసిపోవును. అట్టి కల్లోల స్థితిలో సరియైన గుర్తింపు సాధ్యము కాదు. ఆ స్థితి వారికి విపత్తు, ఒక విధమైన నష్టము కలిగించును. అంతేగాక ఔషధ గుణముల గుర్తింపు తారుమారగును. లన్నిటికన్న ముఖ్యము సాటి మానవుల యెడల ఫలితములను గూర్చి జాగరూకత కదా! ఇది మానవ సోదరత్వము కలవాడు భావింప వలెను.

**వివరణము:** ప్రయోగము చేయుటకు అంగీకరించువాడు ఎంతటి నీతిమంతుడైనను ఫలితములు నిర్ణయించు మార్గములో గూడ లోపము లుండరాదు. ప్రతి ఔషధము రెండు విధములైన ప్రభావములను పుట్టించు చున్నది.

ఎ) ఔషధ ప్రభావము లేక ప్రాథమిక ప్రభావము.

బి) ప్రాణశక్తి యందు ఔషధము ప్రేరేపించు ప్రతిక్రియా ప్రభావము లేక ద్వితీయ ప్రభావము. ఈ రెండును వేరు వేరుగా గుర్తింప బడుటయే ప్రయోగ పరిశీలనమున ముఖ్యము. ఈ గుర్తింపు పైననే అతడు నరజాతి కందించు మేలు, కీళ్లు ఆధారపడి యున్నవి.

ఆరోగ్యవంతుడు ఔషధమును పరిమిత పరిమాణమున వాడినపుడే ఈ రెండు విధములైన ప్రభావములను విడమరచి చూచుటకు వీలున్నది. మోతాదు లపరిమిత

ముగా వాడినపుడు ప్రాథమిక ప్రభావము ప్రతిక్రియా ప్రభావముతో గజిబిజిగా కలసిపోవును. అప్పటి ఫలితములు వ్యామిశ్రము లగును. దానివలన రెండు విధములైన నష్టము లున్నవి.

ఎ) ప్రయోగము చేయువాని దేహము, మనస్సు దెబ్బతినును.

బి) ఔషధ లక్షణముల గుర్తింపు దెబ్బతినును. దానితో అతడు సోదర మానవుల కందించు ప్రయోగ విజ్ఞానము వారికి హాని కలిగించును.

దీనివలన మరియొక ముఖ్యాంశము తెలియుచున్నది. వ్యాధిగ్రస్తునకు గూడ ఔషధము మోతాదులను అపరిమితముగా వాడినచో పై రెండు విధములైన వేదనలే గాక రోగి వేదనలు కూడ వానితో లుంగచుట్టుకుని పోవును. ఇక నివారణకు వీలుండదు.

**సూత్రము 138:** ప్రయోగము చేయు వానియందు పుట్టునట్టి వేదనలు, అతఃకితములైన ఆరోగ్య పరిణామములు ఔషధ లక్షణములే, ఔషధము వలన కలిగినవియే అనుట సత్యము. కనుక అన్నిటియందును సమానమైన శ్రద్ధాదరములు కలిగి గుర్తించి వ్రాయవలెను. ఔషధమును సేవింపకముందు చాల కాలము క్రిందట తనలో నున్న

కొన్ని లక్షణములు కూడ మరల వ్యక్తమయి నట్లనిపించును. అయినను అవి తనవిగా భావింపక ఔషధము ప్రేరేపించిన గుణములుగనే గుర్తించి వ్రాయవలెను. అవి అంతకుముందు తన తత్త్వము లోనివే అయినను ఔషధ ప్రభావము వలన ప్రేరేపింప బడినవనియే గుర్తింపవలెను.

వివరణము: ఔషధమును ప్రయోగమునకై సేవింపక ముందు ఒకడు తన పూర్వ జీవితమున కొన్ని లక్షణముల ననుభవించిన పరిచయముండ వచ్చును. ఔషధము సేవించిన తరువాత ఈ లక్షణములు గూడ మిగిలిన వానితో కలసి కనిపించ వచ్చును. అంతమాత్రమున అవి తన లక్షణములని భ్రమపడరాదు. ఔషధమునకు సంబంధించినవి కానిచో అవి వ్యక్తముకావు. కనుక వానిని గుర్తింపక విడువరాదు.

**సూత్రము 139:** వైద్యుడు తన దేహముపై గాక మరియొక ఆరోగ్యవంతునిపై కూడ ఔషధ ప్రయోగము చేయించవచ్చును. అట్టి సందర్భమున ఆ రెండవ వ్యక్తి తనలో కలిగిన మార్పులను, వాని కాలములను, కాలపరిమితిని, క్రమమును శ్రద్ధతో స్పష్టముగా వ్రాసి యుంచవలెను. ప్రయోగము పూర్తి అయిన వెంటనే అతనిని సమక్షము నందుంచుకొని వైద్యుడు అతని పట్టికను

పరిశీలించును. ప్రయోగము దీర్ఘకాలముగా అనేక దినములు పట్టినచో ఏనాటి కానాడు వానిని వైద్యుడు పరిశీలించుచుండుట మంచిది. తాను దేనిని గూర్చియైన ప్రశ్నించినచో అతడు వివరించుటకు జ్ఞప్తి యుండును. ఈ పరిశీలనము ననుసరించి తన పర్యవేక్షణము ఫలితముగా వైద్యుడు చిన్న చిన్న సవరణలు చేయవలసినచో చేసి ఫలితముల పట్టికను ధృవపరచును.

**సూత్రము 140:** ఆ రెండవ వ్యక్తి వ్రాయలేని వాడైనచో ఏనాటికి ఆనాడు జరిగిన విషయమును, దాని వైఖరిని వైద్యునకు తెలుపుచుండవలెను. ఇట్లు లిఖింపబడిన విషయమంతయు ఆ రెండవ వ్యక్తి స్వేచ్ఛగా చెప్పినదానిని యథాతథముగా లిఖించుటయే జరుగవలెను. వైద్యుడు ఊహించినదిగాని, ప్రశ్నించి ప్రేరేపించినది గాని కారాదు.

**సూత్రము 141:** ఎన్ని చెప్పినను ప్రయోగము వలన లభించిన ఫలితములును, వానితో నిర్మింపబడిన ఔషధ గుణములును వైద్యుడు తనపై ప్రయోగము జరిపినపుడు నిష్పక్షపాతము గను, జాగరూకముగను సిద్ధించును. తనయం దనుభవము కలిగిన వానిని గూర్చి తనకు మిక్కిలి నిశ్చిత జ్ఞానముండుట సహజము.

**సూత్రము 142:** ప్రయోగింపబడిన ఔషధము రోగిపై పనిచేయుచున్నపుడు ఔషధ ప్రభావమున గమనింపని వేదనలు కూడ కొన్ని నివారణ మగుచుండును. ఇది ముఖ్యముగా దీర్ఘవ్యాధుల వైద్యమున కనపడును. అట్టివానిని స్పష్టముగా గమనించిన వైద్యుడు ఆ లక్షణములను కూడ ఔషధ లక్షణములతో జోడించి స్థిరపరుప వచ్చును. ఈ కార్యభారము సిద్ధపురుషులైన వారికే చెల్లును.

**వివరణము:** ఆరోగ్యవంతులపై జరిగిన ప్రయోగ పరిశీలనము పూర్తియైన వెనుక ఔషధముయొక్క వేదనా సమాహారము స్థిరపడునుగదా! దాని ననుసరించి సారూప్యము చూచుకొని రోగులపై వైద్యుడు ప్రయోగము చేయును. అట్టి సందర్భములలో రోగియందు గల మరికొన్ని రోగ లక్షణములు కూడ సంపూర్ణ నివారణ పొందుట అనుభవమగు చుండును. ఆ లక్షణము లంతవరకు ఆ మందుయొక్క మెటీరియా మెడికాలో నుండవు. దానిని గమనించి వైద్యుడు తన యనుభవమును స్థిరపరచుకొని ఆ లక్షణములను కూడ ఔషధ ప్రభావ పరిధిలో స్థాపించ వచ్చును. స్థాపించి తన మెటీరియా మెడికా లోకమునకు ప్రకటింప వచ్చును. ఈ పనిని ప్రతి వైద్యుడును చేయరాదు. విద్యలో సిద్ధి పొందిన ఆచార్య పురుషులు మాత్రము

చేయవచ్చును. శాస్త్రమునందు నిరంతరమైన వాఙ్మయ తపస్సు, రోగుల యెడ శారీరక, మానసిక తపస్సు పూర్తిచేసి ప్రతిఫలాపేక్ష లేక భూతదయగల నిస్వార్థ సేవా పరాయణులు మాత్రము ఈ పని చేయగలరు. మిగిలినవారు అహంకరించి చేసినను చెల్లదు. దీనికి ఎవరికి వారే సాక్షి.

**సూత్రము 143:** పై చెప్పిన విధముగా ఆరోగ్యవంతులపై ప్రయోగించి వేదనలను పుట్టించి, సమన్వయపరచి, సమాహారము చేసి రోగ లక్షణములను నిర్మించి ఏ మందును ఎట్టి సారూప్యముగల రోగికి వాడవలెనో స్థాపింపవలెను. ఇట్లు స్థాపింపబడిన సూటియైన మందులనేకము లభ్యమైనపుడు వానిని నమ్మకముగా గుమిగూర్చినచో శారీర గుణపట్టిక (Materia Medica) నిర్మాణము పూర్తియగును. దానిని చక్కగా పరిచయము చేసికొనుట వలన సారూప్యౌషధ వైద్యమునకు తగిన ఆయుధములను సేకరించి నట్లగును. అప్పుడే సంపూర్ణ వ్యాధి నివారణకు సంసిద్ధత ఏర్పడును.

**సూత్రము 144:** ఇట్టి శారీర గుణపట్టికా గ్రంథమునందు ఊహాగానము, దబాయింపు లేకుండునట్లు నిర్దుష్టము చేయవలెను. అంగీకరించిన ప్రతి అక్షరము ప్రకృతిని ప్రశ్నించి తెలిసికొనిన ప్రకృతిమాత సంభాషణముగా నుండవలెను.

వివరణము: ద్రవ్యములు దేహ తత్త్వములపై ప్రభావమును చూపుట ప్రకృతి ధర్మమే గాని మానవుని యూహగాదు. అన్నము తిన్నచో ఆకలి తీరుట ప్రకృతినుండి నేర్చుకొనిన పాఠమేగాని మానవుడు ప్రదర్శించిన పాండిత్యము కాదు. అట్లే ప్రయోగము వలన గ్రహించిన ఔషధ ప్రభావ మంతయు మానవుడు చూచి నేర్చినదిగనే యుండవలెను గాని ఊహించి సాధించిన భాగమొక్క అక్షరము కూడ పనికిరాదు.

**సూత్రము 145:** ప్రయోగము చేసి ఔషధ గుణములను స్థాపించిన ఔషధముల సంఖ్య ఎంత ఎక్కువైనచో అంత రోగనివారణకు వీలున్నది. నైసర్గిక వ్యాధులలో నొక్కొక్క దానికి సారూప్యము చెందిన ఔషధ మొక్కొక్కటి లభింప వలెను గదా! ఇట్టి ఔషధములు సిద్ధించినప్పుడే ఆరోగ్యస్థాపనము శీఘ్రముగను, సౌమ్యముగను, పరిపూర్ణముగను, క్షేమకరముగను,నిశ్చితముగను జరుగును. అప్పుడే విపత్కరమైన అలోపతి విధానమును పరిహరింప వచ్చును. ఆ విధానము రోగములను క్లిష్టతరములుగా చేసి వ్యక్తిని కొన్ని దీర్ఘవ్యాధులపాలు చేయును. నరజాతి అనుభవమునుండి వ్యాధుల కర్మ ఫలితమును తొలగించుటకు దానివలన సాధ్యపడదు.

## చికిత్సా విజ్ఞానము

**సూత్రము 146:** పై చెప్పిన విధమున ఔషధ విజ్ఞానము నార్జించిన తరువాత సారూప్య విధానము ననుసరించి ఆ ఔషధములను వ్యాధిగ్రస్తులయందు ప్రయోగించి నివారించుటకు కావలసిన నైపుణ్యము నార్జించుకొనుట వైద్యవరుని మూడవ కర్తవ్యము.

**సూత్రము 147:** రోగియందు గమనింపబడిన వేదనా సముదాయములో సారూప్యము ఏ ఔషధ లక్షణముల యందు ఎక్కువ యుండునో అది ఆ రోగికి ప్రత్యేకింప బడిన నివారణౌషధముగా గ్రహింపవలెను.

వివరణము: ప్రతి రోగియందును గల వేదనలలో కొన్నిటితో సామ్యమున్న ఔషధము లనేకములు మెటీరియా మెడికాలో కనిపించును. అట్టి వానియం దేది మిక్కిలి సామ్యము గలిగిన ఔషధమో గమనించి దానినే ఆ రోగికి కావలసిన ప్రత్యేకౌషధముగా నిర్ణయింపవలెను.

**సూత్రము 148:** రోగియందున్న నైసర్గిక వ్యాధి రోగి శరీరము లోపలనో, చర్మముపైననో నిర్దేశింపదగినట్లు ఒక స్థానము నాక్రమించుకొని యుండునని భావింపరాదు.

రోగికి వ్యతిరేక రూపము ధరించిన చేతనా స్వరూపమగు స్వభావముగా మాత్రమే రోగులను గుర్తింపవలెను. అది యతనికి సంక్రమించిన చైతన్య వికారమనియు, అతని స్వాభావికమైన చేతనా స్వరూపమగు ప్రాణప్రవృత్తిని చెదరగొట్టున దనియు తెలియవలెను. అది దేహ తత్త్వమునకు సంక్రమించును. ఒక దుష్టభూతమువలె పీడించునట్టి లక్షణము కల్గియుండును. అది సంక్రమించి ప్రాణ సాధారణ ప్రవృత్తియందు చెదరుబాటు బాధా స్థితులను కలిగించును. ఈ బాధా స్థితులే వ్యాధి వేదనలు. వానిని కలిగించుటయే గాక దేహమునందు స్థానము గొనునట్లు చేయు కారణమే వ్యాధి. వైద్యుడొక కృత్రిమవ్యాధి శక్తిని పుట్టించినపుడే దానిని తొలగించుటకు వీలగును. ఈ కృత్రిమ వ్యాధికూడ నైసర్గిక వ్యాధిని పోలిన విధమైన చెదరుబాటును కలిగించునదై యుండవలెను. ఏ చిన్న మోతాదుతో నీ వ్యాధి శక్తిని పుట్టించినను అది నైసర్గిక వ్యాధి కన్న కొంచెము హెచ్చయిన శక్తి కలిగి యుండవలెను. అది పనిచేయుచున్నపుడు నైసర్గిక వ్యాధి శక్తి దానిలో నంతర్భాగమై యిమిడిపోవలెను. అప్పుడది యిక ప్రాణశక్తిని బాధింపలేని విధమున విధ్వంసము చేయబడును. సారూప్యము చెందిన యౌషధము నిట్లు తగిన విధముగా ప్రయోగించినపుడు నైసర్గిక వ్యాధి దానిచే తిరస్కరింప

బడును.

దేహమునం దంతకు ముందున్న వ్యాధి దీర్ఘవ్యాధి యైనచో దానికి సరిపడిన యౌషధమును చాల హెచ్చుగు పొటెన్సీలో నెక్కువ మోతాదులను వాడినచో శమించును. అపు డారోగ్యము చేకూరుట గుంభనగా త్వరత్వరగా జరుగును. అపుడు ప్రాణమయకోశము శరీరతత్త్వమును వెనుకటి విధముగా చక్కబరచి దృఢత్వము చేకూర్చును.

**సూత్రము 149:** దీర్ఘకాలిక వ్యాధులు (అందును క్లేశపరుప బడినవి) నయమగుటకు మిగిలిన వానికన్న నెక్కువ కాలము పట్టును. అందును అలోపతి వైద్య విధానమునందు నివారింపబడక మందులచే తారుమారు చేయబడిన వ్యాధులు మరియు నెక్కువ కాలము పట్టును. చిరకాలము పెద్ద పెద్ద మోతాదులతో తీవ్రమైన మందులు వాడబడిన సందర్భములలో పరిణామములు రోగియందలి సత్తువను హరించి లజ్జాకరమైన పరిస్థితిని కలిగించును. ఈ మందులు వివేక శూన్యమైన వ్యర్థ సిద్ధాంతముల ననుసరించి వాడబడును. ఒకే వ్యాధులవలె కనిపించుచున్న వివిధ సందర్భములలో ఈ మందులను వాడుట జరుగును. అంతేగాక మందు పదార్థములు నీటిలో కలిపి చేయించిన స్నానములు కూడ ఈ వైద్య విధానము నందున్నవి. ఉన్న అనర్థకముల కవిగూడ తోడ్పడును.

వివరణము: అలోపతి విధానమున ఆరోగ్య వంతునిపై ప్రయోగించి కనుగొనబడిన ఫలితముల ప్రకారము మందులు వాడుట యుండదు. ఇక ఊహింపబడిన పద్ధతులలో వాడబడును. మందులే గాక మందులు కలిపిన నీటితో స్నానాదికములు కూడ ఉండును. ఈ మొత్తము దేహముపై అక్రమముగా పనిచేసి వ్యాధిని ముమ్మరము చేయును. అట్టివానిని నివారించుట హోమియో సిద్ధాంత ప్రకారము గూడ దుష్కరమగును.

**సూత్రము 150:** రోగి ఒకటి రెండు చిల్లర బాధలను మాత్రమే కల్గియున్నపుడు, అవి అంతకు ముందెక్కువ కాలమునుండి బాధించు చున్నవి కానపుడు అదియొక ముదిరిన రోగముగా భావింపరాదు. దానికి హెచ్చుగా వైద్యక్రియ అవసర మనియు భావింపరాదు. ఆహారాదులలో చిన్న మార్పులు చేసి రోగికి విశ్రాంతి నిచ్చినచో అవియే తగ్గిపోవును.

**సూత్రము 151:** అట్లుగాక రోగి కొన్ని తీవ్ర వేదనలను తెలియ చేసినచో నవి అల్పసంఖ్యలో నున్నను రోగిని తిన్నగా పరిశీలింప వలెను. పరిశీలింపగా రోగి చెప్పిన వేదనలతోపాటు మరి కొన్ని వేదనలున్నట్లు తెలియును. అవి చిన్నవియే కావచ్చును. వానిని కూడ కలిపి చూచినచో మొత్తము వ్యాధి లక్షణము సంపూర్ణముగా తెలియును.

**సూత్రము 152:** ఒక తరుణవ్యాధి ఎంత తీవ్రముగా కనిపించి, ఎన్ని ఎక్కువ తీవ్ర వేదనలతో కూడి యుండునో అంత సులభముగా దానికి తగిన ఔషధమును కనుగొన వచ్చును. ఇట్టి సందర్భమున వైద్యున కెన్ని మందులతో పరిచయముండునో అంత సులభముగా మందు నిర్ణయమగును. అనేకములయిన ఔషధముల వ్యాధి పట్టికలలో నొకదానిని ఆరోగ్యమునకు తగినట్లు ఎన్నుకొనుట, దాని వేదనా సముదాయమునకు సరిపోల్చుట ఎక్కువ కష్టము కాదు.

వివరణము: ఔషధముల పట్టికలలో నొక్కొక్క దానికి అనేక వేదన లుండును గనుక తీవ్ర వేదనలతో కూడిన తరుణ వ్యాధులకు తగిన మందును నిర్ణయించుట తేలిక.

**సూత్రము 153:** ఇట్లు ఔషధముల పట్టికకును, రోగియందలి వేదనలకును సరిపోల్చి చూచు సందర్భమున నెక్కువ ప్రత్యేకత గలవి, ఎక్కువ విలక్షణత్వము గలవి, అరుదైన లక్షణములు గలవి అగు వేదనలకు ప్రాధాన్య మీయవలెనని మరచిపోరాదు. పోలికలు ప్రత్యేక వేదనలలో సిద్ధించును గాని సర్వ సామాన్యమైన వేదనలలో సిద్ధించుట స్పష్టమైన పోలిక అనుపించుకొనదు. ఆకలి లేకుండ తలనొప్పి, నీరసము, ప్రశాంతము కాని నిద్ర, అసౌకర్యము

మున్నగు వేదనలు సర్వ సామాన్యములు, అస్పష్టములు, వానిని గూర్చి ఎక్కువ పట్టించుకొనరాదు. అట్టివి ప్రత్యేక లక్షణములు లేని విధమున అందరు రోగులలోను కనిపించును. అన్ని మందుల పట్టికలలోను కనిపించును.

వివరణము: తలనొప్పికి మందు కావలెననని యడిగినపుడు హోమియోపతీ విధానమున సాధ్యము కాదు. కారణ మేమనగా రోగి తలనొప్పికి సామ్యము ఔషధ పట్టికలోని తలనొప్పియను లక్షణము కాదు. కొన్నివేల రోగులకు తలనొప్పి యుండును. కొన్ని వేల మందులు తలనొప్పి పుట్టించును. అం దేయొక్కని తలనొప్పికిని, ఏ యొక్క మందునకును సామ్యము కుదుర్చుట కాధారము లేదు. అట్లుగాక ఎడమ కణతయందు తలనొప్పియని తెలిసినచో నొక ప్రత్యేకత తెలియును. దానితో వికారము కూడ నున్నట్లు తెలిసినచో మరికొంత ప్రత్యేకింప బడును. ఆ తలనొప్పి ఉదయమున ప్రారంభమై మధ్యాహ్నము వరకు పెరుగునని తెలిసినచో మరికొంత ప్రత్యేకింప బడును. ఇన్ని ప్రత్యేకతలతో గూడిన తలనొప్పి ఔషధ పట్టికలో నొకే ఔషధమున కుండును. అది నేట్రమ్ మూర్. ఆ రోగికి నేట్రమ్ మూర్ వాడుట వలన తగ్గునని ప్రత్యేకించి తెలియును. ఈ విధముగా వేదనలను గమనించుటలో ప్రాముఖ్యము తలనొప్పి మున్నగువానికి చూపక మిగిలిన

ప్రత్యేకతలకు చూపవలెను.

**సూత్రము 154:** రోగి వేదనలను గూర్చి పరిశీలించి నపుడు ఇట్లితర రోగులనుండి ప్రత్యేకించి వేరుచేయగల వేదనలకే ఎక్కువ ప్రాధాన్యము చూపవలెను. అట్టి వేదనలతో ఔషధ పట్టికలోని వేదనలు అధిక సంఖ్యలో సరిపోయినపుడు ఆ రోగికి తగిన యౌషధ మదియే అని తెలియును. సామాన్యముగా అట్టి ఔషధము మొదటి మోతాదులోనే ఏ కల్లోలము లేక రోగి రోగము నివారణమగును.

వివరణము: రోగి యందలి రోగ లక్షణములతో సామ్యముగల ఔషధమును ఎన్నుకొనునపుడే యీ విషయమున నిపుణత చూపవలెను. తలనొప్పి, పంటినొప్పి మొదలగు సామాన్య వేదనలు ఎన్ని కనిపించినను వానిని ఏ ఔషధముతోను సామ్యమునందు ప్రత్యేకత సిద్ధింపదు. కనుక చలిగాలికి ఉపశమనము గలుగుట, నొక్కికొన్నచో నొప్పి తగ్గినట్లుండుట మున్నగు ప్రత్యేక వేదనలను (Distinguishing symptoms) ముఖ్యముగా భావించి రోగియందు వానికొరకు ప్రత్యేక పరిశీలనము చేసి వానిని వేరుగా, గుర్తింపుగా వ్రాసికొనవలెను. మెటీరియా మెడికాలో ఔషధము చూచుకొనునప్పుడు ఈ ప్రత్యేక వేదనల సారూప్యము కొరకే ఎక్కువగా పరిశీలింప వలెను. అట్టి

సారూప్యము సిద్ధించినప్పుడు ఇక తలనొప్పి, జ్వరవ
మున్నగు వేదనలు సారూప్యము పొందినవా లేదా య
లెక్క చేయరాదు. వీనితో సారూప్యము ఎల్లప్పుడున
లభింపదు. ప్రత్యేక వేదనలతో సారూప్యము సిద్ధించి
మందు తప్పక శీఘ్రముగా నివారణ చేయును. తరుణ
వ్యాధు లయినచో కొద్ది మోతాదులతో శీఘ్రముగా నివారణ
పొందును. అంతకు ముందు ఏ మందులు వాడకుండ
వచ్చినచో ఒకే మోతాదుతో తరుణ వ్యాధి మొత్తమ
నివారణ మగును. ఈ నివారణ కూడ ఎక్కువ అలజడి
జరుగకుండ కలుగును.

**సూత్రము 155:** ఎక్కువ అలజడి జరుగకుండ నివారణ
యగునని చెప్పుటలో నొక కారణ మున్నది. ఔషధమందలి
లక్షణములైన వేదన లన్నిటిలో రోగియందు కొన్నియే
యుండును. మిగిలినవి రోగికి సంబంధించినవి కావు
అయినను సంబంధించినంత వరకే ఔషధము పని
చేయును. ఏ వేదనలు రోగియందు ప్రేరేపణ
చెందియున్నవో వానికి సంబంధించినంత వరకే ఔషధము
బలవత్తరముగా పనిచేయును. ప్రయోగించిన మోతాదులో
మందు పరిమాణము చాల తక్కువ గనుక మిగిలిన
వేదనలను రోగియందు పుట్టించుటకు చాల తక్కువ
యవకాశము ఉండును.

**సూత్రము 156:** ప్రకృతినుండి మన కింత సామగ్రి సిద్ధించినను మన మింతవరకు కనుగొనిన ఔషధముల సంఖ్య పరిమితమే గదా! జబ్బుల సంఖ్య అపరిమితము. ఈ కారణముచే పరిపూర్ణమైన, ఆదర్శమైన సామ్యము సిద్ధించుట అరుదు. అరుదే కాదు, దుర్లభమని కూడ చెప్పవచ్చును. ఏ రోగి విషయముననను రోగ లక్షణములకు, ఔషధ లక్షణములకు సిద్ధించునట్టి సామ్యము రెండు సమబాహు, సమకోణ త్రిభుజములకువలె సిద్ధించుట కల్ల. అట్టి సందర్భమున సిద్ధించినంత వరకు సామ్యము నాధారముగా గొని ఔషధము పనిచేసి వ్యాధిని నిర్మూలనము సంపూర్ణముగా చేయుననుట సత్యము. ఎక్కువ సామ్యమున్నపుడు కొన్ని వేదనలలో సామ్యము లేని ఔషధమును ఒక్కొక్కపుడు పొరపాటుగా నిర్ణయము జరిగినను హాని కలుగదు.

వివరణము: రోగి లక్షణములతో సామ్యము గల ఔషధమును నిర్ణయించుటకు శక్తివంచన చేయక ప్రయత్నింప వలెను. ఒక్కొక్కపుడు క్రొత్త రోగములు పుట్టినపుడు పాత మందులతో సంపూర్ణ సామ్యముగల ఔషధము సిద్ధింపక పోవచ్చును. అపుడు కొన్ని వేదనలతో సామ్యము లేకుండ మందు నిర్ణయించినను పొరపాటు జరగక వ్యాధి నివారణము జరుగును. ఆ సామ్యము లేని

వేదనల విషయమున రోగికి హాని కలుగదు. కారణమేమనగా ఔషధ పరిమాణము చాల స్వల్పము కనుక, అలోపతి విధానమునందు వలె ఔషధము పరిమాణము హెచ్చుగా వాడినచో తప్పక హాని కలుగును అనగా ఔషధమునకు సంబంధించిన క్రొత్త రోగములు పుట్టును.

స్వల్పమైన పరిమాణమున గూడ అక్కరలేనన్ని మోతాదులు వాడినచో ఔషధ వ్యాధులు పుట్టును. పైపెచ్చు అలోపతిలో పుట్టినవానికన్న తీవ్రమైన వ్యాధులు నివారణకు లొంగని విధమున పుట్టును. కారణ మేమనగా, హోమియోపతీ మోతాదులు ప్రాణమయ, మనోమయ కోశములలో పుట్టించును గనుక ఆ వ్యాధులు తగ్గక పోవచ్చును. అలోపతి విధానమున మందు భౌతిక పరిమాణమున వాడబడును గనుక భౌతిక దేహము దెబ్బతినును. వానిని విరుగుడు చేయుట కూడ తేలిక. సంవత్సరముల తరబడి అక్కరలేని మందులు వాడుచున్నచో భౌతిక పరిమాణము వలన కూడ నయముకాని దీర్ఘవ్యాధులు పుట్టును. హోమియోపతీ పద్ధతిలో సూక్ష్మీకరించి వాడినపుడు అవసరమున్నంత వరకే వాడుట నేర్చుకొన్నచో కొంత సామ్యములేని మందులు కూడ ఏ హానియు కలిగింపక తమకు సంబంధించినంత

వ్యాధి నివారణ చేయును.

**సూత్రము 157:** సామ్యముగల మందు రోగిలోని రోగ లక్షణములకు సంబంధించినంత వరకే పని చేయునని చెప్పి యుంటిమి. మిగిలిన వేదనలతో సంబంధం లేదని కూడ చెప్పియుంటిమి. అయినను ఒక్కొక్కపుడు తరుణవ్యాధి యందు వాడబడినపుడు ఉన్న లక్షణములలో నొకటి రెండింటిని తాత్కాలికముగా, స్వల్పముగా ఉద్రిక్తపరచుట గమనికకు వచ్చుచున్నది. దీనికి కారణ మేమనగా రోగబలము కన్న కొంచెము హెచ్చు బలముతో పని చేయునట్లు ఔషధ ప్రయోగము చేయవలెనని చెప్పియుంటిమి గదా! అట్లు చేయబడినపుడు పుట్టిన కృత్రిమ, తాత్కాలిక వ్యాధి కొంచెము ఎక్కువ బలముతో పుట్టును. అది పని చేయు చున్నపుడు ఒకటి రెండు గంటలు దాని లక్షణములు కనిపించును. అవి రోగి లక్షణములతో సరిపోలియుండును గనుక తన వ్యాధియే ఉద్రేకించెనని రోగి అభిప్రాయపడును. (ఔషధము పరిమాణము కొంచెము హెచ్చుగా నున్నపుడు, అనగా పొటెన్సీ కావలసిన దానికన్న తక్కువగా వాడబడినపుడు ఇది తప్పక కొంచె మెక్కువ సేపు కనిపించును.)

**సూత్రము 158:** ఈ విధమైన తాత్కాలిక ఉద్రిక్త

పరిస్థితిని సారూప్యోద్రేకము (Homoeopathic Aggravation) గా గుర్తింప వలెను. తరుణ వ్యాధుల చికిత్సలో ప్రారంభమందు కొన్ని గంటలలో ఇది కనిపించుట శుభ సూచకము. ఆ మొదటి మోతాదుతోనే వ్యాధి లొంగిపోవునని ఇది సూచించును. ఉన్న వ్యాధికన్న సారూప్య వ్యాధి బలవత్తరముగా పుట్టినట్లు తెలియుచున్నది. నివారణము తప్పనిసరి అని తెలియుచున్నది.

**సూత్రము 159:** తరుణ వ్యాధుల చికిత్సలో ఔషధ పరిమాణము ఎంత తక్కువగా వాడబడినచో అంత సరళముగను, శీఘ్రముగను వైద్య ప్రారంభ దశయందే ఈ సారూప్యోద్రేకము ఉపశమించును.

వివరణము: ఔషధ పరిమాణము తక్కువగా వాడుట అనగా పొటెన్సీ పెంచుట యని అర్థము. ఔషధమును ఎక్కువ వాడుట అనగా కావలసిన దానికన్న తక్కువ పొటెన్సీలో వాడుట జరుగును. కనుక సారూప్యోద్రేకము కొంచెము హెచ్చగును. ఎక్కువ కాలముగను కనిపించును. కనుకనే ఏ మందునైన తరుణవ్యాధులలో 30 పొటెన్సీకి తక్కువ వాడవద్దని కెంటు తన ప్రకీర్ణ రచనలో (Lesser writings) ప్రసంగించి యున్నాడు.

**సూత్రము 160:** ఇట్టి తరుణ వ్యాధులలో మొట్ట

మొదటనే మోతాదును అధికముగా తగ్గించి వాడుట యుండదు. ఉన్న వ్యాధికన్న బలవత్తరమైన సారూప్య వ్యాధిని పుట్టించవలె నన్నచో మందును అర్థము లేనంతగా పరిమాణము తగ్గించరాదు. తగుమాత్రము పరిమాణములో నుంచినచో బలవత్తరమైన తాత్కాలిక వ్యాధిని పుట్టించును. అపుడు ప్రారంభ దశలో సారూప్యో ద్రేకము కనిపించును.

వివరణము: జ్వరము, తలనొప్పి, కలరా మున్నగు వ్యాధులలో మందు పరిమాణము విపరీతముగ తగ్గించరాదు. అనగా 10M, 50M పొటెన్సీలలో వాడరాదు. వాడినచో కావలసిన బలముతో వ్యాధిని పుట్టించుట జరుగదు. 30, 200 మొదలగు పొటెన్సీలలోనే వాడవలెను. అప్పుడు ఔషధ పరిమాణము సరిపోయి మొదటి మోతాదు ఇచ్చిన వెంటనే సారూప్యోద్రేకము కనిపించును.

**సూత్రము 161:** ఇట్టి సందర్భములలో సారూప్యోద్రేకము అనగా ఔషధము యొక్క ప్రాథమిక ప్రభావము. ఇది ఔషధ గుణమేగాని ప్రాణశక్తి యొక్క ప్రతీకారము కాదు. ఇట్టిది తరుణ వ్యాధులలో, అందును క్రొత్తగా పుట్టి ఇతర వైద్యములచే తికమకలు పడని వ్యాధులలో, మాత్రమే కనిపించును. ఇక చాలా కాలమునుండి బాధపడుచున్న వ్యాధుల విషయమున మొదటి మోతాదునకు ఈ

సారూప్యోద్రేకము కనిపించదు. అనగా పొటెన్సీ చాల లేదని అర్థము. అపుడు మోతాదులను క్రమముగా తగ్గించుచు వాడవలెను. అనగా పొటెన్సీ క్రమముగా పెంచుచు వాడవలెను. దీర్ఘవ్యాధులలో నిట్లు మోతాదులను తగ్గించుచు వాడగా చివరకు సారూప్యోద్రేకము కనిపించును. అది తరుణవ్యాధులయందు వలె ప్రారంభదశలో కనిపించక నివారణము పూర్తి కాబోవు సమయమున కనిపించును.

**సూత్రము 162:** ప్రయోగ పరిశీలనచేసి ఔషధ విజ్ఞానము స్థిరపడిన మందుల సంఖ్య ఇంకను పరిమితమే గనుక ఒక్కొక్కపుడు రోగి యందలి వ్యాధి మొత్తమునకు సారూప్యము చెందిన మందు లభింపక పోవచ్చును. అప్పుడు అసంపూర్ణముగా సారూప్యము చెందిన మందునే వాడవచ్చును.

**సూత్రము 163:** అట్లు వాడినపుడు నివారణము సంపూర్ణముగను, క్లేశము లేకుండగను జరుగునవి ఆశింపరాదు. అట్టి మందును వాడినపుడు కొన్ని నూతన వేదనలు రోగిలో అంతకు ముందు లేనివి తాత్కాలికముగా కనిపించ వచ్చును. ఇవి రోగికి సంబంధించనివి, ఔషధమునకు సంబంధించినవి అయి ఉండును. దీనివలన ఉన్న వ్యాధిలో చాల భాగము నివారణమగుట కెట్టి

అభ్యంతరము లేదు. నివారణకు చక్కని ప్రారంభము జరుగును, అపుడు గూడ క్రొత్త వేదనలు కనిపించి కొంత తికమక పుట్టును. అవి రోగి వేదనలతో సారూప్యము చెందని ఔషధ వేదనలు, వానికి భయపడనక్కర లేదు. ఔషధ పరిమాణము తగ్గించినచో (అనగా పొటెన్సీ పెంచినచో) అవి పలుచ పలుచగా వచ్చి దాటిపోవును.

**సూత్రము 164:** సారూప్యము చెందిన వేదనలు ఏ స్వల్ప సంఖ్యలో నున్నను అవన్నియు ప్రత్యేక వేదనల జాతికి చెందిన వైనచో సారూప్యము చెందని మిగిలిన సామాన్య వేదనలను గూర్చి పట్టించుకొన నక్కర లేదు. వాని ప్రసక్తి లేకయే, క్లేశము కలుగకయే నివారణము పూర్తిగా జరుగును.

**సూత్రము 165:** రోగి వేదనలతో కనిపించు ప్రత్యేక వేదనలతో సారూప్యము చెందిన ఔషధము లభింపక, లభించిన ఔషధము ఆ మొత్తము రోగమునకు సామాన్య వైఖరిలో సరిపోయినచో, అనగా వికారము, నీరసము, తలనొప్పి మొదలగు అస్పష్ట వేదనలతో మాత్రమే సరిపోయినచో, అంతకన్న సారూప్యము గల మందు లభింపనపుడు దానినే వాడవచ్చును గాని శీఘ్రముగా అనుకూల ఫలితము కలుగునని మాత్రము ఆశింపరాదు.

**సూత్రము 166:** ఔషధ విజ్ఞానమును స్థిరపరచిన

మందుల సంఖ్య పెరిగిన కొలదియు నిట్టి ఇబ్బందులు అరుదగును. అయినను అట్టి సందర్భమున గూడ దుష్పరిణామము లుండునని భయపడ నక్కర లేదు. దాని తరువాత వాడబడు మందు ఆ మిగిలిన వేదనలతో సారూప్యము నెక్కువ కలిగియున్నచో అది అంతకు ముందు కలుగు పరిణామములను పరిహరించును.

**సూత్రములు 167, 168:** తరుణ వ్యాధులలో నిట్టి అసంపూర్ణ సారూప్యము గల మందును వాడినపుడు కొన్ని అపూర్వ వేదనలు కనిపించినచో ఆ మందు పనిచేయు కాల పరిమితిని తగ్గింప వచ్చును. అనగా లభించిన సారూప్యముతో కొన్ని వేదనలు మాయమైనంతనే మిగిలిన వానితో వేదనా సముదాయమును కూర్చుకొని దానికి సారూప్యమైన మరియొక మందును వెంటనే వాడుటచే ఖండింప వచ్చును. ఈ రెండవ మందు కూడ పూర్తిగా నివారణము చేయగలుగు సారూప్యము లేనిది అయినను దాని నివారణము పూర్తి అయిన వెనుక చివరకు మిగిలిన వేదనల సారూప్యముతో మూడవ మందును వాడి నివారణము పూర్తిచేయవచ్చును.

**సూత్రము 169:** మొట్ట మొదటగా రోగిని పరీక్షించినపుడు వాని వేదనా సముదాయము మొత్తమునకు సరిపోయిన మందు లభింపకపోవుట సంభవమని చెప్పి యుంటిమికదా!

అందు కొన్ని వేదనల కొక మందు, మరికొన్ని వేదనలకు రెండవ మందు సరిపోయిన దనుకొనుము. వానిని ఒకదాని తరువాత నొకటిగా వాడరాదు. రెండిటిని కలిపి అసలే వాడరాదు. రెండిటిలో నెక్కువ సారూప్యమున్న మందును మొదట వాడవలెను. దాని నివారణ పూర్తి అయిన వెనుక మిగిలిన వేదనలను మరల కూర్పు చేయవలెను. అప్పుడు దానికి సరిపోయిన మందునే వాడవలెను గాని మొదట నిర్ణయించిన రెండవ మందును వాడరాదు.

**సూత్రము 170:** పై చెప్పిన విధానములో రెండు మందుల యందు కొంత కొంత సారూప్యము సిద్ధించినపుడు మొదట మందుతో వైద్యము పూర్తి అయిన వెనుక మరల మిగిలిన వేదనా సముదాయమును కూర్పు చేయవలెనని చెప్పితిమి గదా! అప్పుడు గూడ ఆ రెండవ మందుతో సారూప్యము సిద్ధించిన యెడల దానినే వాడవలెను.

వివరణము: కొంత కొంత సారూప్యము కనిపించిన రెండు మందులను మనస్సున నిర్ణయించు కొన్నపుడు రెండవ మందును ప్రారంభ మందలి సారూప్యముతో నిశ్చయము చేయరాదు. మొదటి మందుతో జరుగవలసిన వైద్యమును మొదట పూర్తి చేయవలెను. అపుడు మరల వేదనా సముదాయము నిర్మించి పరిశీలింప వలెను. ఆ పరిశీలనకు రెండవ మందు నిలచినచో వాడవలెను. లేనిచో మరియొక మందును స్వీకరింపవలెను.

# దీర్ఘవ్యాధుల చికిత్స

**సూత్రము 171 :** సుఖవ్యాధుల సంబంధము లేని దీర్ఘ వ్యాధులు సామాన్యముగా సోరాకు సంబంధించి యుండును. అట్టి వ్యాధుల చికిత్స జరుగునపుడు సోరాను ప్రతిఘటించగల ప్రత్యేకౌషధముల పరిధిలోనుండి కొన్నిటిని నిర్ణయించుకొని పై చెప్పిన విధముననే ఒకదాని తరువాత నొకటి వాడవలసి యుండును. అందు ప్రథమస్థానము పొందిన మందుతో చికిత్స పూర్తి అయిన వెనుక రెండవ దానిని నిర్ణయించి, దాని చికిత్స పూర్తి అయిన వెనుక మూడవదానిని, ఈ విధముగా నివారణము పూర్తి యగువరకు వాడుచుండవలెను.

**సూత్రము 172:** ఒక రోగికి వ్యాధి వేదనలు చాలా తక్కువగా నున్నపుడు అతి సూక్ష్మ పరిశీలనము చేయవలెను. ఆ మొత్తమునకు నిర్ణయింపబడిన మందుతో క్లేశము లన్నియు తొలగిపోవును (పూర్తిగా సారూప్యము చెందిన మందు లభింపనపుడు మాత్ర మిట్లు సాధ్యపడదు)

**సూత్రము 173:** వేదనలను అతి స్వల్ప సంఖ్యలో

గలిగిన వ్యాధులు నివారణకు లొంగుట కవకాశము తక్కువ. అవి పాక్షిక వ్యాధులు. అందొకటి రెండు వేదనలు ప్రాధాన్యము వహించి మిగిలిన వానిని కబళించి వేయును. ఇట్టివి దీర్ఘ వ్యాధుల యందు కనిపించును.

**సూత్రము 174:** వాని ప్రధాన వేదనలలో నొకటి దేహతత్త్వము లోపల స్థాపించుకొని యుండవచ్చును. (చాల సంవత్సరముల నుండి వేధించుచున్న తలనొప్పి కావచ్చును, లేదా విరేచనముల జబ్బు కావచ్చును, లేదా ఎప్పటి నుండియో పట్టి పీడించుచున్న గుండె జబ్బు కావచ్చును, లేదా బాహ్య శరీరమునకు సంబంధించిన బాధ-యైనను కావచ్చును.) ఇట్టి వానిని ప్రాంతీయములైన చిల్లర వ్యాధులుగా గుర్తించుట పరిపాటియై యున్నది.

వివరణము: బాహ్య తత్త్వమునకు సంబంధించిన వ్యాధి యనగా తామర, గజచర్మము, కర్పాణి, గజ్జి మున్నగునవి. వీనిని దేహమందలి ఆ ప్రాంతమునకు సంబంధించిన వ్యాధులుగా పొరపడుట జరుగుచున్నది. ఇవి వ్యాధిలో అంతర్భాగములైన లక్షణములు గాని వ్యాధులు కావు. వ్యక్తికి జబ్బు లేనిచో చర్మమునకు వ్యాధి రాదు. వైద్యము వ్యక్తికి జరుగునట్లు వేదనా సముదాయమును కూర్చుకొని మందును నిర్ణయింపవలెనే గాని చర్మమునకు చికిత్స

చేయరాదు.

**సూత్రము 175:** ఈ పాక్షిక వ్యాధులలో మొదటి తరగతికి చెందిన వ్యాధుల విషయమున తరచుగా వైద్యుని పరిశీలన లోపము కూడ నుండును. అనగా ఉన్న వేదనలను మొత్తము సూక్ష్మ పరిశీలన చేసి గ్రహింప లేకపోవుట కూడ సంభవమే.

**సూత్రము 176:** అట్టి వానిని మినహాయించిన తరువాత కూడ మరికొన్ని సందర్భములలో సూక్ష్మ పరిశీలన చేసినను నొకటి రెండు మాత్రమే తీవ్ర వేదనలుండి మిగిలినవి అస్పష్టముగా నుండుట కనిపించును.

**సూత్రము 177 :** ఇట్టివి అరుదుగా నుండును. ఇట్టి వానిని సాధింపవలెనన్నచో లభించిన యొకటి రెండు వేదనల నాధారముగా గొని, వానితో మిక్కిలి సారూప్యము చెందిన మందును వాడవలెను.

**సూత్రము 178 :** ఈ మందు రోగిలో నున్న వ్యాధికి సారూప్యముగల కృత్రిమ వ్యాధిని పుట్టించును. లభించిన ఏ కొద్ది వేదన లయినను విస్పష్టములై, పరిస్ఫుటములై ప్రత్యేక స్వభావము గలవియై యున్నచో తేలికగా నివారణము పూర్తి యగును.

**సూత్రము 179:** ఇట్టి సందర్భములలో మొదట నిర్ణయించిన ఔషధము తరచుగా కొంత సారూప్యము మాత్రమే కలిగియుండును. అంతకన్న లోతయిన సారూప్యము సాధించుట కాధారములు లేవుగదా!

**సూత్రము 180:** ఆ మందు పనిచేయుచున్నపుడు పుట్టించిన కృత్రిమ వ్యాధిలో రోగియందు అంతకు ముందు కనిపించని మరికొన్ని వేదనలు తాత్కాలికముగా పుట్టును. అవి ఔషధములకు సంబంధించినవి అయినను రోగి యందు మొదటి నుండియు అస్పష్టముగా దాగియున్న మరికొన్ని వేదనలుకూడ స్పష్టముగా వ్యక్తమై నివారణ చెందును.

**సూత్రము 181 :** పై చెప్పిన సందర్భమున పుట్టిన క్రొత్త వేదన లన్నియు ఔషధ వేదనలే గాని రోగికి సంబంధించినవి కావని అభ్యంతర పెట్టరాదు. అవి ఔషధముచే పుట్టినవే అయినను రోగిలో వ్యక్తముకాకుండ అంతవరకు దాగియున్న వేదనలు మాత్రమే. కారణ మేమనగా ఆ ఔషధమునకు సంబంధించిన వేదనా సముదాయ మంతయు దానికి సారూప్యము చెందిన రోగి యందు బీజప్రాయముగా నుండును. ఔషధ ప్రయోగము వలన ప్రేరేపణ చెందును.

వివరణము : రోగియందు స్పష్టమైన వేదనలు రెండుమాత్రమే యున్నవి. వానిలో సంపూర్ణ సారూప్యము చెందిన ఔషధమునకు గల వేదనలు పది యుండవచ్చును. వానికి ఆ మందు వాడినప్పుడు పుట్టిన కృత్రిమ వ్యాధి యందు మిగిలిన ఎనిమిది వేదనలలో కొన్ని తాత్కాలికముగా వ్యక్తము కావచ్చును. అవి అంతకుముందే రోగియందు బీజప్రాయముగా నుండును. లేనిచో ఔషధ ప్రేరణమున వ్యక్తము కావు. ఈ సిద్ధాంతము ఇంతకుముందు చెప్పబడిన సూత్రములలో నెచ్చటను కనిపించదు. అయినను ఇది సత్యమే అనిపించును. కారణము మేమనగా, ప్రాణశక్తి యొక్క ప్రతిక్రియ లేనిచోట మందు పనిచేయదు గదా! సీసాలో వేసినపుడు మందు పనిచేయకపోవుట ఎందుకు? ప్రతిక్రియ చేయగల ప్రాణశక్తి సీసా తత్త్వమున లేకుండుట వలననే, మానవుని యందు వాడినపుడు ప్రతిక్రియా సామర్థ్యముచే మందు యొక్క ప్రాథమిక గుణములును, అటుపైన ప్రతిక్రియా గుణములును పుట్టుచున్నవి. ఈ ప్రతిక్రియ రోగి తత్త్వమునకు సంబంధించినది గనుక రోగియందు బీజప్రాయములుగా నున్నవానిని తప్పక ప్రేరేపించును.

అట్లయినచో ఆరోగ్యవంతుని యందు ఔషధ ప్రయోగము చేసినపుడు వేదన లెచ్చటినుండి పుట్టుచున్నవి?

ఆరోగ్యస్థితి నుండి వేదనలు పుట్టవుగదా అనవచ్చును. కాని ఔషధము వ్యాధిని పుట్టించు ద్రవ్యము కనుక దాని నెదుర్కొనుటకై పుట్టుచున్నవి. లేనివాడయిన ఆరోగ్య వంతునిలోనే ప్రతిక్రియ పుట్టుచున్నపుడు రోగమున్న వానిలో నింకను శీఘ్రముగా, తీవ్రముగా వేదనలు పుట్టును. అందు కొన్ని కేవలము మందునకు సంబంధించినవే అయినను మరికొన్ని రోగిలో దాగి యున్నవి కావచ్చును. ఎట్లయినను దాగి యున్నవానిని దాగి యుండుటకు వీలు లేనట్లుగా ప్రేరేపణ చేయుట సారూప్యము చెందిన మందు యొక్క లక్షణము. ఇట్లు బీజప్రాయములైన వేదనలను వెలికిలాగుట దీర్ఘవ్యాధులలో సంభవము, కారణమేమనగా వేదనలు దాగి యుండుట కవకాశము దీర్ఘవ్యాధిలో నున్నదిగాని తరుణవ్యాధిలో లేదు.

సూత్రము 182 : ఇట్టి చికిత్సలో లభించిన ఒకటి రెండు వేదనలతో సారూప్యము చెందిన మందును వాడుట వలన ఆ రెండు వేదనలు శమించుటయు, దాగియున్న మిగిలిన వేదనలు బహిర్గతమగుటయు జరుగుచున్నది. దీనివలన మరల వేదనా సముదాయమును నిర్మించుకొని దానితో నెక్కువ సారూప్యముగల రెండవ మందును మొదటిదాని కన్న నిర్దిష్టముగా వాడుటకు వీలు కలుగుచున్నది.

**సూత్రము 183 :** మొదట వాడిన ఔషధము వలన అనుకూల ఫలితము లభింపక మరికొన్ని వేదనలు వెలువడి బాధించుచున్నచో వెంటనే మరల నూతనముగా అపుడున్న వ్యాధి లక్షణముల మొత్తమును క్రోడీకరించి దానికి సారూప్యమైన మందును నిర్ణయింపవలెను. ఈమారు వేదనల సంఖ్య ఎక్కువగా లభించినది గనుక ఔషధమునకు తగినంత సారూప్యము లభించుట సులభము.

**సూత్రము 184 :** ఇదే విధముగా నొక్కొక్క మందును వాడిన మందును వాడిన వెనుక దాని చికిత్స పూర్తిచేసి ఆ మిగిలిన వేదనలను క్రోడీకరింపవలెను. వానికి సంబంధించిన మరియొక మందును ప్రయోగింపవలెను. లభించిన వేదనలన్నియు పూర్తిగా మాయమగు వరకు నిట్లే చేయుచుండవలెను.

**సూత్రము 185 :** పాక్షికములైన వ్యాధుల విషయమున రోగి దేహమున ప్రాంతీయములైన వ్యాధులుండవచ్చునని భ్రమపడుట జరుగుచున్నది. అనగా దేహమందలి ఆ భాగమునకే వ్యాధి కలిగినదనియు, మిగిలిన దేహ భాగములు ఆరోగ్యముగనే యున్నవనియు భ్రమపడుట, ఇట్టి బుద్ధిహీనమైన సిద్ధాంతము వలన విపత్కరములైన మందులతో వైద్యము చేయుట పరిపాటియైనది.

వివరణము : తామర మున్నగు చర్మవ్యాధులున్నపుడు అవి చర్మమునకు మాత్రమే సంబంధించిన వ్యాధులనియు, మిగిలిన దేహమారోగ్యము గనే ఉన్నదనియు భావించుట. అట్లే పులిపిరికాయలు, అనెలు మున్నగువాని విషయమున కూడ జరుగుచున్నది. ఈ తప్పుడు సిద్ధాంతము ననుసరించి తామరకు పైపూత మందులు, పులిపిర్లకు గుర్రపువెంట్రుక కట్టుట లేక చిత్రమూలమో, క్రొత్తసున్నమో, రసాయనిక ఆమ్లము అంటించుటయో జరుగుచున్నది. అట్లే మంగలిచేత ఆనెలను కోయించి ఉప్పు పెట్టుట, జీడి పెట్టుట మున్నగు పనులు చేయుచున్నారు. ఇవి చాల విపత్కరములైన వైద్యములని రాబోవు సూత్రములవలన తెలియును.

సూత్రము 186 : ఈ ప్రాంతీయ వ్యాధులకు పైపూత వైద్యము చేయుట అలవాటయినందు వలన ఇవి చిల్లర వ్యాధులగనే పరిగణింపబడు చున్నవి. అట్లయినచో దెబ్బలు తగిలినచోట్ల నేర్పడిన గాయములు కూడా చిల్లర వ్యాధులుగనే తగ్గిపోవలసి యుండును. అట్లు జరుగుట లేదు. గాయము బలమైనపుడు దేహతత్త్వము నంతటిలో మార్పు తెచ్చుచున్నది. గాయపడిన వానికి జ్వరము వచ్చుట ఎందులకు? ముల్లు గ్రుచ్చుకొనుట, గాజుపెంకు గ్రుచ్చుకొనుట, ఎముకలు చిట్లుట జరిగినపుడు శస్త్రచికిత్స

చేయబడుచున్నది. ముల్లును, గాజుపెంకును తొలగించుటకు, గాని ఎముకలను యథాస్థానమున సద్దుటకుగాని మాత్రమే శస్త్రచికిత్స పనికివచ్చును. అటుపైన దేహమున పుట్టు మార్పులను నివారించుటకు శస్త్ర చికిత్స పనికి రాదు. ఈ శస్త్ర చికిత్స చేయబడిన వారికి గాయములవలన తీవ్ర జ్వరాదులు కలుగుచున్నవి గదా! వానిని ప్రాంతీయము లనవచ్చునా? రోగికి మందిచ్చినపుడే అవి తగ్గుచున్నవి గాని ప్రాంతీయముగా గాయమునకు చేసిన వైద్యముతో తగ్గవుకదా!వీనికి మరల సారూప్యౌషధమే శరణ్యము.

**సూత్రము 187 :** దేహమునకు బాహ్యముగా కలుగునట్టి కురుపులు మున్నగునవి గాయములు లేకనే పుట్టుచున్నవి. ఒక్కొక్కప్పుడు గాయము నాధారముగా జేసికొని కూడ పుట్టవచ్చును. వీనికి వ్యాధి కారణము దేహములో నుండునుగాని చర్మముపై నుండదు. ఇట్టివానిని వెలపలి చర్మ రోగములుగా భావించి పైపూత వైద్యము, శస్త్ర చికిత్స చేయుట అలోపతి వారి ప్రాతసిద్ధాంతము. అవి బుద్ధిహీనవేగాక విపత్కర పరిణామములకు కారణమగుచున్నవి.

**వివరణము :** ముల్లు గ్రుచ్చుకొనుట బాహ్య కారణమే గాని చీముపట్టి కురుపగుట చర్మవ్యాధి కాదుగదా! అది

దేహతత్త్వమందలి వ్యాధి పరిణామము. శస్త్రచికిత్సలో ముల్లును తొలగించుట మంచిదేగాని చీమును తొలగించుటతో వైద్యము పూర్తికాదు. మరల చీము పట్టకుండ, క్రుళ్లకుండ చేయునది వైద్యము. దానికి ఔషధ సేవనము తప్పదుకదా! చీముపట్టుట వంటిదే పులిపిర్లు, తామర, కురుపులు మున్నగు పరిస్థితికూడ. ఇవన్నియు తత్త్వమందలి వ్యాధి పరిణామము. వీనికి ప్రాంతీయ వైద్యము చేయుటవలన తత్త్వమందలి పరిణామము నెదుర్కొనుట జరుగుచున్నది.

**సూత్రములు 188, 189:** ఇట్టివన్నియు ప్రాంతీయ వ్యాధులుగా, ఆ భాగమునకు మాత్రమే సంబంధించిన వ్యాధులుగా నెంచబడుచున్నవి. దేహతత్త్వము మొత్తము ప్రాణియందలి ప్రాణ వ్యవహారఫలమని గ్రహించుట జరుగ లేదు. దేహతత్త్వమందు వ్యాధి కారణము లేకుండ, మొత్తము తత్త్వముయొక్క సహకారము లేకుండ నిట్టి బాహ్యాబాధలు కలుగుటయు, కలిగినవి నిలబడుటయు, ఆ ప్రాంతములు చెడిపోవుటయు జరుగదు. దేహమందలి ఆరోగ్యము మొత్తమున వ్యాధి కారణము లేనిచో నిట్టివి కలుగవు. ప్రాణి మొత్తము ప్రాణ వ్యాపారముయొక్క మొత్తమేకదా! దాని ప్రమేయము లేకుండ నిట్టి ప్రాంతీయ

వ్యాధులు పుట్టి పెరుగవు. పెదవులపై ఒరిపిడిగాని, చర్మవ్యాధిగాని, వ్రేళ్లపై గోరుచుట్టుగాని దేహమందు వ్యాధి కారణము లేనిదే పుట్టవు.

**సూత్రము 190:** ఇట్టి వ్యాధులకు వైద్యము నిర్దిష్టము, ఫలవంతము, వివేకవంతము, పరిపూర్ణముగా జరుగ వలెనన్నచో శరీరతత్త్వము మొత్తమునకు వైద్యము జరుగవలెను. వైద్యము జరుగవలసినది రోగ కారణములకే గాని రోగ ఫలితములకు కాదు.

**సూత్రము 191:** ఈవిషయము అనుభవ పూర్వకముగా, నిస్సందేహముగా స్థాపింపబడినది. శక్తివంతమైన సారూప్యౌషధమును దేహతత్త్వములోనికి సేవించినపుడు నౌషధ పరిధిలోనికి వచ్చిన బాధలన్నియును నివారణమగును. అదే ఔషధము దేహ తత్త్వము నందలి అన్ని మారుమూల ప్రదేశములకును కూడ వ్యాపించుచు తత్త్వమందలి బాధలనే కాక ప్రాంతీయ బాధలను గూడ తొలగించును. వానికి వేరుగా బాహ్యమైన వైద్య మక్కరలేదు.

**సూత్రము 192:** ప్రాంతీయములైన బాధలున్న రోగులకు మందులు నిర్ణయించునపుడు దేహతత్త్వమందలి మొత్తమునకు సంబంధించిన రుగ్మతలను ముఖ్యముగా పరిశీలించవలెను.

వివరణము: తామర, పులిపిర్లు మున్నగు బాధలు గల వారికి ఔషధ నిర్ణయము చేయునపుడు ఆ బాహ్య లక్షణములను బట్టి చేయరాదు. శరీర తత్త్వమందలి వేదనలను పూర్వము చెప్పినట్లు కూర్చి పొందుపరచి వానికి సారూప్యమైన మందునే ఎన్నుకొనవలెను. దానితోనే దేహమందలి వ్యాధియు, దాని అంతర్భాగములైన ఈ చర్మవ్యాధులు మొదలగునవియు నివారణమగును.

**సూత్రము 193:** చక్కగా నిర్ణయింప బడిన ఔషధము సరియైన మోతాదులో వాడకము చేసినచో రోగము మొత్తము చిల్లరతో గూడ నివారణమగును. ఈ చిల్లర చర్మవ్యాధులు మొదలగువానికి చమ్మగా నుండుటకు బాహ్యముగా నుపయోగించు దుష్టములైన ఔషధములను వాడకున్నచో ఈ నివారణము సక్రమముగా జరుగును.

వివరణము: చమ్మగా నుండుటకు వాడబడు చిల్లరమందు లనగా తామరకు పై పూతలు, దురదలకు మంట పుట్టించు మందులు, మరిగిన వేడి నీళ్లతో దురద గల ప్రదేశమును మాడ్చుట దుష్టవిధానములు. ఇవి తీటకు చమ్మగా నుండునట్లు చేయునేగాని వ్యాధిని క్లేశపరచును.

**సూత్రము 194:** ప్రాంతీయ్యర జాడ్యములగు తామర, తీట, చిడుము, కొరుకుడు, సుఖవ్యాధుల బాహ్యబాధలు [illegible]



లేక తడపర, పొంగు, మశూచి, ఆటలమ్మ మొదలగు తరుణవ్యాధుల బాహ్యబాధలుగాని ప్రాంతీయముగానున్న సందర్భమున నిర్ణయింపబడిన ఔషధము పై పూతలకు సంబంధించినదిగా నుండనక్కరలేదు. వాడిన ఔషధము ఈ బాహ్య బాధలపై పనిచేయునపుడు రోగియందు సోరా, సిఫిలిస్, సైకోసిస్ మున్నగు దీర్ఘవ్యాధుల వృత్తాంతములకై ప్రత్యేక పరిశీలనము చేయవలెను. దీర్ఘవ్యాధుల వేదనలు రోగికి సంబంధించి యుండునుగాని అత డార్జించుకొనిన రోగములకు సంబంధించి యుండవు. ఆర్జించుకొనిన వ్యాధి బాధలు నయము కావలెనన్నచో అంతకుముందు రోగికి సంబంధించిన దీర్ఘవ్యాధులు నయముకావలెను.

**సూత్రము 195:** ఏదైన తరుణవ్యాధికి అసాధారణములు, విచిత్రములు అగు వేదనలు పుట్టియున్నచో ఆ తరుణ వ్యాధికి వైద్యము జరిగిన వెనుక దానిని నిశ్శేషము చేయవలెనన్నచో సోరాను ప్రతిఘటించు నౌషధ ప్రయోగము ఆవశ్యకమగును.

**సూత్రము 196:** ప్రాంతీయ వ్యాధులున్న రోగులకు వ్యాధి నివారణ ప్రయత్నము చేసినపుడు వ్యాధి సామాన్యమునకు మాత్రమే గాక ఆ ప్రాంతీయ వ్యాధికి గూడ పనికివచ్చునట్టి ఔషధమునే నిర్ణయించి వాడవలెను. ప్రాంతీయ బాధలకు మూలములైన దేహ బాధలను కూడ

కలిగించునట్టి ఔషధమైనచో నివారణము సుకరము.

వివరణము: ఉదాహరణకు ఒక రోగి చాల దశాబ్దములనుండి విరేచనబద్ధకము, తలనొప్పులు మున్నగు వానితో బాధపడుచు సోరా శరీర తత్త్వము కలవాడుగా నున్నాడు. వానికి తామర గూడ నున్నది. వానికి మందు నెన్నునపుడు అతని విరేచనబద్ధకమునకును, తలనొప్పికిని సంబంధించిన ప్రత్యేక వేదనలైన మానసిక వేదనలు మున్నగువానికి సారూప్యమును సాధింపవలెను. వానితోపాటు తామరకును, దాని ప్రత్యేక వేదనలకును, అది వ్యక్తమయిన శరీర భాగమునకును కూడ సారూప్యముగల మందు నెన్నవలెను. అప్పుడే నివారణ సుగమముగా జరుగును.

సూత్రము 197: రోగి తత్త్వమునకు ప్రయోగించిన ఔషధముతోపాటు పైపూత మందులనుకూడ వేరుగా సమకాలికముగా నుపయోగించుట తగదు.అట్లు చేయుటవలన బాహ్యమైన వ్యాధి ముందుగా మాయ మగును. ఇక మిగిలిన వ్యాధి నివారణమైనదో, తత్త్వమున మిగిలియున్నదో నిర్ణయించుట కష్టమగుటయేగాక అసాధ్యము గూడ నగును.

వివరణము: చర్మముపై కనిపించుచున్న

బాధలన్నియును లోపలి వ్యాధిలోని భాగములే గదా! చర్మవ్యాధి యున్నచో దానికి సంబంధించిన వ్యాధి దేహమందున్నదని విస్పష్టముగా తెలియుచుండును. చర్మవ్యాధిని వేరుగా మాయము చేసినచో లోపల వ్యాధి యున్నదో లేదో తెలియుట కాధారము లేకపోవచ్చును. స్థూల దృష్టికి ఆ లోపలనున్న సోరా నయమైనట్లు కనిపించినను నిజముగా నయముగానిచో లోపల విపత్తును పుట్టించును. దీనిని తెలిసికొనుటకు నాధారముగా చర్మవ్యాధిని గమనింప వచ్చును గనుక ఆ చర్మవ్యాధిని వేరుగా నయము చేయరాదు.

**సూత్రములు 198, 199:** ఈ చర్మవ్యాధులను సూటిగా, ప్రత్యేకముగా నయముచేయు ప్రభావముగల మందులను వేరుగ లోపలికి సేవించుట కూడ మానవలెను. లోపలికి మందును సేవించి చర్మవ్యాధిని వేరుగా నయము చేసినను ఇంతకు ముందు చెప్పబడిన ఇబ్బందియే కలుగును. సారూప్యౌషధమును కూడ ప్రాంతీయ బాధలను నివారించుటకు వాడరాదు. గనోరియా, కొరుకుడు, పులిపిరి, కణుతులు, కాయలు మాత్రమే ఉద్దేశింపబడి సారూప్యౌషధమును వాడినపుడు వాని కారణములైన దేహమందలి వ్యాధులు నివారణముకావు. ఇట్టి వైద్యమువలన వెలుపలి చర్మవ్యాధి మాయమై దానికి

కారణమైన లోపలి వ్యాధి మిగిలిపోవును. దాని వేదనలు విస్పష్టముగా నుండవు గనుక దానికి మరల సారూప్యౌషధమును వాడినపుడు అది తొలగి పోయెనో లేదో తెలియుట కవకాశముండదు.

వివరణము: సైకోసిస్ వ్యాధి కలవాని దేహముపై మచ్చలు, పొక్కులు, పులిపిర్లు, దురదలు ఉన్నపుడు లోపలి వ్యాధి మొత్తమును విడిచిపెట్టి ఈ ప్రాంతీయ లక్షణములకు మాత్రమే సారూప్యమైన ఔషధమును నిర్ణయించి వాడరాదు. వాడినచో ఇవి తగ్గి లోపలి వ్యాధి వృద్ధి పొందును. ఉదాహరణకు: పులిపిర్లకు తూజా, నోటిపూతలకు సారూప్యమును బట్టి నైట్రిక్ యాసిడ్ వాడి తగ్గించువారు కలరు. అవి తగ్గిన వెనుక మానసిక లక్షణములు, గుండెజబ్బులు, లివర్ జబ్బులు మున్నగు బాధలతో కూడిన అసలు సైకోసిస్ విపాకము దేహమున మిగిలిపోవును. మిగిలిపోయినట్లు గమనింపబడనిచో అది నిరాఘాటముగా వృద్ధిచెంది నివారణకు లొంగని విధముగా ముదిరిపోవును. అట్లుకాక చర్మవ్యాధి యుండగనే మొత్తము వేదనా సముదాయమునకు సంబంధించిన మందును నిర్ణయించి వాడవలెను. అప్పుడు లోపలి వ్యాధి మిగిలి యున్నంత వరకు చర్మవ్యాధియు మిగిలియుండును. చర్మవ్యాధిని పట్టి లోపల ఇంకను వ్యాధి యున్నదని సులభముగా

తెలియు చుండును. నిజమైన వ్యాధి నివారణ పూర్తియైనంతనే చర్మవ్యాధియు అప్రయత్నముగా మాయమగును.

**సూత్రము 200:** చర్మవ్యాధితో కూడిన మొత్తము వ్యాధికి సారూప్యమైన మందునే కనిపెట్టి వాడవలెను. ఎంతకాలము చర్మవ్యాధి మిగిలియుండునో అంతకాలము లోపల వ్యాధియున్నట్లు తెలియుచుండును. లోపల వ్యాధి నివారణమగుచున్న కొలదియు దానితోపాటు చర్మ వ్యాధియు పలుచబడుచుండును. ఇట్టి విధానము వలన చర్మవ్యాధి మాయమగు నాటికి లోపల వ్యాధి నివారణ మైనదని తెలిసికొన వచ్చును.

**సూత్రము 201:** దేహమందలి ప్రాణశక్తి ఎప్పుడును వ్యాధిని తొలగించుటకే యత్నము చేయుచుండును. కాని సోరా వంటి దీర్ఘవిపాకములను అది స్వయముగా తొలగింప లేదు. మందుల సహాయము కావలెను. అట్టి వ్యాధి దేహమున నున్నపు డెల్లను ప్రాణశక్తి ఏదో యొక చర్మవ్యాధిని పుట్టించి దేహము పై భాగమం దెచ్చటనో ఒక ప్రదేశమున ప్రదర్శించి తీరును. ఆ భాగమున బాహ్యముగా వ్యాధిగ్రస్తము చేయుట వలన లోపలి వ్యాధిని ప్రకోపము చెందకుండ అరికట్టి యుంచగలదు. అది

లేనపుడు లోపలి వ్యాధికి కాలక్షేపము లేక దేహమందలి ప్రాణ ప్రసారము నడుపునట్టి అవయవములను ధ్వంసము చేసి రోగిని చంపగలదు. అట్లు చేయనీయకుండ లోపలి వ్యాధికి నేదోయొక దేహభాగము నప్పచెప్పుటకే ఈ చర్మవ్యాధిని పుట్టించి దానితోపాటు లోపలి వ్యాధిని బయటకు నెట్టుచుండును. ఈవిధముగా నొక చర్మవ్యాధి యున్నపుడు లోపలి వ్యాధిని తాత్కాలికముగా అరికట్టి యుంచుటకు వీలగును. ప్రాణశక్తి దీర్ఘవ్యాధిని నివారణము చేయుట ఎట్లును సాధ్యము కాదు గనుక చర్మవ్యాధులు లోపలి వ్యాధులను తక్కువ విపత్కరముగా నుంచ గలుగుటకు సాధనములు. ఇట్లున్నపుడు గూడ లోపలి వ్యాధి వృద్ధి పొందక మానదు. కాని పాక్షికముగా, తాత్కాలికముగా అరికట్టబడి యుండును. లోపలి సోరా వ్యాధి నివారణము కానంతకాలము కాళ్ళమీద ప్రాత కురుపులు మరల మరల లేచుచునే యుండును. సిఫిలిస్ విపాకము లోపల యున్నంత వరకు చర్మమును తినివేయు పగుళ్ళ బాధలుండనే యుండును. సైకోసిస్ లోపల యున్నంత వరకు పులిపిర్లు, ఆనెలు పెరుగుచునే యుండును. లోపలి వ్యాధి వృద్ధిచెందుచున్నంత వరకు ఈ చర్మరోగ లక్షణము ముదిరిపోవుచునే యుండును.

వివరణము: కోటలో శత్రు సైన్యములు ప్రవేశింప

గల్గినపుడు లోపలి సైనికులు చేతనయినంతవరకు పోరాటము సలుపుచునేయుందురు. కొంత సైన్యము బయటనుండికూడ ముట్టడి చేసినచో శత్రుసైన్యముల దృష్టి కొంత వెలుపలి సైన్యముల వైపు మరలక తప్పదు. అప్పుడు లోపల పోరాడుచున్న సైనికులకు కొంత విశ్రాంతి లభించుట కవకాశమున్నది. ఏ మిత్రరాజయిన సహాయము పంపువరకు వారు కాలక్షేపము చేయుటకు వీలగును. అట్లే లోపల వ్యాధితో పోరాడుచున్న ప్రాణశక్తికి బయటి చర్మవ్యాధులవలన కొంతవిరామము చిక్కును. రోగి చనిపోకుండ కాలక్షేపము చేయుటకు వీలగును. ఇంతలో సరియైన ఔషధచికిత్స లభించినచో రక్షణకు వీలుపడును.

సూత్రము: **202:** అలోపతి వైద్యుడు పైపూత మందుల వంటి వానిని ఉపయోగించి ఈ చర్మ వ్యాధులకు వైద్యము చేయును. దానితో చర్మ వ్యాధిని నివారించుచుంటినని భ్రమపడును. అట్టి ప్రయత్నము జరిగినపుడెల్ల ప్రకృతి ధర్మము ప్రకారము లోపలి వ్యాధి బల మెక్కువగును. అది మరల ప్రాణశక్తిచే వెలుపలకు నెట్టుటకు ప్రయత్నము జరుగుచుండును. వెలుపలినుండి చేయబడు పై పూత ప్రయత్నములవలన వ్యాధి తీవ్రత మరల లోపలికి నెట్టబడు చుండును. అది చర్మము నేమియు చేయలేక నరములను పాడుచేయును.

వివరణము: చీలమండల దగ్గర పుట్టిన తామర, మొలయందు పుట్టిన రొంటి గజ్జి మున్నగునవి సామాన్యముగా నివారణము కావు. బలమైన పైపూత మందులు తగిలినపుడెల్ల కొంచెము లోపలికి పోయి మాటుపడుచు మరల చర్మము పైకి విజృంభించుచుండును. దీనికి కారణమేమి? ప్రాణశక్తి మరింత బలిష్టముగా వ్యాధిని చర్మము పైకి తోలుచుండుటయే. నిజముగా పైపూతల బలమున చర్మవ్యాధి నివారణము సంపూర్ణముగా జరిగినచో లోపలివ్యాధి తీవ్రతకు రోగి జీవింపడు. కనుకనే ఎన్ని మందులు వాడినను అవి దశాబ్దముల తరబడి నయము కావు.

**సూత్రము 203:** పులిపిరి కాయలను, కణుతులను తీవ్రమైన క్షారములతోను, ఆమ్లములతోను మాడ్చివేయుటయు, ఆనెలను కత్తితోమొదలంట శస్త్రచికిత్స చేయుటయు మున్నగు విధానము లన్నియు సోరా వ్యాధి దేహమందుండగానే చర్మవ్యాధిని నివారణచేయు దుష్టప్రయత్నము. ఇంతవరకును అట్టి ప్రయత్నములు బాహాటముగా జరుగుచునే యున్నవి. పదవులలంకరించిన వైద్యప్రముఖులు దానిని అధికారికముగా నంగీకరించి యొక వైద్యవిధానము క్రింద ప్రమాణము చేయుచునే

యున్నారు. కాని ఇట్టి ప్రయత్నములయొక్క దుష్పరిణామము ఎట్లున్నదో గమనింపవలెను. ఇట్టి చికిత్సల వలన పేరున్నవి, పేరు లేనివి అగుమహావ్యాధి స్వరూపములు నరజాతిపై విజృంభించుటయు, వాని పాదముల క్రింద నలిగిపోవుచున్న రోగార్తుల ఏడ్పులు, మూల్గులు వినిపించుటయు దీని పర్యవసానము.

సూత్రము 204: దీర్ఘవ్యాధులలో అపరిశుద్ధముగా జీవించువారికి కలిగిన రోగముల సంఖ్యను వేరుచేయ వలెను. అది ఒక భాగము. అలోపతివారు అవివేకముగా మందులను వాడుటవలన పుట్టిన భయంకరములైన ఔషధ రోగములను మరల వేరు పరచవలెను. ఈ రెండింటి సంఖ్యనుకలిపి తొలగింపగా మిగిలినవారికి కలిగిన దీర్ఘవ్యాధులే నిజమయిన దీర్ఘవ్యాధులు. అవి మూడే విధములు. సోరా, సిఫిలిస్, సైకోసిస్. ఇందొక్కొక్కటే దేహతత్త్వము పూర్తిగా నాక్రమించి అందలి అన్ని తావుల యందును విజృంభించును. అటుపైనగాని వాని వేదనలు బయటపడవు(సోరా యందు గజ్జి కురుపులు, సిఫిలిస్ నందు కొరుకుడు లేక గజ్జలలో గ్రంధియు, సైకోసిస్ వ్యాధిలో కణుతులు, కాయలు మున్నగునవి పుట్టుట). ఇట్టి ప్రాంతీయములైన చర్మలక్షణములే పుట్టకున్నచో ఈ దీర్ఘవ్యాధులు ఘోరములై, శాఖోపశాఖలై పేరు పెట్టుటకు

కూడ వీలులేని అసంఖ్యాకములైన బాధలతో తరతరము లుగా నరజాతిని వందల, వేల సంవత్సరములుగా ముంచెత్తి యుండెడివి. నిపుణులైన వైద్యులు ఈ పై పూతలు మున్నగు విధానములకు కక్కుర్తి పడక ఈ మూడు విపాకములను సారూప్య విధానమున ఔషధములచే నిశ్శేషముగా నివారణచేయుట దర్శింప బడనిచో దీనికి నిష్కృతియే లేదు.

వివరణము: దీర్ఘవ్యాధులని పిలువబడు వ్యాధు లన్నిటిని మూడు విభాగములు చేయవలెను.

ఎ) అపరిశుభ్రమైన జీవితవిధాన మవలంబించినవారు పడు బాధలు.

బి) భయంకరములైన ఔషధములను నిరంతరము వాడుచుండుటవలన కలిగిన తీవ్ర విపరిణామములు. ఈ రెండును పోను మిగిలిన భాగమే నిజమైన దీర్ఘవ్యాధులు. ఇవి సోరా, సైకోసిస్, సిఫిలిస్ అను విపాకముల వలన కలుగుచున్నవి. ఈ మూడింటిలో నేదియైనను శరీర తత్త్వము మొత్తమును కబళించి, అణువణువునను స్థానము చేసికొని నిండును. అటుపైన దానినుండి ప్రాణిని రక్షించుటకు ప్రాణశక్తి చేయు పోరాటము నడచును. తత్ఫలితముగా చర్మవ్యాధులు పుట్టును. చర్మవ్యాధి రూపమున లోపలి వ్యాధి తీవ్రత బహిర్గత మగుచుండుటచే

ఈ రోగి జీవించియుండును. కనుకనే ఈ చర్మవ్యాధులను నిశ్శేషముగా నయము చేయుట ఏ ప్రాంతీయౌషధ ప్రక్రియకును లొంగదు. లొంగినచో రోగి చనిపోవును. కాని పై పూత వైద్యముల వలన కాలక్రమమున లోపలి విపాకము భీకరరూపము దాల్చును. వానికి ఫలితములే దుర్నివారకములగు క్యాన్సరు, జలోదరము, గుండెజబ్బు, క్షయవ్యాధి, కుష్ఠు, పక్షవాతము మున్నగునవి. ఇవి అశాస్త్రీయ చికిత్సల దశాబ్దముల పరిణామ ఫలితములే గాని వ్యాధులు కావు. ఈ అశాస్త్రీయ ప్రయత్నముల వలన నివారణకు లొంగని వ్యాధులు వేలు, లక్షలుగా పుట్టవచ్చును. కనుక ఆ మార్గమును వదలి దేహతత్త్వము మొత్తమునకు సారూప్యము సిద్ధించిన ఔషధమును, మోతాదును నిర్ణయించి సక్రమ పద్ధతిలో నివారణ ప్రయత్నము సాగించినచో మార్గము సుగమమై ప్రయత్నము ఫలవంతమగును. మానవులు బాధలను పెంచుకొనకుండ తేలిక పడుట జరుగును.

**సూత్రము 205:** దీర్ఘ వ్యాధులలో ఈ విధముగా నేర్పడిన ప్రాథమిక లక్షణములలో వేనిని ఉద్దేశించి ఔషధమును ప్రయోగింపరు. ప్రాథమిక లక్షణములపై నాధారపడి వృద్ధిపొందిన రెండవ కక్ష్యలోని బాధల నుద్దేశించి కూడ ప్రాంతీయములైన ఔషధములను హోమియోపతీ

వారు వాడరు. వానిలో ఏ లక్షణములు కనిపించుచున్నను లెక్కచేయక వ్యాధి విపాకమునే ముఖ్యముగా స్వీకరింతురు. స్వీకరించి ఔషధమును వాడినచో ఈ ప్రథమ, ద్వితీయ కక్ష్యలలో నున్న వేదనలు అప్రయత్నముగా మాయమగును. కాని ఈ శాస్త్రకారునికన్న ముందున్న వైద్యు లెవరును ఆవిధముగా మందులను వాడుట ఆచారము కాదు. కనుక అనేక రోగుల విషయమున అంతకు ముందర జరిగిన వైద్యములలో ఈ ప్రాథమిక వేదనలు పైపూతల మందులతో దగ్ధము చేయబడియుండును. కనుక ఈ ప్రాథమిక వేదనలు పాప మా హోమియోపతీ వైద్యునకు లభింపవు. కాగా దేహతత్త్వములలో అంతర్గతమై యున్న విపాకముల విజృంభణను భగ్నము చేయునపుడు ఆ ప్రథమ, ద్వితీయ వేదనలు అనేక రూపములలో వెలువడును. అంతర్గతమైన సోరాను నివారింప యత్నించునపుడు అంతర్గతమైన ఔషధ ప్రయోగమే ముఖ్యముగా చేయబడును. దీనిని గూర్చి ఒకే ఒక వ్యక్తియగు ఈ శాస్త్రకారుడు అసహాయుడై తపస్సు చేసెను. తత్ఫలితముగా అనుభవమునకై ప్రయోగములు చేయుట, వాని ఫలితములను పరిశీలించుట, వానినిగూర్చి ఆలోచించుట చేసెను. ఆ విధానము మొత్తమును దీర్ఘవ్యాధుల ప్రత్యేక గ్రంధమున చదివి తెలిసికొనవచ్చును.

వివరణము: ఎ) సోరా విపాకము మొట్టమొదటగా నొక శరీర తత్త్వమును ఆక్రమించి విజృంభించినపుడు దానికి సంబంధించిన ప్రాథమిక వేదనలు ప్రాంతీయములై చర్మవ్యాధుల రూపమున వెలువడును.

బి) అటుపైన ద్వితీయ కక్ష్యలోని వేదనలు అంతర్గతములైన బాధల రూపమున వెలువడును.

సి) ఈ రెండు విధములైన వేదనలను లెక్కచేయక కేవలము సోరా విపాకమునకు సంబంధించిన వేదనా సముదాయమును మొత్తముగా గొని, వానితో సారూప్యముగల ఔషధమును నిర్ణయించి ప్రయోగించుచు హోమియో సిద్ధాంతము ననుసరించువారు వైద్యము చేయవలెను. ఈ విధానమును మొట్టమొదటగా దర్శించి వైద్యము ప్రారంభించినవాడు తానేయగుటవలన అంతకుముందు ఆ రోగులకు చేయబడిన వైద్యము దానికి అనుకూలముగా జరుగలేదు. అలోపతీ వైద్యులచే పైపూతమందుల వాడకము జరిగినది. ఈ కారణముచేత తాను స్వీకరించిన రోగులలో ఈ ప్రధమ, ద్వితీయ కక్ష్యలకు చెందిన వేదనలు ధ్వంసము చేయబడి యుండెను.

డి) అప్పుడు తాను సూటిగా సోరా వ్యాధికి సంబంధించిన వేదనా సముదాయమును కూర్చుకొన వలసి

వచ్చెను. దానికి సారూప్యమైన ఔషధములను ప్రయోగించుటలో రోగులయందు అంతర్గతములైన వేదనలు కొన్ని బహిర్గతమయ్యెను.

ఇ) ఇట్టి సందర్భమున కేవలము తాను స్థాపించిన ఔషధ విజ్ఞానము ననుసరించి అతడు వైద్యము చేసెను. అతడు చేసిన ప్రయోగములు, వాని ఫలితములు, వానినిగూర్చి అతడు తీసికొనిన నిర్ణయములు మున్నగునవి అతడు రచించిన 'దీర్ఘవ్యాధులు' అను గ్రంథమున విపులముగా వివరింపబడినవి.

**సూత్రము 206:** ఒక దీర్ఘవ్యాధి నివారణమునకు వైద్య మారంభించుటకు ముందు, ఆ రోగికి ఎప్పుడైన నొక సుఖవ్యాధి సంబంధమేమయిన నున్నదాయని సూక్ష్మ పరిశీలనము చేయవలెను. అనగా పులిపిర్లను పుట్టించు గనోరియా వ్యాధి విపాక మున్నదేమో పరిశీలింపవలెను. ఉన్నచో వైద్యమును ముఖ్యముగా దాని నుద్దేశించియే జరుపవలసి యున్నది. కాని ప్రస్తుత పరిస్థితిలో అట్టి వ్యాధి అరుదుగా కనిపించును. అట్టి అంటువ్యాధి అంతకుముందున్నచో వారి యందు సోరాగూడ నుండి ఆ రెండు వ్యాధులును కలసి లుంగగా నేర్పడి యుండును. స్వచ్ఛముగా సిఫిలిస్ లక్షణములు మాత్రమే కనిపింపక

వానితో సోరా లక్షణములు కూడ కలసి కనిపించును. తన రోగియందు కేవలము సుఖ వ్యాధి లక్షణ సముదాయము ఉన్నచో అది ఆ తత్త్వము నందున్న సోరాతో కలిసియుండునే గాని స్వచ్ఛముగా నుండదు. కారణమేమనగా దీర్ఘవ్యాధి విపాకములలో బహుళ వ్యాప్తి కలది సోరా యొక్కటే. అదియే దీర్ఘ వ్యాధు లన్నిటికిని ప్రాథమిక కారణము. ఒక్కొక్కపుడు ఈ రెండును కలసి సైకోసిస్‌తో ముడిపెట్టుకొని యుండుటయు కలదు. ఇట్టి శరీర తత్త్వములు దీర్ఘ వ్యాధులలో కనిపించును. అయినను సకల దీర్ఘ వ్యాధులకును మూలకారణము సోరా అనుటకు సందేహము లేదు. దాని నుండి పుట్టినవి ఎన్నో వ్యాధులుగా పరిగణింపబడవచ్చును. అంతేగాక అవి స్వతంత్ర వ్యాధులుగా పరిగణింపబడి వైద్యము చేయుగా తారుమారైపోయి గూడ నుండవచ్చును.

వివరణము: ఎ) దీర్ఘవ్యాధికి వైద్యము ప్రారంభించుట యనగా మూడువిపాకములలో నొకదానిని గూర్చి వైద్యమారంభించుటయే.

బి) అట్లు ప్రారంభించుటకు మందు ఆ రోగి యందు గనోరియాకుగాని, సిఫిలిస్‌కు గాని సంబంధించిన విపాకమేదయిన నున్నదేమో పరిశీలింపవలెను. గనోరియాకుసంబంధించి యున్నచో పులిపిర్లు మున్నగునవి

యుండును. సిఫిలిస్‌కు సంబంధించి యున్నచో గజ్జలలో గ్రంధివాపుగాని, చర్మము పగులుటగాని యుండును. ఉన్నపుడు వానిని కూడ వేదనలతో కలుపుకొని ఔషధ నిర్ణయము చేయవలెను.

సి) అట్లుగాక సోరా మాత్రమే యున్నచో గజ్జి కురుపులకు సంబంధించిన చర్మవ్యాధులుండును.

డి) సిఫిలిస్, సైకోసిస్‌లలో నొక దానికి సంబంధించిన లక్షణములున్న రోగులలో కూడ అంతకుముందు సోరా వ్యాధి యుండి యుండవచ్చును. సోరాతో సిఫిలిస్‌గాని, సైకోసిస్‌గాని, రెండునుగాని లుంగ చుట్టుకొని యుండ వచ్చును.ఇట్టి వ్యాధులలో కూడ నిన్నిటికి సంబంధించిన వేదనా సముదాయమును కనుగొని ఔషధ నిర్ణయమును చేయవలెను. కాని అట్లు చేయుట సుకరముగ సిద్ధించుట లేదు. కారణమేమనగా ఈ వేదనలను ప్రత్యేక వ్యాధుల పేర్లు పెట్టి వేరుగా మందులు వాడి అల్లోపతి వైద్యులు అల్లకల్లోలము చేసి విడిచిరి.

**సూత్రము 207 :** పై విషయములను తెలిసి నంత వరకు నిర్ణయించి స్థిరపరచుకొనిన వెనుక మరియొక బాధ్యత కలుగును. ఆ రోగికి అప్పటి వరకు నేవిధమైన అలోపతి వైద్యము జరిగినదో నిశితముగా తెలిసికొనవలెను.

ఏ విధమైన మందులను తరచుగా వాడి చెదరుబాటు చేసిరో గ్రహింపవలెను. ఏ మందులు కలిపిన నీటితో స్నానములు చేయించిరో, వాని ఫలితము లెట్లు పుట్టెనో తెలియవలెను. ఈ విధానముల వలన వ్యాధియొక్క మొట్టమొదటి స్థితి నుండి ఎట్టి వికలత సంభవించెనో గ్రహింపవలెను. సాధ్యమయినప్పుడెల్ల వాని నెట్లు సరిచేసికొనవలెనో, ఆ వాడబడిన మందులన్నిటి ప్రభావమును పరిహరించుట యెట్లో గమనింపవలెను.

**సూత్రము 208 :** రోగియొక్క వయస్సు, అతని జీవన విధానము, ఆహారము, వృత్తి, కుటుంబపరిస్థితులు, సాంఘిక సంబంధములు మున్నగువానిని అటుపైన తెలిసికొనవలెను. ఈ అంశములు వ్యాధిని పెంపు చేయుటకు తోడ్పడిన వేమో చూచుకొనవలెను. ఆ పరిస్థితులలో నేవి వ్యాధి నివారణకు సహాయపడునో, ఏవి యడ్డు పడునో పరిగణనము చేయవలెను. అతని స్వభావమును, మనోగతిని కూడ లెక్కలోనికి తీసికొనవలెను. వానివలన వైద్యమునకు విఘ్నములు కలుగునా, వాని విషయమయిన రోగికి సలహా లీయవలెనా, ప్రోత్సాహము చేయవలెనా, మార్పులు కలిగింపవలెనా అను నిర్ణయములు చేయుట అవసరము.

**సూత్రము 209 :** పై విషయములను దృష్టిలో నుంచుకొని అతని వ్యాధి యొక్క ఆకృతి మొత్తమును వీలయినంత పరిపూర్తితో రూపొందించుటకై వైద్యుడు రోగితో మాటిమాటికిని సంభాషణలు జరుపుచుండవలెను. విలక్షణములు, ప్రత్యేక లక్షణములు గల వేదనలను అస్తిత్వమును బట్టి అందిపుచ్చుకొని లెక్కలో చేర్చవలెను. వాని నన్నిటి ననుసరించి సారూప్యము సిద్ధించు మందులలో ముఖ్యమైన దానిని, సోరాను ప్రతిఘటింప గలదానిని ఒకే ఔషధము నెన్నుకొనవలెను. దానితోనే వైద్య మారంభించి ముందునకు సాగిపోవలెను.

**సూత్రము 210 :** సోరా నుండి పుట్టిన వ్యాధులన్నిటిలో దాదాపు పాక్షికములైన బాధలుండును. అవి పరిమిత లక్షణములను మాత్రము ప్రకాశింపజేయగలిగి యుండును. మిగిలిన వేదనలు అదృశ్యమై యుండును. ఒకే వ్యాధి వలె కనిపించునొకే ప్రధానమైన బాధ యుండును. అట్టి వాని నివారణమే ఎక్కువ కష్టము. మానసిక రోగములు అనుబడునవి తరచుగా నీ జాతికి చెంది యుండును. వానియందు ఒక నిర్ణీతమైన వర్గీకరణము కలిగి మిగిలిన వానికన్న వేరుగా నెంచదగిన వ్యాధి లక్షణ ముండదు. మిగిలిన తరగతికి చెందిన వ్యాధులలో స్వభావ వైఖరి యందును, మానసిక వైఖరి యందును కలిగిన మార్పులు

స్పష్టముగా నుండును. అన్ని వ్యాధుల యందును నివారణమునకు కావలసినది మానసిక వైఖరిలో కలిగిన మార్పులను తొలగించుట, దానితో ముడిపెట్టుకొన్న వేదనా సముదాయమును తొలగించుట.

**సూత్రము 211 :** దీని ప్రాధాన్యమెంత యున్నదనగా సారూప్యము జెందిన ఔషధమును నిర్ణయించుటలో రోగి మానసిక వైఖరినే ముఖ్యాధారముగా, రోగిని ప్రత్యేకించు వేదనగా స్వీకరింపవలసి యున్నది. పరిశీలనలో అది యొక్కటే వైద్యుని గ్రహణశక్తికి లొంగనిదిగా మిగిలిపోయి దాగి యుండును.

**సూత్రము 212:** వ్యాధిచే మార్పు చెందిన స్వభావ మందలి ప్రత్యేకత, మానసిక లక్షణమనున దొక్కటే ప్రత్యేకముగా శ్రద్ధ వహింపవలసిన అంశము, ఆరోగ్యవంతునిపై ప్రయోగము చేసినపుడు వాని స్వభావ వైఖరిలో మార్పు కలిగింపని దేదియు సరియైన ఔషధములలో నుండదు. ఈ మార్పును ప్రతి ఔషధము తన ప్రత్యేక పద్ధతిలో కలిగించును.

**సూత్రము 213 :** రోగిలో పుట్టిన మిగిలిన వేదనలతో పాటు ఈ స్వభావ వైఖరిలో మార్పును తప్పక గుర్తుపట్టవలెను. అతనిలోని మిగిలిన వేదనలను

తొలగించుటకు సారూప్యౌషధము నెన్నుకొనుటలో ఈ మార్పును గూడ కలిగించు మందునే ఎన్నుకొనవలెను. లేనిచో ఎన్ని వేదనలను వైద్యము చేసినను వ్యాధి నివారణము జరగదు.

## మానసిక వ్యాధుల చికిత్స

**సూత్రము 214 :** ఇక మానసిక వ్యాధుల వైద్యమును గూర్చి చెప్పవలసిన అంశము లెక్కువ యుండవు. వానిలోగూడ నిదే విధాన మవలంబింపవలెను. అనగా మిగిలిన వేదన లన్నిటితో పాటు రోగికి కలిగిన వికార వైఖరిని గుర్తించి ఆ వికారమును కలిగించు శక్తితో గూడిన ఔషధమునే ఎన్నుకొనవలెను.

**సూత్రము 215 :** మానసిక వ్యాధులు, ఆవేశముల వ్యాధులు కూడ భౌతిక దేహవ్యాధుల కన్న నే విధముగను భిన్నములు కావు. కాగా మిగిలిన వ్యాధులందువలెనే వీని యందును మిగిలిన వేదనలతో పాటు మానసిక వికారము వైఖరికూడ పుట్టును. కాలక్రమమున రోగియందలి శక్తి తగ్గుచున్న కొలదియు వేదనలను ప్రకటించు శక్తి కూడ తగ్గును. దానితో వేదనలు నీరసించును. మానసిక వైఖరి యందలి వికారముకన్న మిగిలిన వేదనలు ముందుగా నీరసించినపుడు ఆ మిగిలిన మానసిక వికారము మొక్కటే

పాక్షిక వ్యాధిగా నిలచియుండును. అట్టి వ్యాధులే మానసిక వ్యాధులు.

**సూత్రము 216 :** ఒక్కొక్కప్పుడు భౌతిక శరీరమునకు సంబంధించిన దీర్ఘ వ్యాధి ప్రాణహరణమునుకలిగించు తీవ్రమైన తరుణవ్యాధిగా ముదిరినపుడు మానసిక వ్యాధియైన ఉన్మాదముగనో, చిత్తభ్రమగనో, పూర్తిగా పిచ్చిపట్టుటగనో మారిపోవుట గమనింపగలము. ఉపిరి తిత్తులలో వ్రణము, చీముపట్టుట మున్నగు దుష్పరిణామ ముల తోడి తీవ్రతతో కలిగినపుడు ఇట్లు భౌతిక వ్యాధి మానసిక వ్యాధిగా మారి తాత్కాలికముగా ప్రాణరక్షణము చేయును. ఈ మార్పు వలన భౌతిక దేహమునకు సంబంధించి, నంతకు ముందున్న వేదలన్నియు విపత్కర స్థితి నుండి తిరుగుముఖము పట్టి ఒక్కొక్కటే మాయ మగును. చివరకు భౌతిక దేహమునకు పూర్తి ఆరోగ్యము, దృఢత్వము సిద్ధించును. అనగా అవి నివారణమగునని అర్థము కాదు. గమనికకు రానంతగా సన్నగిలిపోవును. నిరంతరము లోతుగా పరిశీలింపగల నిపుణుడైన వైద్యునకు మాత్రమే గోచరించునంతగా నుండును. ఈ విధముగా పై చెప్పిన వ్యాధులు పాక్షిక వ్యాధులుగా మారిపోవును. రోగికి మొట్టమొదట అనారోగ్య మేర్పడిన నాటినుండియు కలిగిన మానసిక పరిణామము మొదట స్వల్పముగా

నుండును. అదియే రానురాను పెరిగి పెద్దదై ప్రధాన వ్యాధియైన ఉన్మాదముగా నాక్రమించి మిగిలిన భౌతిక వేదలన్నియును దానికి తావిచ్చి మాయమగును. ఒక విధముగా రోగి యొక్క భౌతికావయవముల ప్రవర్తన లన్నియు మానసిక కక్ష్యలోనికి మార్పుజెంది మనస్సునకు, ఆవేశమునకు, ఆత్మకు సంబంధించిన అవయములుగా పరిణామము చెందును. ఇవి భౌతిక దేహభాగములను మాత్రమే పరిశీలించు వైద్యుని బుద్ధికు అంతుపట్టవు.

వివరణము : వ్యాధి విజ్ఞానమున నిదియొక విచిత్ర పరిణామము. దీనిని గమనించినవారు పాశ్చాత్య వైద్య దర్శనమునకు సంబంధించినవారిలో హానిమన్ తప్ప మరియొకరు ఈనాటి వరకును లేరు. ప్రాచీన భారత, ఈజిప్టు, ఛాల్డియా శాస్త్రజ్ఞులలో మాత్రము కొందరు శాస్త్రజ్ఞులు దీనిని గమనించినట్లు ఈ శాస్త్ర గ్రంథముల వలన తెలియుచున్నది. ఆయుర్వేద ద్రష్టలైన ప్రాచీన ఋషులు ఈ విపరిణామమును, దీని చికిత్సను సమగ్రముముగా నెరిగినవారు, భూతగ్రహోన్మాదము, గ్రహావేశము, బాలగ్రహ చికిత్స మున్నగు శీర్షికలలో వీనిని గమనింప తగును.

సోరా మొదలగు విపాక వ్యాధులు దేహము నాక్రమించిన తరువాత భౌతికములైన అవయవములలో

క్రమముగా మార్పు కలుగును. అవి భౌతిక వ్యాధులుగా పరిణమించిన తరువాత వాని ప్రభావమున దేహధాతువులు క్రుళ్ళి విపత్కరము లగును. న్యూమోనియా, ఉపిరి తిత్తులలోని వ్రణము, గుండెజబ్బు, లివరు పాడగుట, ఎముకలు క్రుళ్ళి వానిలో వ్రణములు, చీము చేరుట మున్నగు పరిస్థితులతో రోగి సామాన్యముగా చనిపోవును, అట్లుగాక కొన్ని దేహతత్త్వములలో మనస్సు క్రమక్రమముగా చెడిపోయి పిచ్చెక్కి భౌతికధాతువులు బాగుపడును. కాలక్రమమున పిచ్చి యెక్కువై భౌతిక దేహము నిర్దుష్టముగను, దృఢముగను తయారగును. వారు మిగిలిన ప్రపంచముతో మానసిక సంబంధము తెగిపోయి తమ లోకములో తాము జీవింతురు.పరిసరములతోను, వ్యక్తులతోను మనస్సునకు సంబంధము ఉండి లేకుండటయో, పూర్తిగా లేకుండటయో జరుగును. వ్యాధి భౌతిక కక్ష్య నుండి ప్రజ్ఞామయ కక్ష్యకు పూర్తిగా రవాణా చేయబడును. వ్యాధి ప్రారంభదశలో అనేక వేదనలలో నొకటిగా నున్న మానసిక వికారము ప్రాధాన్యము వహించి రోగి నెుత్తము నాక్రమించి మిగిలిన వానిని సుడిగుండమువలె తనలోని కిమిడ్చుకొనును.

ఈ స్థితినే ఆయుర్వేద శాస్త్రజ్ఞులు భూతము, లేక గ్రహము అనిరి. (చనిపోయినవారు భూతము లగుదురని

చెప్పుకొను సందర్భమునకును, ఆయుర్వేదమున చెప్పబడిన ఈ భూతములకును సంబంధములేదు) ఆయుర్వేద శాస్త్రము ప్రకారము ఇట్టి వ్యాధులలో భూతములు, గ్రహములు, యక్షములు, రాక్షసులు, పిశాచములు, బాల గ్రహములు, కుమారీ గ్రహములు, మారీ గ్రహములు, గంధర్వములు మున్నగు వర్గీకరణము, వానికి వేరు వేరు చికిత్సలును గలవు.

**సూత్రము 217:** ఇట్టి వ్యాధుల నివారణమునకు సిద్ధపడుటకు ముందు వ్యాధి మొత్తముతో పరిచయము చేసికొనవలసిన ఆవశ్యకత ఎంతో గలదు. రోగియందలి భౌతికవేదనలను (ఉన్నవానిని, మాయమయిన వాని చరిత్రను) సూక్ష్మముగా పరిగణనము చేయవలెను. మానసిక వికారము యొక్క ప్రత్యేకతను పట్టుకొనవలెను. దానివలననే అతని మనస్సున ప్రవేశించిన వేదనా వికారము బోధపడును. దాని యాధారముననే సారూప్యమును సాధించి ఔషధమును నిర్ణయించినచో మొత్తము వ్యాధి నివారణమగుటకు అవకాశమున్నది.

**సూత్రము 218:** రోగికి వ్యాధి పాక్షిక రూపము ధరించి పిచ్చిఎత్తుటకు ముందర ఎట్టి పరిస్థితి యున్నదో, అప్పటి భౌతిక వేదనల లెట్లుండునో, మానసిక వేదన లెట్లుండునో,

అవి క్రమముగా నెట్టి పరిణామమును చెందెనో గ్రహించుటకు ప్రయత్నింపవలెను.

**సూత్రము 219:** ఆ ప్రారంభదశలో నుండి యున్న వేదనలలో కొంత భాగము మిగిలిపోయి ఉన్మాదస్థితిలో గూడ చూచాయిగా గోచరించుచునే ఉండును. గమనికకు రానంత సూక్ష్మములుగా నుండును. ఉన్మాదస్థితి ముదిరిన తరువాత గూడ అప్పుడపుడు కొంతకాల ముపశమనము కలిగిన దినములలో ఆ మొదటి లక్షణములు మరల స్పష్టముగా కనిపించుచునే యుండును.

**వివరణము :** పిచ్చెక్కి ముదిరిన వానికి ఏవో చెప్పలేని కొన్ని కారణములచేత మనసునకు మామూలు పరిస్థితి ప్రవర్తనము అప్పుడపుడు కలుగుచుండును. కలిగి కొన్ని దినములుగాని, వారములుగాని యుండవచ్చును. కొన్ని మాసములలో, సంవత్సరములో పిచ్చి తగ్గిన స్థితిలో మామూలుగా నున్నవారు కూడా కలరు. అట్టి సమయములలో మరల మొదటి భౌతిక శరీర వేదనలు బయటపడును.

**సూత్రము 220 :** వైద్యుడు సూక్ష్మముగా, విరామముగా ఇట్టి రోగులను పరిశీలించుట యొక్కటే చాలదు. రోగియొక్క బంధుమిత్రాదుల పరివారము గమనించిన సూక్ష్మ విషయములను, రోగి పూర్వ చరిత్రను కూడ

శ్రద్ధతో సేకరించుకొనవలెను. ఈ మొత్తము నుండి వ్యాధి స్వరూపమును నిర్మాణము చేయవలెను. అట్లు స్పష్టమైన స్వరూపము నుండి మానసిక వికారములకు ప్రాధాన్యమిచ్చి ప్రత్యేక వేదనలను పట్టుకొని వాని సారూప్యమునందు ప్రాముఖ్యము కలిగిన మందుతో వైద్యము చేయవలెను.

**సూత్రము 221 :** కొందరికి తీవ్రమగు భయము, మనసు విరిగిపోవుట మున్నగు ఆకస్మిక కారణముల వలన తాత్కాలికముగా పిచ్చెక్కును. కొందరికి మద్యము నెక్కువగా సేవించుట వలన కూడ కలుగును. ఈ పిచ్చి తీవ్రమైన తరుణ వ్యాధియేగాని దీర్ఘవ్యాధి కాదు. అయినను తెరవెనుక సోరా లేనిచో నిది సంభవించదు. సోరా యున్నను కట్టెల నుండి మంట లేచినట్లు సోరా కారణములు గుప్పున అంటుకొనిన ఈ ఉన్మాద స్థితులను తరుణవ్యాధులుగనే భావించి చికిత్స చేయవలెను. పై చెప్పిన ఉన్మాదములతో వీనిని జతపరచరాదు. ఇట్టి తరుణోన్మాద రోగులకు సోరాను ప్రతిఘటించు మందులు వాడరాదు. మిగిలిన మందులలో ఆ తాత్కాలిక స్థితికి సారూప్యము చెందిన వానినే ఎన్నుకొనవలెను. (ఉదాహరణకు : ఎకొనైట్, బెల్లడోనా, స్ట్రామోనియం,హైయోస్యామస్,మెర్క్యురి మొదలగు వానినే వాడవలెను). ఈ మందులను మిక్కిలిగా సూక్ష్మీకరణము చెయ్యబడిన మోతాదులను వాడినచో సారూప్యము అగు

తాత్కాలిక వ్యాధి ఉపశమించును. అటుపైన వారియందలి మంటలు చల్లారి మరల సోరా అంతర్వాహినిగా సద్దుకొనును. రోగి పూర్తిగా ఆరోగ్యవంతునివలెనే కోలు కొనును.

వివరణము : ఇట్టి వ్యాధులలో పై చెప్పిన బెల్లడోనా మున్నగు మందులను 10M, 50M, CM మొదలగు మోతాదులలో వాడినచో గాని ఈ వ్యాధులు లొంగవు. 30, 200 మున్నగు పొటెన్సీలలో వాడినచో భయంకరమైన ఉద్రేక పరిణామములు సంభవించును.

**సూత్రము 222:** ఇట్లు చికిత్స పొందిన తరుణవ్యాధులైన ఉన్మాదముల నుండి బయట పడిన వానిని వ్యాధి నివారణ చెందినవానిగా మాత్రము భావించి బద్దకించరాదు. వానిలోని సోరావ్యాధి మరల అంతర్గతముగా నిలిచి పోయినదేగాని ఏనాడయినను మరల గుప్పున పై కుబుకవచ్చును. కనుక సోరాను ప్రతిఘటించు తీవ్ర ఔషధములతో దీర్ఘ కాలము వేటాడి అతని సోరాను నిశ్శేషము చేయవలెను. అటుపైన అతడు ఆహార విషయమునను, పథ్యపానముల విషయమునను పరిమితిని పాటించినచో అంతకుముందు కలిగిన ఉన్మాద పరిస్థితి వంటివి మరెప్పుడును కలుగవు.

వివరణము: పధ్యపానాది విషయములలో పరిమితిలో నుండుట యనగా పూర్వము తన పిచ్చికి తాత్కాలిక కారణములుగా పనిచేసి యున్న మద్యపానము, నిద్రమేల్కొనుట, అహోరాత్రములు చీట్లపేకాడుట మొదలగువానిని మరల చేయకుండుట.

**సూత్రము 223:** ఇట్లు సోరా వైద్యములో లోపలి దీర్ఘ వ్యాధిని నిశ్శేషముగా హతమార్చక ప్రశాంత పరిస్థితి కలిగినంతనే వైద్యమును విడచిపెట్టినచో నేమగునో తెలియునా? శీఘ్రకాలములోనే పరిసర కారణముల ప్రభావమేది కలిగినను మరల పిచ్చెక్కును. ఈమారు మొదటికన్న నుద్రేకముగా సంభవించి ఎక్కువ కాలముండును. ఇట్టి ఉజ్వల పరిస్థితుల ప్రభావమున రోగియున్న దినములలో అవకాశము తీసికొని లోపలి సోరా విజృంభించి బలము పుంజుకొనును. అటుపైన వ్యాధి బల మెక్కువగుటవలన రెండు విధములైన పరిస్థితులు సంభవించును. ఈ రెండవమారు నివారణమైనను తరచుగా మాటిమాటికి ఉన్మాద స్థితులు కలిగి తగ్గుచుండుటైన సిద్ధించును. లేదా ఈమారు నివారణకు లొంగక పిచ్చియే స్థిరముగా నిలిచిపోవచ్చును.

**సూత్రము 224:** ఒక రోగికి కలిగిన మానసిక వ్యాధి

అతని శరీర తత్త్వమునకు సంబంధించిన సౌరా వ్యాధిలో భాగమై యున్నదా లేక తాత్కాలిక కారణములైన విద్యా వ్యాసంగ దోషములు, దుష్టములైన అభ్యాసములు, అవినీతి ప్రవర్తనము, మానసిక ఆవశ్యకతలను నిర్లక్ష్యము చేయుట, అజ్ఞానమును కప్పిపుచ్చుట మున్నగువానివలన మాత్రమే కలిగినదా అని విడమరచి చూచుకొనుట తప్పదు. బాధ్యత గల స్నేహితుల సాంగత్యము కలిగించుట, మనస్సును తృప్తిపరచు సంభాషణాదులలోనికి దింపుట, చక్కని సలహాల నిచ్చుట, విషయములను తిన్నగా విడమర్చి చెప్పుట మున్నగు పద్ధతులతో పూర్తిగా నివారణమైనచో అది కేవల తాత్కాలిక వ్యాధియనియు, పరిసర కారణములచే మనసున పుట్టినదనియు గ్రహింపవలెను. ఇట్టి పద్ధతులతో తగ్గక పెరుగుచున్నచో రోగి దేహ తత్త్వమందలి వ్యాధిలో భాగమని గుర్తింపవలెను. దానికి పరిసర కారణములు తోడయినప్పుడెల్ల అది ముదురుచుండును. ఈ కారణములకు గురియైనపుడెల్ల ఉత్సాహహీనుడు మరింత విరిగిన మనస్సుకలిగి ఎవరితోను ప్రసంగములలో కల్పించుకొనక, ఒంటరితనము పెంచుకొనుచు నానాటికి పరిసర వ్యక్తులయం దయిష్టత, పగ పెంచుకొనుచు విడివడి ఏకాంతములోనికి పోవును. అట్లే ద్వేషపూరితమైన ఆ వేగము కలవాడు ఎక్కువ

దుర్భాషలు పెంచుకొనుచు బుద్ధిహీనముగా వాగుట, తిట్టుట, కలహములలోనికి తెగబడుట చేయును.

వివరణము: ఎ) సోరా లేనివాని కెట్లును చిత్తభ్రమలవంటి వ్యాధులు కలుగనే కలుగవు. ఈ సోరా రెండు విధములు: ఒకటి అంతర్గతము, రెండవది బహిర్గతము. అంతర్గతమైనది ఏ వ్యాధి రూపము చెందక జీవితముతో కలసి లోపల ప్రవహించుచుండును. వాని పరిసరములు, అలవాట్లు కల్లోలితము లైనపుడు అది తాత్కాలికముగా గుప్తమను చుండును. ఇట్లగుటకు కారణములు చెప్పబడినవి.

విద్యావ్యాసంగ దోషములు: ఒక విద్యార్థి వైద్యశాస్త్రము చదువుటకు తగినవాడై ఉత్సాహపడుచుండగా వాని తల్లిదండ్రులు పట్టుదలకో, ఇతరులపై పోటీకో వానిని ఇంజనీరింగు విద్యలో పెట్టుట మున్నగు కారణములు.

దుష్టములైన అభ్యాసములు: మతపరములు, రాజకీయములు, ప్రభుత్వ వ్యతిరేకములు అగు కుట్రలలోను, రహస్యాలోచనయందును, హత్యాప్రయత్నములు, ఎదుటవారిని కోర్టుకీడ్చుట, దొంగ కరెన్సీ తయారుచేసి ప్రజలలోని కెక్కించుట, దోపిడీలు చేయుట మున్నగు నభ్యాసములు.

అవినీతి ప్రవర్తనము : మానసిక, శారీరక వ్యభిచారము, త్రాగుడు, జూదము మున్నగునవి.

మానసిక ఆవశ్యకతలను నిర్లక్ష్యము చేయుట : పిల్లలను క్రీడలకు, విద్యార్థుల పోటీలకు, వినోద ప్రయాణములకు, లలితకళా ప్రదర్శనములకు, షికారునకు, నదీ పర్వతాదులను చూపించుటకు, తీర్థక్షేత్ర యాత్రలకు కొనిపోకుండ నింటిలో కూర్చుండి చదువుకొమ్మని గద్దించుట మున్నగునవి. అట్లే పెద్దలు ఏ వినోదము లేక ధనార్జనము, ప్రమోషనుకై వేటాడుట మున్నగు పరిస్థితులలో యావజ్జీవము గడపుట.

అజ్ఞానమును కప్పిపుచ్చుట : పిల్లలకు కామ శాస్త్రమును గూర్చియు, స్త్రీ పురుష సంబంధమున నభ్యసింప వలసిన ఆరోగ్యశాస్త్రము, నీతిశాస్త్రములను గూర్చియు, మృత్యువును గూర్చియు వివరింపకుండ పెంచుట, అడిగినపుడు కోపించి శిక్షించుచుండుట మున్నగునవి.

బి) రోగియందలి సోరా యొక్క వ్యాధిరూపమున విజృంభించి యున్నవారిలో మానసిక వేదనలు ఉండును. అవి ముదిరి పాక్షిక వ్యాధియైన పిచ్చిరూపమున పరిణమించినవి రెండవ తరగతికి చెందినవి. ఈ

వ్యాధులలో మంచివారి సాంగత్యము, సలహాలు, ప్రోత్సాహము మున్నగునవి రోగియొక్క పిచ్చిని ఉపశమింప చేయుటకు చాలవు.

**సూత్రము 225:** ఇట్లు దేహతత్త్వమందలి వ్యాధికి సంబంధించని మానసిక రోగములు గలవు. అట్లే మానసిక వ్యాధులకు సంబంధించని దేహ అనారోగ్యములు కూడ కలవు. దేహము కొంచెమలసట చెందిన స్థితిలో తాత్కాలికముగా అనారోగ్య ముండును. అది కలవారికి పరిసర కారణములవలన దిగులు, ఆత్రత, విసుగుదల, ఇతరులవలన జరుగు తప్పులు, భయపడుట, ఆందోళన మున్నగునవి నిరంతరముగా వర్తించుచున్నచో వారి దేహారోగ్యముచక్కబడదు. ఈ మానసిక కారణముల నిరంతరత్వము కాలక్రమమున వారి దేహారోగ్యమును ధ్వంసము చేయును.

వివరణము : సోరా దేహమునందు బహిర్గతముగా గాని, అంతర్గతముగా గాని లేని ఆరోగ్యవంతులకు కూడ నొక్కొక్కప్పుడు అధికశ్రమ మున్నగు కారణముల వలన తాత్కాలికముగా దేహము దెబ్బతినవచ్చును. వారికి పరిసరములలో మనస్సును కష్టపెట్టుట, శ్రమపెట్టుట మున్నగు ప్రభావముగల వాతావరణ కారణము లున్నచో సోరా ప్రమేయము లేకయే దేహారోగ్యము చెడిపోవును.

పోరా లేవంత మాత్రమున ఆరోగ్యవంతులు ఎట్లు ప్రవర్తించినను నష్టము లేదని భ్రమపడుట కూడదని ఇందలి హెచ్చరిక.

**సూత్రము 226:** ఇట్టి ఆరోగ్యవంతులకు తాత్కాలికముగా కలిగిన మానసికోద్రేక వ్యాధులే చికిత్సతో సంబంధములేక, దేహారోగ్యమును చక్కబెట్టు మందులతో సంబంధము లేక మంచి వాతావరణము పుట్టించుటతో బాగుపడుట సులభముగా జరుగును. ఉత్సాహమును, ఆత్మ విశ్వాసమును కలిగింవ గలిగినచో కొన్ని నివారణమగును. అట్లే మిత్రధర్మము నందలి ప్రేమాదరములు చూపుటవలన కొన్ని, చక్కగా బోధపడునట్లు సలహాలిచ్చుటవలన కొన్ని చక్కబడును. ఒక్కొక్కప్పుడు సదుద్దేశముతో మోసము చేయుటవలన కూడ కొన్ని నివారణమగును.

**వివరణము:** మోసము కూడ నొక్కొక్కప్పుడు మానసిక వ్యాధుల వారిని చక్కబరచుటకు కావలసి వచ్చును. పెండ్లి ఆలస్యమై మానసిక విషాదముతో మనసు విరిగిపోయిన స్త్రీని ఒక మిత్రుడు చక్కని పెండ్లి సంబంధ మున్నదని బొంబాయికో, ప్యారిస్‌కో గొనిపోవును. ఇట్లు వాతావరణము మార్చుటవలన మనసు బరువు తగ్గును. వెళ్లినచోట

మిత్రుడు ప్రయత్నములు చేయుచున్నట్లు ఆమెను త్రిప్పుటవలన మరికొంత మారును. మరియొక మిత్రుని పట్టుకొని ఆమె ప్యారిస్‌లో నాట్యవిద్య నభ్యసించినచో పెండ్లి చేసుకొందునని చెప్పించును. అప్పుడామెను మాళవికవంటి ఉపాధ్యాయిని దగ్గర నాట్యము నేర్చుకొనుటకు ప్రవేశపెట్టుదురు. దానితో నొకటి రెండు సంవత్సరముల విద్యాభ్యాసమున మానసిక గతియు, జీవితగతియు సంపూర్ణారోగ్యవంతములుగా మారును.

**సూత్రము 227:** ఇట్టి రోగుల విషయమున కూడ సోరా లేదని చెప్పరాదు. ఉండును గాని విజృంభణస్థితి చెందియుండదు. చెందకుండ జాగరూకత వహింపవలెను. కనుక నిట్టి రోగులకు కూడ నివారణ కలిగిన తరువాత సోరాను వ్యతిరేకించు మందులతో వైద్యము పూర్తిచేసినచో మరల అట్టి స్థితులు కలుగవు.

**సూత్రము 228:** ఇవి కాక దేహారోగ్యము చెడిన సోరా వ్యాధులలో కనిపించు మానసిక బాధలు కబుర్లతో నివారణము కావు. సోరాను పోగొట్టు మందుల వైద్యముతో పాటు క్రమబద్ధమైన జీవన విధానము వారికి జోడింపవలెను. వైద్యుడును, రోగియొక్క పరివారము, రోగి యెడల ప్రవర్తించు విధానము కూడ చాల నియమబద్ధముగా

నుండవలెను. నివారణమునకు అనుకూలమైన మానసిక బలమును సమకూర్చవలెను. భీకరమైన ఉన్మాద చిత్తము నెదుర్కొనుటకు ప్రశాంతము, ప్రసన్నము, నిశ్చలము అగు ప్రవృత్తి చూపవలెను. దీనముగా ఏడ్చుచు నిరాశ చెందుచున్న రోగికి నిశ్శబ్దము, మౌనముతో కూడిన జాలి చూపులను ప్రదర్శింపవలెను. అర్థములేని వాగుడు గల రోగికి నిర్లక్ష్యము లేనట్టి మౌనము చూపవలెను. అసహ్యకరము, హేయము అగు ప్రవర్తనముగల వారికిని, బూతులు, తిట్లు ప్రదర్శించు రోగికి పూర్తిగా నిర్లక్ష్యభావము ప్రదర్శింపవలెను. పరిసర వస్తువులను పాడుచేయుట, వ్యక్తులను గాయపరచుట లేకుండునంత వరకు గట్టిగా నివారణము చేయవలెను. అప్పుడుకూడ రోగి చేష్టలకు దెబ్బట, ఎత్తిపొడుచుట, నిందించుట చేయరాదు. అవలంబించు విధానమున రోగిని భౌతికముగా శిక్షించుట, బాధించుట మున్నగు పద్ధతుల ఆవశ్యకత లేకుండునట్లు చూడవలెను. ఒక్క ఔషధ ప్రయోగము చేయునపుడు మాత్రమే బలాత్కారము ఆవశ్యకము కావచ్చును. అదిగూడ స్వల్పమై తియ్యదనము కలిగియుండుట వలన నొక్కొక్కపుడు రోగికి తెలియకుండగనే నీటిలోగాని,

పాలలోగాని కలిపి త్రాగించినచో బలాత్కారమును పరిహరింప వచ్చును.

**సూత్రము 229 :** అంతేగాని ఎదిరించుట, వాదించుట, ఆత్రతతో గద్దించి వివరించుట, తప్పులెన్నుట, నీతులరచుట చేయరాదు. భయపడుట, రోగి చేసిన వానికి లొంగుట, దౌర్బల్యము ప్రకటించుట అసలే చేయరాదు. ఇట్టి ప్రవర్తన చూపువారు రోగుల విషయమున పీడాకరములైన రోగముల వంటివారు. ఈ జాతికి చెందిన రోగులకు మానసిక జాగరూకత హెచ్చుగా నుండును. ఎట్టి మోసము, ద్రోహచింత, కపటమునైనను వారు గుర్తుపట్టగలరు. గుర్తుపట్టి రెచ్చిపోవుదురు. వారి నెల్లపుడును నమ్మిచరించుచున్నట్లు ప్రవర్తించి మాత్రమే వారిని నమ్మించుట సాధ్యము. వైద్యుడును, సంరక్షకుడును అట్లే ప్రవర్తింపవలెను.

వీలయినంతవరకు రోగి మనస్సునకును, ఇంద్రియములకును విభేదము పుట్టించు పరిసరాంశములను లేకుండ చేయవలెను. వ్యాధిపీడితమైన దేహమును కారాగారమున రోగమను సంకెళ్ళతో బంధింపబడి జాలిగా నేడ్చుచు ఆయాసపడువారు గదా వీరు! మనకువలె వారికి కాలక్షేపమునకై సాధనములు లేవు. మబ్బులు క్రమ్మినట్లున్న

వారి యాత్మలకు వినోద సాధనలు లేవు. వాంఛనీయ ములైన సత్కాలక్షేపములు లేవు. సద్బోధనము పొందుటకు మార్గములు లేవు. సంభాషణలతో విశ్రాంతి పొందుటలు లేవు. గ్రంథ పఠనములు లేవు. వారి దేహారోగ్యము చక్కబడుటతో గాని నిశ్చలత్వము, ప్రశాంతి అను కిరణములు వారి మనస్సులపై ప్రసరింపవు.

**సూత్రము 230:** ఇట్టి మానసిక రోగులకు వినియోగపడు ఔషధములు సోరాను హతమార్చగలిగినవి ప్రకృతిలో లెక్కకు మిక్కిలిగా నున్నవి. వానిని ఆత్మశుద్ధితో గుర్తింపవలెను. వాని ప్రభావములను చిత్తశుద్ధితో గ్రహింప వలెను. సరిపోయిన ఔషధమును వెదకి నిర్ణయించుటలో అలసటలేని, విసుగు విరామములేని అన్వేషణము కావలెను. మానసిక వ్యాధులుండుట వలన వాని నాధారముగా గొని అన్వేషించుట మిగిలిన వానికన్న తేలిక. రోగియందుండు ప్రధాన లక్షణమును మొదటగా గుర్తింపవలెను. ఈ పద్ధతిలో వైద్యము చేసినచో ఆరోగ్యాభివృద్ధి చాల తక్కువ కాలమున జరుగును. వాని లక్షణమునకు సరిపడని మందులను ఎక్కువ మోతాదులలో మాటిమాటికి ప్రయోగించుచు రోగికి ప్రాణము కడబట్టింప నక్కరలేదు. ఈ సారూప్య వైద్యవిధానము, సుదీర్ఘమైన మానసిక వ్యాధులలో పనిచేసినంత సులువుగా నితర విధానమేదియు

పనిచేయలేదని నేను నా అపారమైన అనుభవముపైగల అచంచల విశ్వాసముతో నుద్ఘోషించుచున్నాను.

## పర్యాయవ్యాధులు

**సూత్రము 231:** పర్యాయవ్యాధు లనగా నొకే కాలవ్యవధిలో మరల మరల కలుగుచుండు వ్యాధులు. వీని విషయమున ప్రత్యేక పరిశీలనము ఆవశ్యకము. అనేక విధములైన వరుస జ్వరములు మున్నగునవి ఈ జాతికి చెందును. అప్పుడపుడు తిరుగబెట్టుచుండు పలువిధములైన బాధలు గూడ నీ తరగతికి చెందును.

వివరణము: మలేరియా మున్నగు జ్వరములు వరుస జ్వరము లనబడును. ఇవి ప్రతిదినము గాని, రోజు విడచి రోజుగాని, వారమున కొక్కమారుగాని వచ్చుచుండును. పార్శ్వపు నొప్పులు నీ తరగతికి చెందినవి కావు. స్త్రీలకు ఋతు సంబంధమైన బాధలున్నచో అవియు నిట్టివే. కొందరికి ప్రతిసంవత్సరము అదే ఋతువున, అదే జబ్బు చేయును. కొందరికి అవే దినములలో, తేదీలలో జ్వరాదులు కలుగును. ఇవన్నియు నీ తరగతికి చెందును. వీని నివారణము కష్టము. నివారించితిమని చెప్పుకొను తావులలో అణచిపెట్టుట ఎక్కువ యుండును. కనుక

ప్రత్యేక పరిశీలన మావశ్యకము.

**సూత్రము 232:** వీనిలో అసంఖ్యాకములగు వ్యాధులు గలవు. అన్నియు దీర్ఘవ్యాధుల జాతికి చెందినవే. అందు చాల భాగము సోరా విజృంభణ ఫలితములే. అరుదుగా సిఫిలిస్ కూడ పెనవైచుకొని యుండును. అందు మొదటివానిని సోరా మందులతోనే నివారింపవచ్చును. రెండవ వానిని సిఫిలిస్ మందులతో పర్యాయము చేసి వాడుటచే నివారింపవచ్చును. ఈ విధానము 'దీర్ఘవ్యాధు' లను నా గ్రంథమున నుపదేశింపబడినది.

**సూత్రము 233:** ఈ జాతికిచెందిన వానిలో జ్వరముతో కూడినవి, జ్వరము లేనివి కూడ గలవు. ఇందు మార్పులేనట్టి యొకే విధమైన లక్షణములతో గూడిన రుగ్మత మరల మరల వచ్చి నివారణ మగుచుండును. దాదాపు ఒకే కాలపరిమితి వ్యవధానమున కలుగుచుండును. అనగా వ్యవధాన కాలము నిర్ణీతమై యుండును. ఆ నడిమి కాలమున అతడు ఆరోగ్యవంతునిగనే కనిపించుచుండును. ఇట్టివి అసంఖ్యాకములుగా నున్నవి.

**వివరణము:** మలేరియా వంటివి జ్వరముతో కూడినవి. పార్శ్వపు నొప్పుల వంటివి, స్త్రీలలో ఋతుబాధలు జ్వరముతో సంబంధములేనివి. ఇవి కలిగినపుడు

బాధపడినను కలుగని సమయములలో రోగి ఆరోగ్య వంతునిగనే తిరుగుచుండును. మలేరియా వచ్చినపుడు చలి, వణుకు, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, నడుమునొప్పి, జ్వరము, వాంతులు, తాపము, మూలుగు, చివరకు చెమటలు, నీరసము మున్నగు లక్షణములన్నిటితో బాధపడును. తగ్గిపోయినంతనే మరల సంభవించు లోపున మామూలుగనే తిని తిరుగుచుండును.

సూత్రము 234: ఇట్టివి ఆకస్మికముగనో, సాంక్రమికముగనో సంభవింపవు. వీనిలో జ్వరము ప్రసక్తి లేనివి దీర్ఘవ్యాధులై యుండును. సూటిగా సోరాకు సంబంధించినవి, సిఫిలిస్‌తో సంబంధము లేనివి అయి ఉండును. వీని చికిత్స గూడ నింతకు ముందు వివరింపబడిన విధముననే యుండును. కాని యొక విశేషము మాత్రమున్నది. వాడుచున్న మందుతోపాటు దాని మోతాదుల నడుమ వ్యవధాన కాలములో నెప్పుడో ఒక్కొక్కమాటు సింకోనా చెట్టు బెరడు రసమును మిక్కిలి సూక్ష్మమైన మోతాదులో వాడవలసి యుండును. వాడినచో వాని వరుసక్రమము భగ్నమై తొలగిపోవును.

వివరణము : సింకోనా అనగా క్వినైన్ లేక క్వయినా మందు. దీనినే హోమియోపతీ వారు 'చైనా' అని కూడ

వ్యవహరింతురు. దీనిని మిక్కిలి హెచ్చు పొటెన్సీలో నొకటి రెండు మోతాదులను వాడినచో వ్యాధి యొక్క పర్యాయబంధము (periodicity) తొలగిపోయి వ్యాధి నివారణ సుగమమగును. ఇచ్చట చైనా యొక్క లక్షణ సారూప్యముతో వ్యాధి కెట్టి సంబంధము కలిగియుండ నక్కరలేదు. వ్యాధి నివారణకై వాడబడు ప్రధానౌషధము వేరు. అది వ్యాధితో సారూప్యముగల సోరా ఔషధము కావలెను. దాని మోతాదుల నడుమ గల వ్యవధానమున చైనా మోతాదు పెద్దపొటెన్సీలో, అనగా 10M, 50M, CM లలో నవసరమగు పొటెన్సీలో వాడవలెను.

ఇచ్చట సారూప్యములేనిదే చైనా వాడుట ఎట్లని సందేహము కలుగవచ్చును. సారూప్యము లేదనగా వ్యాధియొక్క చిల్లర వేదనలతో సారూప్యము లేదని అర్థము. ప్రధాన లక్షణమైన ప్రత్యేక వేదనతో చైనాకు తప్పనిసరిగా సారూప్యమున్నది. అది ఎట్లనగా చైనా పుట్టించు వ్యాధి గూడ ఈ రోగుల వ్యాధి వలెనే పర్యాయ బంధము అను లక్షణ సారూప్యము కలిగియున్నది.

**సూత్రము 235:** అంటువ్యాధులుగనో, ఆగంతుక ములుగనో సంభవించు వరుస జ్వరములలో (ఇవి మన్నెపు జ్వరములు కావు) ప్రతి రుగ్మత యందును రెండు పరస్పర వ్యతిరేక వేదనలు అనులోమముగను, విలోమముగను

వచ్చి పోవుచుండును. అనగా ప్రతి మలేరియా జ్వరము నందును వచ్చునట్టి వేదనలు పరస్పర విరుద్ధములైన జంటగా నుండును. ఈ జంట సవ్యక్రమముననో అపసవ్యక్రమముననో వరుస నేర్పరచుకొనును. మొదట చలి పుట్టి తరువాత వేడి పుట్టును. తగ్గునపుడు వేడి పుట్టి తరువాత చలి పుట్టును. ఇట్లే మూడు లక్షణములు కూడ వర్తించును (చలి, వేడి, చెమటలు). ఈ జ్వరములకు నిర్ణయించు ఔషధమునందు పై చెప్పిన క్రమమునకు సారూప్యముండవలెను. (అనగా వ్యాధిలో సంభవించు క్రమముననే మొదట చలి, వేడి, తరువాత వేడి, చలి పుట్టించు ప్రభావ ముండవలెను. లేదా మూడు లక్షణములున్న రోగికి చలి, వేడి, చెమట అను క్రమమును పుట్టించు మందు కావలెను) ఇది యొక పద్ధతి సారూప్యము, లేదా మరియొక పద్ధతిలో సారూప్యము సాధింపవలెను. అది ఎట్లనగా జ్వరము వచ్చినపుడు ఈ రెండు మూడు స్థితులలో నేది ప్రాముఖ్యము వహించుచున్నదో గమనింప వలెను. దాని నాధారముగా గొని ఆ యొక్క స్థితి యందలి చిల్లర వేదనలతో సారూప్యము సాధింపవలెను. ఇట్లు వాడుటకు నిర్ణయించు ఔషధము సోరా మందులలోనిది గాక సామాన్యౌషధములలో నొకటియై యుండును. ఇందు మరియొక విశేషము కూడ నున్నది. రోగ వ్యవధాన

సమయములలో రోగి ఆరోగ్యవంతుడుగా తిరుగుచు న్నపుడు వానియందు కనిపించు వేదనలను కూడ గమనించుకొని సారూప్యము సాధింపవలెను.

**సూత్రము 236:** ఇట్టి వ్యాధులలో ఔషధ ప్రయోగమునకు అనుకూలమైన సమయమును కూడ నిర్ణయించుకొనవలెను. ఒకమారు వ్యాధివచ్చి తగ్గిపోయిన వెంటనే వాడవలెను. అనగా జ్వర తీవ్రత తగ్గి, దాని తరువాత చెమటలు పోసి తగ్గి రోగి స్వస్థత చెందుచున్న నిమిషములలో వాడవలెను. దేహమునం దుద్రేకించిన విపరిణామము లన్నియు మరల తిరోగమించి యథాస్థానమునకు సద్దుకొనుచున్న సమయమది. దేహమున కల్లోలములుగాని, కలవరపాట్లుగాని సద్దుమణుగుచున్న సమయమది. అప్పుడు ప్రయోగించిన మోతాదు పుట్టించునట్టి సారూప్యమైన కృత్రిమవ్యాధి కూడ రాబోవు సహజవ్యాధి కాలపరిమితితో సరిపోయి దానితో నొకటిగా వర్తించు నదుపాయము ఉండును. ఈలోపున చక్కని కాల వ్యవధానము ఉండును గనుక ప్రాణశక్తి ఔషధగుణమును చేయూతగాగొని దేహమందలి అనారోగ్య స్థితిని చక్క బెట్టుట సుకరమగును.

**వివరణము:** మలేరియావంటి వ్యాధి ఒక మారు

విజృంభించి తగ్గిన కొద్ది నిమిషములలో సారూప్యౌషధమును వాడవలెను. ఇట్లు వాడుట వలన సదుపాయములు:

ఎ) దేహమున కల్లోల స్థితి ఉన్నపుడు మందువాడుటకన్న, కల్లోలము శమించిన వెనుక వాడినచో దేహము, మనస్సు, శాంత స్థితిలో స్వీకరించును.

బి) మందువలన పుట్టబోవు కృత్రిమ వ్యాధికిని, రోగిలో నున్న నైసర్గిక వ్యాధికిని సారూప్యమున్నది గనుక కాలపరిమితిలో గూడ సారూప్యము సిద్ధించును. ఆ రెండు వ్యాధులును మూడవనాడు ఒకేమారు వర్తించును. ఔషధ వ్యాధిని వేరుగా ననుభవింపకుండ సరిపోవును.

సి) రాబోవు జ్వరోద్రేకము లోపున కాలము గడువు వీలయినంత ఎక్కువ లభించును గనుక రోగిలోని ప్రాణశక్తి ఔషధ సహాయము నంది పుచ్చుకొని దేహమునందు వీలయినన్ని సద్దుబాట్లు చేయగలదు.

**సూత్రము 237:** కొన్ని క్లిష్టవ్యాధులలో రెండు విజృంభణములకు నడుమ కాలవ్యవధానము చాల తక్కువగును. మొదటి విజృంభణము నందలి కల్లోల పరిస్థితులు పూర్తిగా సమసిపోక ముందే రెండవ విజృంభణము ఆరంభించుట కూడ సంభవమే. అట్టి వ్యాధులలో మొదటి విజృంభణము చివర పుట్టు చెమట

మున్నగు చిట్ట చివరి వేదన జంకుచున్న క్షణములను కనిపెట్టి మందును ప్రయోగింపవలెను.

**వివరణము:** మలేరియా వ్యాధులు తీవ్రజాతికి సంబంధించినవైనను, చాలకాలము దేహామున ముదిరినవైనను రెండు విజృంభణముల తీవ్రత హెచ్చి, వానికి నడుమగల కాల వ్యవధానము తగ్గును. ఒకే దినమునగాని, కొద్ది గంటలలో గాని రెండు విజృంభణ ములు వర్తింపవచ్చును. అపుడు మొదటి విజృంభణ యందలి చిట్టచివరి వేదన జంకుట ప్రారంభింపగనే ఔషధమును ప్రయోగింపవలెను.

**సూత్రము 238:** తరచుగా నిట్టి వ్యాధులలో నొకే మోతాదు అటుపైని విజృంభణములను నిర్మూలించి ఆరోగ్యము చక్కబడుట జరుగుచున్నది. కొన్ని సందర్భములలో అట్లు జరుగుట లేదు. జరుగనపుడు మాత్రము ప్రతి విజృంభణము తరువాతను అదే మందు నొక్కొక్క మోతాదు వాడవలెను. విజృంభణముల యందలి వేదనా సముదాయము మారనంతవరకు అట్లే వాడవలెను. ఈ వాడుటలోగూడ ఆరోహణ క్రమమున కొంచెము పొటెన్సీ పెంచుచు వాడవలెను. అరుదుగా కొన్ని సందర్భములలో వరుస జ్వరములు తగ్గిపోయి ఆరోగ్యము చేకూరిన వెనుక చాల దినముల తరువాత మరల

కనిపించును. ఇట్టివి మన్యపు జ్వరములలో కనిపించును. రోగబీజము ఔషధశక్తికన్న లోతుగా నాటుకొని యుండుటచే చాలకాలము దాగి మరల విజృంభించును. ఇట్టి సందర్భములలో సుదీర్ఘకాలము మందులకును, వ్యాధులకును దేహమున పోరాటము పెట్టుటకన్న ఆ రోగిని మెట్ట ప్రదేశమునకు నివాసము మార్చుట శ్రేయస్కరము.

**సూత్రము 239:** శక్తిమంతమైన ఔషధ మేదయినను తన వేదనా సముదాయములో నొకటిగా జ్వరతీవ్రతను పుట్టించు లక్షణము కలిగియుండును. ఆ జ్వరము హెచ్చుట, తగ్గుటలో కొన్ని వేదనలు అనులోమము గను, విలోమముగను వర్తింపక తప్పదు. అనగా వచ్చిన క్రమమునకు అపసవ్య క్రమమున తగ్గు వేదనలు కొన్ని యుండును. దీనినిబట్టి వరుస జ్వరములను తగ్గించు సామర్థ్యము ప్రతి బలవత్తర ఔషధమునకు నుండును. ఇదిగాక ప్రతి మందునకు దాని ప్రత్యేక లక్షణములు వేరుగా నుండును. ఏ రెండు జాతుల చెట్లకును పూర్తిగా పోలిక లేనట్లు ఏ రెండౌషధములును పూర్తి సారూప్యమును కలిగి యుండవు. దీనినిబట్టి గుణ నిర్ణయము చేయబడిన ఔషధముల సంఖ్య పెరుగుచున్న కొలదియు అన్ని జాతుల వరుస జ్వరములకును నివారణ సాధ్యమగు చున్నది.

**సూత్రము 240:** పల్లపు ప్రదేశములలో, చిత్తడి నేలలలో నివసించు వారిలోకొందరికి సారూప్యౌషధము వాడినను వరుస జ్వరములు తగ్గి మరి కొంత కాలమునకు తిరుగబెట్టుట సూచింప బడినది. దీనికి పరిసర వాతావరణ కారణమున్నట్లు కనిపించినను అంతర్గతమైన సోరాయే ముఖ్యకారణము. కనుక వాతావరణము మార్చినను వైద్యము మానక వారికి సోరా మందులతో వైద్యము చేసి వ్యాధిని నిశ్శేషము చేయవలెను. అపుడెచ్చట నివసించినను వ్యాధి ప్రసక్తి యుండదు.

**సూత్రము 241:** సంక్రమించు లక్షణములు గల చలి జ్వరములను దీర్ఘ వ్యాధుల వలెనే పరిగణింప వలెను. వానికి తరుణవ్యాధి లక్షణములతో గూడిన ఒకే విజృంభణ ముండును. (మరల మరల వచ్చునట్టి లక్షణ ముండదు.) ఆ గాలి పాటునకు ఆ వ్యాధి సంక్రమించిన వారి కందరికిని అదే విధమైన విజృంభణ లక్షణ ముండును. వారందరికిని కలిగిన విజృంభణ యందలి వేదనా సముదాయమును సమీకరణము చేసి స్థిరపరచినచో దానికి సారూప్యము చెందిన ఔషధము క్రొత్తగా కనిపెట్టవచ్చును. దీనివలన అట్టి రోగులకు విశ్వవ్యాప్తముగా మందు లభించును. సోరా అంటని వారికి ఆ వ్యాధి సోకినపుడు ఆ మందు వాడినచో అంతకుముందు వలెనే సంపూర్ణారోగ్యము సిద్ధించును.

**సూత్రము 242:** ఇట్టి సాంక్రమిక వ్యాధి విజృంభణమును సరియైన మందుతో నివారింపక అలోపతి విధానము నవలంబించినచో అది నివారణగాక తిరుగబెట్టుట ఆరంభించును. రోగి నీరసించును. ఈ వ్యాధియే వరుస జ్వరముగా మారి బాధించు చుండును. అప్పుడా మొదటి హోమియోపతీ మందు వాడినను, మొదట నుండవలసిన సారూప్యము లేదు గనుక వ్యాధి తగ్గదు. అప్పుడు వరుస జ్వరములకు పనికివచ్చు సోరామందు నొకదానిని వాడవలెను. ఇది సామాన్యముగా సల్ఫర్‌తోగాని, హెపార్ సల్ఫ్‌తోగాని నిశ్శేషమగును. మోతాదులు చాల పెద్ద పొటెన్సీలలో దూరదూరముగా మిక్కిలి కాల వ్యవధానమున వాడవలెను.

వివరణము : ఒక గాలి వాలున నొక పల్లపు ప్రదేశమున విజృంభించు తీవ్ర శీతల జ్వరములు ఒకే విజృంభణము కలిగియుండును గనుక సారూప్య వైద్యమున ఒకే మోతాదుతో, ఒకే విజృంభణముతో నిశ్శేషముగా నివారణ మగును. వానికి ప్రథమ దశలో అలోపతి వంటి వైద్యము జరిగినచో నివారణము సాధ్యముగాక వ్యాధి క్లిష్టరూపమును ధరించి మరల మరల తిరుగ బెట్టును. అదియే వరుస జ్వరముగా మారును. ప్రారంభ దశలో వాడవలసిన

సారూప్యౌషధములిప్పుడు వాడినను పనిచేయవు. మొదటిదశ యొక్క సారూప్యము తరువాతి దశలలో సిద్ధింపదు. అట్టి వ్యాధులకు సోరా మందులలో సారూప్యము ననువరించి నిర్ణయించి వాడవలెను. ఇట్టి వ్యాధులలో నెక్కువగా పనికివచ్చు మందులు సల్ఫర్, హెపార్ సల్ఫ్, వావిని 10M, 50M, CM పొటెన్సీలలో దూరదూరముగా కొద్ది మోతాదులలో వాడినచో నివారణమగును. దాదాపు మూడునెలల నుండి ఆరునెలల వరకు కాల వ్యవధాన ముండవచ్చును. విజృంభణల తీవ్రత ననుసరించి ఈ వ్యవధానము మారును.

**సూత్రములు 243, 244 :** మన్యపు ప్రదేశములలో నివసింపని వారికి ఈ సాంక్రమిక శీతల జ్వరములు వచ్చినపుడు, అంతకుముందు అదే జ్వరముచే పీడితులైనవారి నివారణలో కనిపెట్టి స్థిరము చేసిన మందును వాడుట సులభమని చెప్పియుంటిమి. దానితో నివారణము కాని వారు సోరా ముదిరినవారు. అట్టివారికి సోరా మందులతోనే నివారణము పూర్తి చేయవలెను. చిత్తడి ప్రదేశములలో సంక్రమించు శీతల జ్వరములు అలోపతి వారికి చాల పని కల్పించినవి. అట్టి ప్రదేశములలో గూడ సోరా లేని ఆరోగ్యవంతుడు వ్యాధిగ్రస్తుడుగాక దృఢముగనే

జీవించును. అట్లుండుట కతడు నియమవంతమైన జీవితము గడుపుకొనవలెను. దారిద్ర్యము వలన కలుగు దుర్బలత్వముగాని, శ్రమతో అలసిపోవుట గాని, తీవ్ర కామ క్రోధములు గాని లేకున్నపుడే అతడు వ్యాధికి లొంగక ఆరోగ్యవంతుడుగా నుండును. ఒకవేళ వ్యాధి సోకినను అతడా ప్రదేశములకు మొదటగా వచ్చినపు డొక్కమారే సోకును. అతడు మిక్కిలి పెద్ద పొటెన్సీలో ఒకటి రెండు మోతాదులు చైనా వాడి ఆ వ్యాధిని సులభముగా నివారణ చేసికొని నియమబద్ధమైన జీవితము నలవరచుకొన్నచో నిక వ్యాధికి గురికాడు. దేహమునందు సోరా యున్నవారు ఇట్లు చైనా మోతాదులను వాడినను, చక్కని శరీరవ్యాయామము, వైజ్ఞానికమైన మానసిక పరిశ్రమయు కల్గియున్నను ఆరోగ్యవంతులుగా నుండరు. అట్టి వారు మన్యప్రదేశములకు చేరినపుడు సోరా మందులతో తీవ్రము, సక్రమము అగు వైద్యమును పొందియే తీరవలెను. అట్టివారు సత్వరముగా, వారిలో సోరా ముదుర్చు లోపుననే మన్యప్రదేశము నుండి తప్పుకొన్నచో వారిలోని సోరా నివారణము కాకున్నను విజృంభణము మాని అంతర్వాహినిగా నుండిపోవును. అప్పుడుగూడ సోరా చికిత్స పొందనిచో పరిపూర్ణారోగ్యముతో జీవింపజాలడు.

**సూత్రము 245 :** ఈవిధముగా వివిధ వ్యాధులకు

సారూప్యౌషధ చికిత్స చేయు విధాన వైఖరులను, వానికి సంబంధించిన పరిస్థితులను చెప్పుకొంటిమి. కనుక ఇక నీ ఔషధములను ప్రయోగింపవలసిన విధానమును, వైద్య సమయములను తెలిసికొందము.

## మందులను వినియోగించుట

**సూత్రము 246:** వైద్యమునందు వ్యాధి ఉపశమించుచున్న దశలోనే యితర ఔషధములను వాడుటగాని, వాడిన మందును మరియొక మోతాదు వాడుటగాని చేయరాదు. వాడిన మందు దాని ప్రభావమును చూపుచు, నివారణను పూర్తిచేయుటకు సహకరించును. తరుణవ్యాధులలో నిట్టి నియమ ముండనక్కరలేదు. దీర్ఘవ్యాధులలో మాత్రము సవ్యముగా నిర్ణయించిన ఔషధము ఒకే మోతాదుతో నివారణమును పూర్తిచేయుట చాల సందర్భములలో గమనింపబడినది. ఒక్కొక్కపుడు ఆరోగ్యాభివృద్ధి చాల నిదానముగను, క్రమోన్మీలనముగను జరుగును. ఇట్టి సందర్భములలో ఆదే ఔషధము 40, 50, 60, 100 దినముల పాటు పనిచేసి కర్తవ్యము నిర్వర్తించును. ఇట్లు జరుగుట అరుదుగా నుండునని అంగీకరింతుము. వైద్యుని ప్రత్యేకతను బట్టి, రోగి నియమశీలతను బట్టి

ఈ కాలపరిమితి సగమునకో, నాల్గవ వంతునకో, అంతకన్ననో కూడా తగ్గవచ్చును. నా యనుభవమును బట్టి ఈ దిగువ నియమములను పాటించినచో ఈ ఫలితములను సుఖవంతముగా పొందవచ్చును :

ఎ) మిక్కిలి జాగరూకతతో పరిపూర్ణ సారూప్యముగల మందును నిర్ణయింపవలెను.

బి) చక్కగా సూక్ష్మీకరించి మందును నీటిలో గలిపి వాడవలెను. నిర్ణీతమైన కాలవ్యవధానమున మోతాదులను మరల మరల వాడవలెను. ఒక మోతాదుకన్న నింకొక మోతాదు సూక్ష్మీకరణమును క్రమముగా, స్వల్పముగా పెంచవలెను. ఒక మోతాదునకు ముందు మోతాదుతోను, తరువాత మోతాదుతోను సూక్ష్మీకరణమున మార్పుండ వలెను. ఇట్లు చేసినచో ఔషధ వ్యాధి నైసర్గిక వ్యాధిని గురిపెట్టి పోరాడుటలో అవాంఛనీయమైన ప్రతీకార ముండదు. ఒకే సూక్ష్మీకరణము నొకే కక్ష్యలో పలు మోతాదులు వాడుటవలన జరుగు ప్రతిక్రియలకు అవకాశముండదు.

**సూత్రము 247:** ఒక మందు పొటెన్సీని మార్చకుండ తిరిగి వాడుట సౌకర్య పద్ధతి కాదు. తక్కువ కాలపరిమితిలో అదే పొటెన్సీని మరల మరల వాడినచో బొత్తిగా ప్రయోజన

ముండదు. ఇట్లు మార్చకుండ మోతాదులను వాడుటను ప్రాణశక్తి సహింపక ఘర్షణ పుట్టును. నివారణ చేయవలసిన వేదనలు పోగా మిగిలినవి ఆ ఔషధమునకు సంబంధించినవి వ్యక్తమగు నవకాశమున్నది. అదే పొటెన్సీలో వాడిన మొదటి మోతాదు ప్రాణశక్తిలో తేవలసిన మార్పు తెచ్చును. ఇక రెండవ మోతాదు అదే స్థితిలో నున్న ప్రాణశక్తిని స్పృశించుట లేదు. (మొదటి మోతాదుతో మార్పు చెందిన ప్రాణశక్తిని స్పృశించును) ఒక్కొక్కప్పుడు ఇట్లు వాడుటవలన రోగి మరల రోగమునకు గురియగుచున్నాడు. ఒక్కొక్కప్పుడు మొదటనున్న స్థితికన్న నెక్కువ రుగ్మత పొందుచున్నాడు. కారణ మేమనగా మొదటి మోతాదుచే తొలగింపబడిన వేదనలు పోగా మిగిలినవే ఆ రెండవ మోతాదు కాలమునకు తలయెత్తి యుండును. కనుక సారూప్యము సిద్ధింపదు. నివారణకు ఉన్ముఖముగా నడువక రోగి పరిస్థితికి ఉద్రేకము కల్పింపవచ్చును. అట్లు చేయక రెండవ మోతాదు పొటెన్సీ పెంచినచో అదే మందుతో ప్రాణశక్తి క్లేశము లేకుండ పెరుగుటయు, నైసర్గికవ్యాధి బాధ తగ్గుచుండుటయు జరుగుచుండుటవలన నివారణకు దగ్గర పడుచుండును.

**సూత్రము 248:** ఈ పద్ధతిలో మనము ఎప్పటికప్పుడు మందు కలిపిన నీటిని, కావలసిన పొటెన్సీలో కొన్ని చెంచాల

పరిమాణము రోగిచే త్రాగింపవలెను. దీర్ఘకాల వ్యాధులలో అవసరమునుబట్టి ప్రతిదినముగాని, రెండు దినముల కొకమారుగాని ఒక మోతాదు చొప్పున వాడవలెను. తరుణ వ్యాధులలో రెండు గంటలనుండి ఆరు గంటల వరకు కాల వ్యవధానము నిర్ణయించి వాడవలెను. శీఘ్రవ్యాధులలో గంట కొక మోతాదు గాని, అంతకన్న తరచుగా గాని వాడవచ్చును. దీర్ఘవ్యాధులలో నిర్ణయించిన ఔషధము చాలకాలము వరకు పనిచేయునట్టిదైనను పొటెన్సీ పెంచుకొనుచు దినమున కొక్క మోతాదు చొప్పున నెలల తరబడి వాడవచ్చును. వారము దినములనుండి పదునైదు దినములలో ఔషధమైపోయినచో మరల తయారు చేయునపుడు అదే మందుయొక్క పై పొటెన్సీ మాత్రలను నీటిలో కలిపి దానిని అట్లే వాడవలెను. ఆరోగ్యాభివృద్ధి కనిపించుచున్నంత కాలము అదేవిధముగా వాడినచో రోగియందు లేని క్రొత్త వేదనలేవియు పుట్టవు. అటుపైన మిగిలియున్న వేదనలను మరల సముదాయముగా కూర్చుకొని దానిని సారూప్యము చెందిన మరియొక మందును నిర్ణయించి అదేవిధముగా వాడవలెను. ప్రతి మోతాదునకును మందును మరల కుదిలింపు చేయవలెను. అట్లు చేయుటలో ప్రతి మోతాదునకు పొటెన్సీ స్వల్పముగా పెరుగును. దీర్ఘవ్యాధి యొక్క వైద్యము పూర్తికావచ్చిన సమయమునకు రోగిలో సారూప్యమైన వేదనోద్రేకము

కనిపించును. వెంటనే అదే ఔషధమును పొటెన్సీ పెంచి మోతాదుల నడుమ కాల వ్యవధానమును కూడ పెంచ వలెను. ఈ వ్యవధానమున వేదనలన్నియు మాయమై మరల కనిపింపకున్నచో నివారణము పూర్తియైనట్లే. అంతకు ముందుద్రేకము చెందిన ఔషధ వేదనలన్నియు మాయ మగును. అట్టి స్థితిలో చివరి మోతాదులను వాడునపుడు ఒక డ్రాము సీసాలో నిండుగా ఆల్కహాల్ నింపి ఒకే మాత్రను దానిలో దింపి కుదిలించి దానిని మూడు నాల్గు దినముల వ్యవధానములో వాసన చూపించవలెను. ఈ వాసన చూపించుటలో తడవకు పదిమార్లు కుదిలింపుచేసి చూపించవలెను.

**సూత్రము 249:** వాడిన మందు పనిచేయుచుండగా రోగమున కేవిధముగను సంబంధించని బాధలను కలిగించి క్రొత్త వేదనలను పుట్టించినచో అది సారూప్యౌషధము కాదనియు, ఆ రోగికి అభివృద్ధిని కలిగించదనియు గ్రహింపవలెను. ఎప్పుడైన నిట్టి యుద్రిక్త పరిస్థితి పుట్టి మనము లెక్క చేయవలసినంతగా నుద్రేకించినచో వీలయినంత తొందరలో ఆ యుద్రేకమును నివారించు టకు దానికి విరుగుడైన మందును ప్రయోగింపవలెను. అటుపైన నుద్రిక్త పరిస్థితి తగ్గిన వెనుకనే సారూప్యమైన మందును వాడవలెను. లేదా ఉద్రిక్తములైన బాధలు అంత

తీవ్రములు కానపుడు అవి పుట్టిన వెంటనే ఇక వేచియుండక సారూప్యౌషధమును వాడవచ్చును.

**సూత్రము 250:** త్వరితముగా నివారింప వలసిన శీఘ్రవ్యాధులలో నొక మందును వాడిన వెనుక అయిదారు గంటలలో మరికొన్ని బాధలు క్రొత్తగా పుట్టి, రోగి పరిస్థితి గంట గంటకును బాధాకరముగా పెచ్చుపెరుగుట గమనించినచో దానిని వెంటనే నివారణ చేయుట మాత్రమే చాలదు. రోగి పరిస్థితికి అన్నివిధముల సారూప్యము చెంది పూర్తిగా సరిపోయిన ఔషధమును గమనించి వెంటనే వాడవలెను.

**సూత్రము 251:** ఇగ్నీషియా, బ్రయోనియా, రూస్ టాక్స్ బెల్లడోనా వంటి కొన్ని శక్తిమంతములైన మందులు పనిచేయుచున్నపుడు వేదనలు త్వరగా మారుచుండును. పరస్పరము వ్యతిరేక లక్షణములైన వేదనలు ఒక్కొక్కప్పుడు పుట్టవచ్చును. అవి ఆ మందుల ప్రాథమిక గుణములు. అవి పుట్టి బాధ పెట్టుచున్నచో అదే మందును మోతాదు తగ్గించి (అనగా పొటెన్సీ పెంచి) వాడినచో పరిస్థితి చక్కబడును. తీవ్రములైన తరుణ వ్యాధులలో కూడ నిట్టి మార్పును ఒక్కొక్కపుడు కొద్ది గంటలలోనే చేయవలెను.

**సూత్రము 252:** దీర్ఘవ్యాధులలో నొక సోరా ప్రతిఘట

నౌషధము వాడిన తరువాత కూడ మిగిలిన మందులు అవసరమునుబట్టి వాడినచో పనిచేయకుండుట కనిపించును. అట్టి రోగులలో వ్యాధికి మూలకారణము తొలగి పోలేదనియు, రోగి అలవాట్లలో గాని, పరిసర పరిస్థితులలో గాని, జీవిత విధానమున గాని వెంటనే అరికట్ట వలసిన కారణములు ఉన్నవనియు గ్రహింపవలెను.

**వివరణము:** సామాన్యముగా సారూప్యములైన మందులను వాడినపుడు పనిచేయకుండుట సంభావ్యము కాదు. పనిచేయని రోగుల యందు అంతర్గతముగా సోరా యున్నదని గ్రహించి సోరాను ఖండించు మందులలో సారూప్యముగల దానిని సాధించి వాడవలెను. దానితో తత్త్వము మారును. అంతర్గతమైన దీర్ఘవ్యాధి నివారణ మగును. అటుపైన నెప్పుడేబాధలు కలిగినను ఆ పరిస్థితికి సారూప్యము చెందిన ఇతర మందులు వాడినపుడెల్ల తప్పక పనిచేయుచుండును. అప్పుడు గూడ పనిచేయుట లేదనగా సోరా యింకను తగ్గలేదని యర్థము. అంతే కాదు, రోగి దినచర్యయందో, వృత్తి ధర్మమునందో, కుటుంబాచార ములందో నివారణను ప్రతిఘటింపగల తీవ్ర కారణము లున్నవని యర్థము. త్రాగుడో, వ్యభిచారమో కావచ్చును. లేదా వృత్తిలో విపరీతముగా భీతి కలిగించునట్టి ఆర్థిక కారణములో, దుష్టుడగు మరియొక వ్యక్తి పుట్టించుచున్న

బాధలో ఉండవచ్చును. వాని జారినుండి రోగి తప్పుకొని ప్రశాంతపు పరిస్థితిని కల్పించుకొనవచ్చో మందులు పనిచేయును. పోరా ప్రతివుటవౌషధములు కూడ పనిచేయవలసినంతగా పనిచేయవు. వ్యాధి వివారణము జరుగదు.

**సూత్రము 253:** మందు పనిచేయుచున్నపుడు అన్ని వ్యాధులలోను, ముఖ్యముగా తరుణవ్యాధులలో ఔషధ ప్రభావము మొట్టమొదటి నుండియు సూక్ష్మముగా కనిపించును. దాని నందరును గమనింపలేక పోవచ్చును. కొంచె ముపశమనముగాని, కొంచె ముద్రేకించుట గాని రోగి తరహాయందు కనిపించును. అది స్పష్టముగా మార్గదర్శకమైన మార్పు. అట్టి చిన్న మార్పు ఉపశమన రూపమైనచో నెక్కువగా రోగి మనస్సునకు సంబంధించి యుండును. మనస్సునకు ప్రశాంతి, స్వేచ్ఛాభావము, చక్కని యుత్సాహము కనిపించి సహజమైన ప్రవర్తనమునకు ఉన్ముఖముగా నుండును. ఉద్రిక్త పరిస్థితి ప్రారంభము కాబోవుచున్నపుడు లక్షణము దీనికి వ్యతిరేకముగా కనిపించును. మానసిక ప్రవృత్తి సంకుచితముగను, జాలి గొలుపునట్టి అసహాయతా భావముగను ప్రకటితమగును. రోగియొక్క హావభావములు, ముఖకవళికలు మున్నగు వానిలో నిది

ప్రకటిత మగును. దానిని వైద్యుడు గమనింపవలసినదేగాని మాటలలో వర్ణించుట సాధ్యము కాదు.

వివరణము: మందు పనిచేయుచున్నపుడు దాని ప్రభావము అనుకూలముగా నున్నదా, ఉద్రిక్తముగా నున్నదా అని తెలిసికొనుటకు కావలసిన లక్షణములు మొదటినుండియు కనిపించుచునే యుండును. ఇవి మొదట భౌతిక పరిస్థితులలో గాక మానసిక లక్షణములలో మార్పులుగా ప్రారంభమగును. వీని నందరును గమనింప లేరు. రోగి ప్రవర్తనమును తెలిసికొనగల వైద్యునకు స్పష్టమగు చుండును.

మందు వాడిన కొన్ని గంటలలో ఎవరు చెప్పకుండగనే స్వయముగా ధైర్యము చిక్కుట, మనసు తేలికపడి నిశ్చలమగుట, ప్రాణమునకు హాయిగా నుండుట రోగికి కనిపించినచో చక్కని ఉపశమనము ప్రారంభమైనదనియు, ముందు ముందు విస్పష్టముగా కనిపించుననియు తెలియును.

ఉద్రేకించుట ప్రారంభము కాబోవుచున్నపుడు దిగులు, స్వేచ్ఛ లేనట్లనిపించుట, ఇతరుల జాలి నర్థించునట్టి మానసిక పరిస్థితి కలుగును. సంభాషణాదులయందు తల యూపుట, చేయి త్రిప్పుట, ముఖకవళికలు,

భావప్రకటనము మున్నగు వైఖరులన్నిటిలో ఈ మార్పును వైద్యుడు గమనించి పట్టుకొన గలిగి ఉండవలెను.

**సూత్రము 254:** అటుపైన క్రొత్త లక్షణములు పుట్టుట, ప్రాత లక్షణములు పెరుగుట మున్నగు వానిని గమనించుకొనవలెను. లేదా క్రొత్త లక్షణములు రాకుండ ప్రాతవి ఒక్కొక్కటే మాయమగుచు నుండుటను బట్టి గూడ గమనించుకొనవలెను. ఈ సూచనలమబట్టి వైద్య మెటువైపునకు నడచుచున్నదో గమనించుకొను చుండవలెను. రోగులలో ఉద్రేకోపశమనములు కలుగుచున్నపుడు వానిని గమనించి, పరిగణన చేసి వివరింపలేని వారుందురు. గమనింప గలిగినను అంగీకరించుట కిష్టము లేనివారు కొందరుందురు. అట్టివారియందు గూడ వైద్యుడు గమనించుకొనవలసి యుండును.

వివరణము: వేదనలలో హెచ్చు తగ్గులను స్వయముగా గమనించుకొనలేని రోగులుందురు. గుండెదడ, మోకాళ్ళ నొప్పులు, చర్మవ్యాధి యున్న వారికి మందు అనుకూలముగా పనిచేయుచున్నపుడు వెంటనే గుండెదడ తగ్గి దురద లెక్కువగును. వారు వైద్యునితో "బాధ లెక్కువగుచున్నవి" అని చెప్పుదురు. బాధలనగా వాని భాషలో దురదలని యర్థము. మందు సరియైనది

కానిచో దురదలు తగ్గి దడ ఎక్కువగును. అజ్ఞానము చేత రోగి "కొంచెము బాధ తగ్గినది" అని చెప్పవచ్చును. అట్టివానిని గ్రుడ్డిగా నమ్మరాదు.

కొందరికి రోగము తగ్గుచున్నను వైద్యునితో అంగీకరించుటకు మనసొప్పదు. తగ్గలేదని చెప్పినచో ఇంకను మంచి మందులు వాడునని దుర్భ్రాంతిపడువారు గలరు. చిట్టచివరకు అన్ని బాధలను శమించుచున్న దశలో ద్రవ్యలోభమున తమ యిష్టము వచ్చినపుడు వైద్యము మానదలచిన వారుందురు. వారు "తగ్గలేదు, బాధలన్నియు నెక్కువగుచున్నవి" అని ప్రతిదినము రెట్టించుచుందురు. ఒక్కొక్క వేదననే విడమర్చి ఎట్లున్నదో చెప్పమన్నచో వారు నిరాకరింతురు. "మొత్తము మీద నెక్కువైనదని చెప్పుచుంటిని గదా" అందురు. ఇట్టి అజ్ఞాన లోభాది విఘ్నములను లక్ష్యపెట్టక వైద్యులు స్వయముగా పరిశీలించి ప్రవర్తనను బట్టి గమనించుచు తగిన విధమున మాత్రమే ఔషధ ప్రయోగము చేయవలెను. వైద్యుని భయపెట్టు వారును, మనస్సు పని చేయకుండునట్లు కంగారుపెట్టు వారును రోగులలో నుందురు. ముఖ్యముగా ఆర్సెనికం ఆల్బమ్, ఆర్నికా, హైయొసైయమస్, ఇగ్నీషియా, అనకార్డియం మందులకు సంబంధించిన మానసిక వేదనలతోడి దీర్ఘరోగములు కలవారు ఇట్లు ప్రవర్తింతురు.

వానిని గ్రహించి వైద్యుడు నిశ్చల మనస్కుడై నిర్ణయించు కొనుచుండ వలెను.

**సూత్రము 255:** ఇట్టి వ్యక్తుల విషయమున గూడ మనము యథార్థమును గమనించి నెగ్గుకొని రావచ్చును. దాని కొకటే యుపాయము. మనము మొదట వ్రాసిపెట్టుకొన్న వేదనా పట్టికను చూచి ఒక్కొక్క వేదనను గూర్చి వేరుగా ప్రశ్నించినచో యథార్థము తెలియును. క్రొత్త వేదనలు రాలేదనియు, ముందున్న వేదనలు హెచ్చు కాలేదనియు, అందు కొన్ని తగ్గినవనియు గమనించినచో రోగము తిరుగు ముఖము పట్టుచున్నదని తెలియును. దానికి తోడు రోగి నడక, భావప్రకటనము, ముఖకవళికలు కూడ పరిశీలించి జతపరచినచో నిశ్చయముగా వ్యాధి తిరుగు ముఖము పట్టినదనియు, మందును మార్చుట గాని, పొటెన్సీ మార్చుట గాని, మోతాదును మరియొకదానిని వాడుట గాని చేయరాదనియు గ్రహింపవలెను. ఇంక కొంత కాలములో వ్యాధి తగ్గిపోవునని తెలియును. ఇట్టి పరిస్థితి ప్రారంభమైన తరువాతి దశలో మరల అభివృద్ధిలో ఆలస్యమెక్కువ కనిపించినచో రోగి పరిస్థితులలోనో, పథ్యపానములలోనో, ప్రవర్తనమువందో లోపమున్నదని అర్థము.

వివరణము: దీర్ఘవ్యాధులలో నొక పెద్ద పొటెన్సీ మోతాదు వలన కొంతకాలము చక్కని యభివృద్ధి కనిపించి అటుపైన అదే పరిస్థితి నిలిచిపోయి ఆలస్యమగు చున్నచో రోగిని గూర్చి అనుమానపడవలెను. పెద్దపండుగలు వచ్చిపోయిన తరువాత చాలమందిలో నిట్టి ప్రతిష్టంభన కనిపించును. దాని కర్థమేమనగా వారు పండుగ చేసికొనుటలో కూడనిది తినుట, త్రాగుట, రెండాటలు సినిమాలు చూచుట, అహోరాత్రములు చీట్లపేకాడుట, క్లబ్బులలో జాగరణ చేయుట మున్నగునవి జరిగియుండును.

**సూత్రము 256:** వైద్యము మధ్యలో కొన్ని క్రొత్త వేదనలు, అనుకొనని సన్నివేశములు జరిగినపుడు రోగి సాధుస్వభావముతో తన కభివృద్ధి కనిపించుచున్నదనియు, నిదివరకు కన్న బాధలు తగ్గుచున్నవనియు చెప్పినచో నమ్మరాదు. ముఖ్యముగా ఉపిరితిత్తుల క్షయవ్యాధి యున్నవారు ఊపిరితిత్తులలో, వ్రణాదులతో బాధపడుచున్న సందర్భములలో నిట్టివానిని గమనింప దగును. రోగికి తాత్కాలికముగా నుపశమన మున్నట్లని పించినను అటుతరువాత స్వల్పకాలముననే ఉద్రిక్త పరిస్థితి ఏర్పడును.

వివరణము: రోగికి పూర్వ మెపుడో క్షయవ్యాధి వచ్చి

ఊపిరితిత్తుల వైద్యము చేయించుకొని తిరిగి యారోగ్యమును పొందిన చాలకాలమునకు ఊపిరి తిత్తులలో పుండు పుట్టుట, జ్వరము, ఆయాసము, దగ్గినపుడెల్ల రొమ్మున మంటలు పుట్టుట, కొంచెము రక్తము పడుచుండుట అను పరిస్థితులలో హోమియోపతీ వైద్యమున ప్రవేశించె ననుకొనుము. అతనికి ఉన్న పరిస్థితి యొక్క సారూప్యమును బట్టి ఆర్సెనికమ్ ఆల్బమ్, ఫాస్ఫరస్ మున్నగు మందులలో నొకదానిని తగు మాత్రము పొటెన్సీలో నొక మోతాదు వాడగా చక్కని ఉపశమనము కనిపించును. అన్ని బాధలును క్రమముగా తగ్గుచు వెనుకపడుచుండును. ఇంతలో తలవనితలంపుగా ఛాతీలో విపరీతమైన నొప్పి వచ్చి తగ్గిపోవును. అపుడు వైద్యుడు పోయి రోగి పరిస్థితిని పరిశీలించుచున్నపుడు రోగి "ఈ నొప్పి ఎందులకు వచ్చినదో ఏమో మిగిలిన పరిస్థితి అంతయు బాగుగనే యున్నది. నా మనస్సునకు జబ్బు తగ్గుచున్నదని ధైర్యముగా నున్నది" అనును. దానిని వైద్యుడు నమ్మరాదు. వెంటనే పరిశీలించి మరల వేదనలను కూర్పుచేసికొని మందు మార్చి ప్రతిక్రియ చేయనిచో కొద్ది గంటలలోనో, ఒకటి రెండు దినములలోనో పరిస్థితి విషమించవచ్చును.

**సూత్రము 257:** వైద్యుడు వాడునట్టి మందులలో

నొక్కొక్క మందును వాడినపుడు అనేక పర్యాయములు ఆశ్చర్యకరమైన గుణము, అనేక వ్యాధుల నివారణము కన్పించుచుండును. అది కారణముగా ఆ మందుపై ప్రత్యేక అభిమానము పెంచుకొనరాదు. ఒక్కొక్కప్పుడు అదృష్టమును బట్టి అదే మందు సరియైన సారూప్యముతో నున్న రోగులు వాని దగ్గరకు వచ్చియుందురు. దానినిబట్టి కొన్ని మందులపై ప్రత్యేకాభిమానము పెంచుకొనుట తగదు. అట్లు ప్రవర్తించినచో మిగిలిన మందులను అరుదుగా వాడుటయు వానికి సంబంధించిన రోగములకు తనవలన నుపకారము జరుగకుండుటయు తథ్యము.

వివరణము: ఒక్కొక్క వైద్యుడు జ్వరమున్న వానికెల్ల ఎకొనైట్ వాడుచుండును. "జేబులో పల్సటిల్లా సీసా పెట్టుకొని తిరుగుచున్నచో ప్రపంచ మందలి అజీర్ణ వ్యాధులన్నిటిని దానితో నయము చేయగలను" అని యొకడు ప్రగల్భ పడును. "నాదగ్గర కేరోగి వచ్చినను మొదట నక్సు వామికా వాడి గాని ఏ మందును వాడను" అని యొకడు ఆంక్ష పెట్టుకొనును. "వచ్చిన రోగి కెల్ల నొక్కొక్క సల్ఫర్ డోస్ తగిలించినచో భూమిపై జబ్బులే యుండవు" అని యొక బుద్ధిమంతుడు భక్తిపరాయణు డగును. "బ్రయోనియా నా ప్రాణము. అదియే నా కీర్తి సంపదలకు ప్రధాన హేతువు" అని యొకడు బ్రయోనియా

చరణకమలము లాశ్రయించుకొని బ్రతుకును. "నాకు మరల మోకాలు పోటుగా నున్నది, నాలుగు రూస్‌టాక్సు మాత్రలు పెట్టు" అని ఒక అత్తగారు కోడలి నడుగును. ఇట్లు ఔషధములతో ప్రత్యేక సంగదోషము పెంచుకొనుట పనికిరాదు. సుప్రసిద్ధులైన వైద్యులు గూడ యిట్టి దుస్సాంగత్యములకు లోనై నివారణ విషయమున చెడుత్రోవలు త్రొక్కినవారు కలరు. ఈ సంగదోష వ్యసనమువలన కలుగు మరియొక నష్టమేమనగా కొందరు రోగులు హెల్లిబోరస్, హైయోస్యామస్, కాంధారిస్, ఎగారికస్ మున్నగు బలీయములైన ఔషధములతో మానసిక సారూప్యముకలవారు మహావ్యాధుల నివారణకై వచ్చినపుడు మోసము జరుగును. సంగదోషమువలన బద్ధకము పుట్టి హోమియో వైద్యుడు ఈ రోగులను ఆమూలాగ్రముగా ప్రత్యేక పరిశీలన చేసి సారూప్యము సాధించి ఔషధ నిర్ణయము చేయడు. కొన్ని ఔషధములతో తనకు కలిగిన సంగదోషమువలన బుద్ధినాశము అలవడినది. ఆ వచ్చిన రోగుల తలనొప్పి మున్నగు లక్షణములను మాత్రము వ్రాసికొని తన అభిమానతార అగు బ్రయోనియానో, బెల్లడోనానో, జగద్విఖ్యాతమైన సల్ఫరునో, తన బుద్ధికి త్రిలోక సంచారియైన నారదుని వంటి నక్సువామికానో వాడును. ఇట్టి సంగదోషములు పనికిరావని శాస్త్ర

దర్శనాచార్యులు హెచ్చరించుచున్నారు.

ఒక్కొక్క బుద్ధిమంతుడు "ఏమందును నేను నా జన్మలో 10M పొటెన్సీకి తక్కువ వాడియుండలేదు, వాడను" అని నొక్కి చెప్పును. మరియొక సాధుశీలుడు "నేనెవ్వరికిని 30 పొటెన్సీ మించి మందులను వాడను. అదరిపాటు నాకు నచ్చదు" అనును. ఇంకొక హోమియో నాగరిక శిఖామణి "నేనెన్నడును 30 కన్న తక్కువ పొటెన్సీ మందులను కొనను, నా మందులతో కలుపను" అని ఒదుగులు పోవును. ఇట్టివి పనికిరావని, రోగి పరిస్థితికి సారూప్యము సాధించిన ఔషధము, వ్యాధి లేత ముదుళ్ళ ననుసరించిన పొటెన్సీ, వ్యాధి వేగము ననుసరించిన మోతాదుల కాలపరిమితి, నివారణను గమనించుకొని ఔషధ ప్రయోగమును నిలిపివేయుట మాత్రమే శాస్త్ర ప్రమాణమనియు, క్షేమంకరమనియు గ్రహింపవలెను.

**సూత్రము 258:** అదేవిధముగా సరియైన వైద్యుడు కొన్ని మందులయందు అయిష్టత, ద్వేషము పెంచుకొనరాదు. తాను మొదట వాడినపుడు తన పొరపాటువలన దుష్పరిణామము పొంది ప్రమాదించిన సందర్భము లుండవచ్చును. ఆ సందర్భములలో వాడిన మందులను గుర్తు పెట్టుకొని నిరాదరణచేసి అటుపైన వాడకుండుట చేయరాదు. పనికిరానివి, ప్రమాదించునవి

అగు మందులుండవు. ప్రతి ఔషధము తన సారూప్యము సిద్ధించినచోట మిగిలిన వానికన్న మిన్నయే. ఇట్టి ఔషధ సంచయము నెడల నెన్నడును వైద్యుడు నీచములయిన రాగద్వేషములను పెంచుకొని తన ఔషధ నిర్ణయ పద్ధతికి విఘ్నములను కలిగించుకొనరాదు.

వివరణము: "ఫాస్పరస్ ప్రాణములు తీయును. దానిని నేనెన్నడును వాడను" అని యొక వైద్యుడు నాతో చెప్పెను. "లెకసిస్ పాము గరళము. అట్టి విషౌషధములను నేను వాడను" అని యొకరు పలికిరి. ఈ రెండు విధములైన పాక్షిక పద్ధతులును వైద్యునకు రాగద్వేషము లనదగిన సంసార బంధములు.

**సూత్రము 259:** హోమియో వైద్యమున రోగికి తగిన మందుయొక్క ఆవశ్యకత ఎంతహెచ్చో ఔషధ పరిమాణము అంత స్వల్పము. దీనిని గుర్తుంచుకొన్నచో వైద్యకాలమున ఔషధ గుణములు చెదిరిపోకుండ కాపాడుకొనుటకు కావలసిన పథ్యపానముల ప్రాముఖ్యము గుర్తుండును. ఏ స్వల్పదోషముల వలననైన ప్రయోగింపబడిన మందును ఆహారాది దోషములు చెదర గొట్టుటయో, అరికట్టుటయో, నిర్మూలించుటయో జరుగవచ్చును.

వివరణము: హోమియోపతీమందులో సూక్ష్మీకరణము చేత గుణమిచ్చునట్టి భాగము ఆ మోతాదులో అణుమాత్రముగా నుండును. దానిని దాచి యుంచునపుడుగాని, ప్రయోగించునపుడు గాని, రోగి పథ్యపానాదుల విషయమునగాని మందు గుణము చెదిరిపోకుండ కాపాడు కొనవలెను. నిర్లక్ష్యము చేసినచో ఆ మోతాదు విరుగుడగును. తరువాత మోతాదు నెప్పుడు వాడవలెనో వైద్యునకు తెలియక తికమక పడును. మొదటి మోతాదు పనిచేయుచున్న వైఖరిని బట్టియే తరువాతి మోతాదు నెప్పుడు వాడవలెనన్న విషయ మాధారపడి యుండును. అట్లే పొటెన్సీ పెంచుటకు గూడ రోగియందు మారుచున్న గుణము లొక్కటే వైద్యునకాధారము. ఈవిధముగా హోమియోపతీ వైద్యమున మొదటి మోతాదునుండి మిగిలిన వానికి సంబంధము దారమునకు పూనలు గ్రుచ్చి నట్లుండును. పథ్యపానాదుల నిర్లక్ష్యమువలన తెగినచోట ముడిపెట్టుట కష్టము. అందువలన ఆహార విహారాది నియమములను చక్కగా పాటించుట ముఖ్యమని శాస్త్రకారుడు నొక్కి చెప్పుచున్నాడు.

కొందరు హోమియోపతీ వైద్యులు కూడ ఈ పథ్యపాన నియమములు చాదస్తమనియు, పాటింప నక్కరలేదనియు

దుర్బోధ చేయుచున్నారు. "నీవు కారాకిళ్లీ నములుచు రమ్ము. దానిపై నేను మందు వేసెదను. గుణము చూపించెదను" అని యొకరు వ్యాధి పీడితులతో సవాలు చేయుచున్నారు. వైద్యము మానవసేవ యనియు, సవాళ్ళు కాదనియు గమనింపవలెను. హోమియోపతీ వైద్యమును నమ్ముచు, దాని ఆచార్యుడైన హానిమన్ చెప్పినవి చాదస్తము లనుట అవివేకము.

**సూత్రము 260:** దీర్ఘవ్యాధుల వైద్యమున సరియైన మందు వాడుటయే ముఖ్యము కాదనియు, నివారణమునకు విఘ్నకరములైన పథ్యపానాదులను పాటించుటలో సూక్ష్మదృష్టికూడ అంతే ముఖ్యమనియు గమనింపవలెను. ఆహారము, దినచర్య మొదలగు వాని నియమములలో భేదమును, దుష్ట జీవన విధానములును వైద్య సమయమున దీర్ఘవ్యాధుల బాధల నుద్రేకింప చేయుననుట కాదనరాని సత్యము.

**సూత్రము 261:** దీర్ఘవ్యాధుల వైద్యము జరుగు చున్నపుడు ఇట్టి విఘ్నములను పరిహరించి తీరవలెను. అంతేకాదు, కావలసిన తావులలో ప్రత్యేకముగా వైద్యమును నియమవంతము చేయవలెను. నీతిదాయకములు వైజ్ఞానికములు అగు వ్యాసంగము లుండవలెను.

చురుకుదనమును కలిగించు పరిమిత వ్యాయామము కొరకై వివిధ వాతావరణములలో విశాలాకాశము క్రింద వాహ్యాళి నడచిపోవుట ఆవశ్యకము. ఆరోగ్యమును చక్కబరచునట్టి బలవర్ధకములైన అన్నపానీయాదులను సేవించవలెను. అందును ఔషధ ప్రభావముగల పదార్థములను పరిహరింపవలెను.

**వివరణము:** దీర్ఘవ్యాధి స్వభావమును బట్టి సస్యములు, శాకములు, ఫలరసములు, పాలు, మజ్జిగ, అపక్వాహారము (పచ్చికూరలు మొదలగునవి), తేనె మున్నగువానిని కనిపెట్టి వాడుచుండవలెను. జీర్ణమగుట కష్టమైన సెనగపిండి పదార్థములు మున్నగు వానిని పరిహరింపవలెను. ఉల్లిపాయ, వెల్లుల్లి, యాలకి, లవంగము, కొత్తిమీర, ఇంగువ మున్నగు పదార్థము లాహారములైనను ఔషధ గుణములు కలవి గనుక మానవలెను.

**సూత్రము 262:** మానసిక వికారములున్న వ్యాధులను మినహాయించి మిగిలిన తరుణ వ్యాధుల విషయమున పథ్యము వేరువిధముగా నుండును. దీర్ఘవ్యాధుల విషయమునకన్న నిది కొంత తక్కువగా నుండవచ్చును. కారణ మేమనగా ప్రాణ రక్షణశక్తి దీర్ఘవ్యాధులున్న వారిలో కన్న కేవల తరుణవ్యాధులున్న వారిలో హెచ్చుగా,

జాగరూకముగా నుండును. రోగికి సేవచేయు వారితో మాత్రము వైద్యుడు కొన్ని హెచ్చరికలు చేసిన చాలును. ఆహారమునందు కొన్ని పదార్థములను కోరినను ఈయవద్దనియు, అలసట, నిద్రాభంగము మున్నగునవి కలిగించు విధమున ప్రవర్తించినచో నిషేధింపు మనియు మాత్రము హెచ్చరించిన చాలును.

**సూత్రము 263:** అన్నపానీయముల విషయమున తరుణ వ్యాధియందున్న రోగి ఎట్లుండవలెనని అభిలషించునో గమనింపవలెను. అతడు కోరినవన్నియు నుపశమనము కలిగించి సదుపాయము చేయునట్టివిగా ఉండవలెను. వానియందు ఔషధ ప్రభావ మేదియు ఉండదుగాని కావలసిన దానిని పూరించుట మాత్ర ముండును. అతడు కోరిన విచ్చినచో వ్యాధి నిర్మూలనమునకు ప్రతిఘటింపు కలుగవచ్చునని అభ్యంతరము కనిపించవచ్చును. కాని ఇట్టి ప్రతిఘటన కన్నఎక్కువ బలీయమైన అంశములు ఈ వైద్య ప్రక్రియలో కలవు.

ఎ) సంపూర్ణ సారూప్యము సిద్ధించిన ఔషధ బలము, దానిచేత సుపుష్టము చేయబడిన ప్రాణశక్తి బలము.

బి) అతడు కోరిన దిచ్చుటవలన కలిగిన తుష్టి పుష్టి కారణముగా సంభవించిన బలము, అట్లే ఈ తరుణవ్యాధి

రోగులు కోరిన గదిలోని ఉష్ణత మరియు కప్పుకొనవలె ననిపించినపుడును, దానిని తొలగించుకొనవలె ననిపించి నపుడును అట్టి సదుపాయము చేయుట. అందలి శీతోష్ణ ముల మార్పు కూడ వాని ఆరోగ్యస్థితి చక్కబడుట కుపకరించును. అంతేగాని మనస్సు శ్రమపడుట, ఆవేశ ములు రేకెత్తుట జరుగకుండ చూచుటయే ముఖ్యము.

వివరణము: తరుణవ్యాధుల చికిత్సలో నియమ ములను పెట్టుట విషయమున నెక్కువగా ప్రాముఖ్య మీయవలసినది రోగికి కావలసిన సౌకర్యము సిద్ధించుటకే గాని వైద్యుని పట్టుదలలకు కాదు. ఈ వ్యాధులలో ఆరోగ్యము చక్కబడుటకు నుపకరించు నంశములు ముఖ్యముగా రెండు :

ఎ) రోగి మనస్సు కష్టపడకుండుట.

బి) అతనికి కోపావేశాదులు ప్రేరేపణ చెందకుండుట.

వీని ననుసరించి రోగి ఎట్టి అన్నపానీయాదులు కోరుచున్నాడో వానిని వీలయినంత వరకు సమకూర్చవలెను. ఆరోగ్యమునకు భంగకరము లైనవి తప్ప మిగిలినవన్నియు వాని కోరికల ననుసరించియే చేయవలెను. రోగస్థితిలోని ఈ కోరికల యందు కావలసిన సదుపాయమును తెలియజేయునట్టి సామర్థ్యముండును.

అవగా నేది సుఖము గలిగించునో దానిని మనస్సు తెలియజేయు చుండును. ఆతని గది ఎంత వెచ్చగా నుండిన బాగుండునో అతని మనస్సు నుండియే తెలిసికొనవలెను. వెచ్చదనము, చల్లదనము మున్నగు పద్ధతులలో నేది బాగుండునో అను విషయము అతడు కప్పుకొనుట, దానిని తొలగించుట మున్నగు వైఖరులను బట్టి గ్రహించి వాని కనుకూలముగా చేయునదే ఉపచారము. దీనివలన వ్యాధి త్వరగా నివారణమగును. "ఈపూట నేనేమియు తినలేను" అని రోగి చెప్పినపుడు బలవంతము చేయరాదు. వానికి అనుకూలమైన ఆకలి దప్పులను కావలసిన విధమున రోగస్థితియే నిర్ణయించును. రోగస్థితియందు తరుణ వ్యాధులలో మనకు కనిపించునట్టి వేదనలు రోగము నెదుర్కొనుటకు ప్రాణశక్తి చూపుచున్న సామర్థ్యములేగాని రోగములోని భాగములు కావు. రోగము అదృశ్యముగా నుండి తన ప్రాథమిక ప్రభావము (primary action) ను వర్తింపచేయును. దానిపై ప్రతీకార ప్రభావము (secondary action) ను పుట్టించు ప్రాణశక్తి ప్రయత్న ఫలితములే వేదనలు. అంతే కాని వేదనలే రోగమని ఎన్నడును పొరపడరాదు. తరుణ వ్యాధులలో పుట్టునట్టి కోరికలన్నియు వేదనలే గాని అన్యములు కావు.

**సూత్రము 264 :** వైద్యునకు నిర్దుష్టములైన, సుపుష్టములైన ఔషధములు లభించు నేర్పాటుండవలెను. వాని నివారణ శక్తిపై నత డాధారపడుటకు తగినట్లుండవలెను. ఈ నిర్దిష్టత మీద నాధారపడియే అతని నిర్ణయములు సానుకూలములగును.

**సూత్రము 265:** ప్రతిరోగియు తానిచ్చు నౌషధమును తప్పక సేవించెనను నిశ్చయము వైద్యునకుండవలెను గనుక వైద్యుడు స్వయముగా మందు కలిపి రోగి కొసగవలెను. స్వయముగా రోగిచే తినిపించుట ఇంకను వాంఛనీయము.

**సూత్రము 266:** జంతువుల నుండియు, వృక్షముల నుండియు వాడబడు నౌషధముల ప్రభావము ఆ యా ద్రవ్యముల నవీనత వలన నిశ్చితముగా నుండవలెను.

వివరణము: మందులు తిన్నగా తయారు చేయబడినవా లేదా అను సందేహమున కవకాశముండరాదు. రోగి మందు వాడెనా లేదా అను సందేహమునకు తావీయరాదు. తానే కలిపి తగిన విధమున నాలుకపై నుంచుట మంచిది. జంతువుల నుండి ద్రవ్యము స్వీకరించుటలో సజీవ లక్షణము సిద్ధింపవలెను గనుక చచ్చిన వానినుండి, శుష్కించిన వానినుండి, తుపాకితో కొట్టిన వానినుండి స్వీకరించవరాదు. హానిమన్

చాలమందులను తానే స్వీకరించి తయారుచేసి, వాని ప్రభావమును తనపై నిరూపణము చేసి రోగులకు స్వయముగా వాడి చూపించెను. లెకసిస్ అను మందును ప్రయోగము చేయదలచినపుడు అతని అనుయాయి యగు హెర్రింగు ఆ భయంకర మహా సర్పమును తానే పట్టుకొని, ప్రాణములకు తెగించి దాని గరళము తానే పిండి, దానినుండి మందును తానే తయారుచేసి తనపైననే ప్రయోగము చేసికొనెను. కనుకనే ఫలితములను ప్రత్యక్ష నిదర్శనము చేసికొని లోకమున కందించెను. దాని మహిమవలన వేలకొలది ప్రాణములు రక్షింపబడుచున్నవి. ఇట్లే వృక్షమూలికల విషయమున కూడ వైద్యుడు స్వయముగా నిర్వహింప గలిగినచో ఫలితములు నిర్దుష్టముగా నుండును.

**సూత్రము 267:** ప్రాంతీయములైన మూలికలను పచ్చిగా నున్నవానిని అన్నిభాగములతోను తెచ్చి పచ్చిగా నున్నపుడే రసము పిండి వెంటనే ఒక దీపమునకు సరిపోయినంత స్పిరిట్‌తో కలిపి యుంచెదము. దానిని సీసాలో పోసి, గట్టి బిరడా బిగించి ఒక రాత్రి, ఒక పగలు కదలకుండ నుంచెదము. దానినుండి వేరైన పై తెట్టె, అడుగున దిమ్మ గట్టిన పిండివదార్థము రాకుండ నడుమనున్న ద్రవపదార్థమును మాత్రము తేర్చి వేరు చేసెదము.

స్పిరిట్‌తో కలుపుట వలన ఈ పసరులను పులియకుండ కాపాడుదుము. ఈ పద్ధతితో ఔషధ ప్రభావము చెడకుండ నిలిపెదము. ఈ ద్రవ్యములను శుభ్రమైన సీసాలలో పోసి, గట్టి బిరడా బిగించి, హరించుకొని పోకుండుటకై ఆ బిరడాలపై మైనము పోసెదము. సూర్యరశ్మి సోకకుండ దాచిపెట్టెదము.

**సూత్రము 268:** పై దేశమునుండి తెప్పించవలసిన మొక్కలు, చెట్టు బెరడులు, గింజలు, మూలములు మున్నగువానిని గూర్చి శ్రద్ధగల వైద్యుడు జాగరూకత వహించవలెను. వాని నెచ్చటనో చూర్ణము చేయించి తెప్పించినచో వాని స్వచ్ఛతను నమ్మియుండరాదు. స్వయముగా పరిశీలించిన వానినే నమ్మవలెను.

**సూత్రము 269:** ఈ హోమియోపతీ వైద్య సిద్ధాంతము ఇంతవరకు నెవరు కని విని యెరుగని విధమున ముడిద్రవ్యములనుండి ఔషధ గుణములను స్థాపన చేయుచున్నది. వానిని ఔషధీకరణము చేయుపద్ధతికూడ నిదివరకెవ్వరు నెరిగినది కాదు. ఈ పద్ధతివలన నీ యౌషధములు ప్రగాఢముగను, అగాధముగను ప్రభావ మును ప్రకటన చేయుచున్నవి. వాని వ్యాధి నివారణ సామర్థ్యము కూడ అంతగనే ఋజువు అగుచున్నది. ముడిసరకులుగా నున్నపుడు మానవదేహముపై నెట్టి

ప్రభావము కలిగియుండ వనుకొనిన ద్రవ్యములు కూడ నీ పద్ధతిలో ఔషధీకరణము చేసినపుడు ఊహింపరాని లోతులలో విస్తృతితో పనిచేయుచున్నది.

దేహధారుల ఆరోగ్యమును ఆపాదమస్తకము మార్చివేయగల ప్రాణశక్తి యొక్క మహిమలు ఈ ముడిసరకులలో నిద్రించుచున్నవనియు, వాని నీ పద్ధతిలో ఔషధీకరణము చేసి మేల్కొలుప వచ్చుననియు తేలినది. ఈ ద్రవ్యముల యందలి సూక్ష్మాణువులలోని ప్రభావమును మేలుకొలుపుటకు వానిని మర్దించుట, కుదలించుట, ప్రభావము చూపని ఇతర పదార్థములతో కలుపుట, శుష్కముగా గాని, ఆర్ద్రముగా గాని స్థిరపరచి వేరువేరుగా నిలువయుంచుట మొదలగు పద్ధతుల వలన కలుగుచున్నది. ఈ పద్ధతిని 'ఔషధోత్తేజనము లేక ఔషధ గుణ వీర్యవర్ధనము' అని వ్యవహరించ వచ్చును. ఈ మందులను సూక్ష్మీకరణములుగా వివిధ కక్ష్యలలో వ్యవహరింప వచ్చును.

**సూత్రము 270:** ఈ ఉత్తేజక శక్తిని కలిగించుటకై ఈ దిగువ విధానము అవలంబింపబడుచున్నది : ఒక వరిగింజ ఎత్తు ముడిద్రవ్యమును స్వీకరింపవలెను. మూడువందల వరిగింజల ఎత్తుగల పాలచక్కెరను గ్రహింపవలెను. దానిని

మూడు సమ భాగములుగా చేసి ఒక భాగముతో మొదట మందు పదార్థము కలుపవలెను. దానిని కల్వములో గంటసేపు మారవలెను. దానితో రెండవ భాగము చెక్కరను గలిపి మరల గంటసేపు నూరవలెను. దానితో మూడవ భాగము చెక్కరను మరల కలిపి గంటసేపు మారవలెను. అపుడు నీటితో కలిపిన ఆల్కామాల్‌ను సిద్ధపరుపవలెను. నీటితో కలిపిన ఆల్కహాల్‌ను తయారుచేయుటలో నాల్గవవంతు ఆల్కహాల్‌ను మిగిలిన మూడువంతుల స్వచ్ఛమైన నీటిలో (distilled water) కలుపవలెను. దానినుండి అయిదు వందల చుక్కలు స్వీకరించి, అందు ఒక వరిగింజ ఎత్తు ఔషధ చూర్ణమును స్వీకరించి కలుపవలెను. అందుండి ఒక చుక్క నొక సీసాలో వట్టవలెను. దానిని నూరుమార్లు బలముగా కుదిలింపవలెను. గట్టి రబ్బరు దిమ్మపై చేతితో సీసా పట్టుకొని గ్రుద్దుచు ఈ కుదిలింపులు చేయవలెను. ఇట్లు చేయుగా వచ్చిన ఔషధమును ఒకటవ డిగ్రీ సూక్ష్మీకరణముగా గ్రహింపవలెను. దీనితో తడిపిన పంచదార మాత్రలను బ్లాటింగ్ పేపరుపై పోసి, తడి అర్దిన వెనుక సీసాలో బోసి కార్కుపెట్టి ఒకటవ సూక్ష్మీకరణముగా దానిపై గుర్తుంచవలెను. అందుండి రెండవ సూక్ష్మీకరణమునకై ఒక మాత్ర తీసి ఇంకొక సీసాలో

నుంచి ఒక చుక్క నీటి నుంచవలెను. దానిలో వంద చుక్కలు స్వచ్ఛమైన ఆల్కహాల్ కలిపి ఇది వరకువలెనే నూరు కుదిలింపులు చేయవలెను.

దానితో తడిపిన క్రొత్త చక్కెర మాత్రలను బ్లాటింగు పేపరుతో తడి అద్ది సీసాలో పోసి కార్కుపెట్టి దానిపైన రెండవ డిగ్రీ సూక్ష్మీకరణమని గుర్తు పెట్టవలెను. ఇట్లే 29 మార్లు పర్యాయము చేయవలెను. దానిపై నూరు చుక్కలు స్వచ్ఛమైన ఆల్కహాల్ వేసి నూరుమార్లు కుదిలింపు చేయగా వచ్చిన ద్రవముతో తడిపిన పంచదార మాత్రలు 30 సూక్ష్మీకరణము పొందినవగును.

ఈ పద్ధతివలన ఔషధ ప్రభావము సూక్ష్మీకరణము చేయబడి పూర్ణ సామర్థ్యమును పొందును. రోగి శరీరమందలి బాధితములైన భాగములపై ప్రభావము చూపగలిగి యుండును. ఇవి పుట్టించు సారూప్యమైన వ్యాధులు ఆ దేహ భాగమందలి నైసర్గిక వ్యాధి బాధలను రహితము చేయగలిగి యుండును. ఔషధ ద్రవ్యములు ముడిసరుకులుగా నున్నపుడు తమ పదార్థత్వమును మాత్రమే ప్రదర్శించును గాని ఔషధ గుణమును ప్రదర్శింపవు. అవి ఔషధమునకు పనికిరాని పదార్థ ములుగనే కనిపించును. వానినే సూక్ష్మ సూక్ష్మ కక్ష్యల లోనికి సూక్ష్మీకరణము చేసినపుడు చైతన్యము వంటి

ఔషధశక్తిగా సూక్ష్మరూపము దాల్చును. అది మన ఇంద్రియముల కందునది కాదు. అట్టి సూక్ష్మశక్తిగల పంచదార మాత్రను కొంచెము నీటితో కలిపి వాడినపుడు శక్తివాహికగా పనిచేయును. రోగి దేహమున అదృశ్యముగా నున్న శక్తిపై తన నివారణ సామర్థ్యమును చూపును.

**సూత్రము 271:** మానవులను నిజముగా రోగములనుండి రక్షింపవలెనన్నచో వైద్యుడు స్వయముగా మందులను తయారు చేసికొనవలెను. అతడే పచ్చి చెట్టును తెచ్చి ఉపయోగించవచ్చును. ఈ చెట్టునందలి ముడిపదార్థములలో అతనికి కావలసిన ద్రవ్య పరిమాణము చాల తక్కువ. కనుక చెట్టునుండి ఎక్కువ పసరు తీయనక్కరలేదు. కొన్ని వరిగింజల ఎత్తు మందు నొక కల్వములో స్వీకరించి నూరు వరిగింజల ప్రమాణము పాల పంచదార చూర్ణముతో నూరుచు మూడు పర్యాయములు చేసి ఒక మిలియన్ భాగపు మందు ద్రవ్యమును సిద్ధపరుపవలెను. దీనిని సూక్ష్మీకరణము చేయుటకు ముందు కుదిలింపులు చేసి స్వీకరించుచు ఔషధము తయారుచేసికొనవలెను. శుష్కములైన మూలికలతో నైనను, చమురు పదార్థములతో నైనను ఔషధము నిట్లే తయారుచేసికొనవలెను.

**సూత్రము 272:** క్రొత్తగా రుగ్మత పొందిన వానికి పై విధమున సూక్ష్మీకరించిన మాత్ర వొకదానిని నాలుకపై నుంచిన చాలును. ఇప్పటి కొన్ని వేరములు మాత్రమే మందును స్పృశించును. కనుక అట్టి మాత్రను పాల చక్కెర పొడుముతో కలిపి చూర్ణముచేసి, కొంచె మెక్కువ నీటితో కలిపి కుదిలించిన వెంటనే వాడినచో నెక్కువ ప్రభావము చూపును. ఆ నీటిని ఎక్కువ రోజులు వాడవచ్చును. ఆ నీటిని అంత కొంచెము వాడినను ఒక్కొక్క మోతాదే పెక్కు నరములను స్పృశించును.

**సూత్రము 273:** ఏ రోగికైనను, ఎట్టి పరిస్థితులలో నైనను ఒక మందును వాడుచున్నపుడు ఇంకొకటి అక్కరలేదు, వాడరాదు. ఒక వ్యాధికి ఒకే మందు వాడుట మంచిదా లేక వివిద ప్రభావములు చూపు వివిధౌషధములను కలిపి వాడుట మంచిదా అను సందేహము కలుగుట హాస్యాస్పదము. ఈ హోమియోపతీ సిద్ధాంతము ననుసరించి ఒకేమారు రెండు వేరు వేరు మందులను వాడుట నిషిద్ధము.

**సూత్రము 274:** సూటియైన మందులను కలగలుపుచేయక ఏకౌషధ ప్రయోగ పద్ధతిని పాటించి వాడినచో కోరిన ఫలితము కోరినట్లు లభించును. (అనగా

కృత్రిమములైన వ్యాధి శక్తులు పుట్టి సారూప్య మార్గమున పనిచేయుచు నైసర్గిక వ్యాధులను అతిక్రమించి, అంతరింపజేసి నివారణమును పరిపూర్ణము చేయును.) సూటియైన మార్గముండగా క్లిష్టములైన మార్గముల జోలికి పోక వైద్యుడు బుద్ధిమంతుడై ప్రవర్తింపవలెను. ఎప్పుడును మందులను ఏకౌషధ ప్రయోగముగనే వినియోగింపవలెను. ఈ సూటియైన మందులు తమ ప్రభావమును ప్రదర్శించుట ఆరోగ్యవంతులపై వాడుట వలన అందలి సత్యము నిశ్శేషముగా ఋజువై యున్నది. అయినను రెండు మందులు గాని, అనేకములుగాని కలిపినచో ఒకదాని ప్రభావము నింకొకటి ఎట్లు మార్చునో తెలియదు. దాని ప్రభావము మానవ శరీరముపై నెట్లుండునో తెలిసికొనుట సాధ్యము కాదు. మరియు నొకమందు యొక్క వేదనా సముదాయము రోగి దేహమందలి వేదనా సముదాయము తో సారూప్యము చెందినచో ఆ యౌషధమొక్కటే అసహాయముగా ప్రభావము చూపునని స్పష్టముగా ఋజువుచేయబడినది. ఇక దానిని వాడునపుడు సారూప్యము సిద్ధింపనిచో నష్టమేమియును కలుగదు. దానివలన ప్రయోజన ముండకపోవుట యొక్కటే నష్టము. అట్టి సందర్భములలో తన వేదనలను వానియందు తాత్కాలికముగా ప్రేరేపించును. దీనివలన అదివరకే

ఋజువు చేయబడిన ఆ యౌషధ వేదనల స్వరూపము మరియొక మారు ఋజువగును. అనేకౌషధములు వాడినపుడు ఈ విషయమున గూడ పరిశీలించు నవకాశము లేదు.

వివరణము: శాస్త్రకారు డిచ్చట తన శాస్త్రమందలి ఔషధ విజ్ఞానమును క్రోడీకరించుచున్నాడు :

ఎ) ఆరోగ్యవంతుని దేహమున పుట్టిన వేదనలచే స్థిరపరచిన ఔషధములను మాత్రమే రోగులకు వాడవలెను.

బి) వానిని ఏకౌషధ ప్రయోగపద్ధతి ప్రకారమే వాడవలెను.

సి) మందులను కలిపి వాడినచో నొకదాని ప్రభావముల నింకొకటి ఎట్లు మార్చునో తెలియదు. దాని ప్రభావము మానవ దేహములపై నెట్లుండునో తెలియదు.

డి) వేదనల సారూప్యము వలన రోగములు నివారింపబడుననుట స్పష్టముగా తేలిన సత్యము.

ఇ) సారూప్యము లేకుండ పొరపాటుగా వాడినచో పనిచేయకపోవుట తప్ప మరియొక నష్టము కలుగదు. (పనిచేయకపోయినను గమనించకుండ వరుసగా నెక్కువ మోతాదులను వాడినచో నష్టము కలుగును. లేని రోగములు

పుట్టును. ఈ నష్టము అనేకౌషధములను వాడినపుడు మరింత ఎక్కువగా నుండును. కనుక అలోపతి విధానము వలన ఈ నష్టమింతకన్న చాల ఎక్కువ యున్నది.)

యఫ్) హోమియోపతీలో మందును సారూప్యము లేకుండ పొరపాటుగా ఒకే మోతాదును వాడినపుడు నష్టము లేదు. రాని వేదనల సముదాయము తాత్కాలికముగా రోగియందు కలుగవచ్చును. అప్పుడా మందుయొక్క వేదనా సముదాయమును మరియొకమారు ప్రయోగించి తెలిసికొనినట్లగును. కలిపి వాడినచో నిట్టి యవకాశము లేదు. (కనుకనే అనేకౌషధములతో చేయునట్టి అలోపతి విధానమునందు మందుల వేరు వేరు స్వభావములను నిజస్థితిలో తెలిసికొనుట కెపుడును అవకాశము లేదు.)

**మాత్రము 275:** వైద్యనైపుణ్యము సరియైన మందును సరియైన రోగికి వాడుటలో మాత్రమే లేదు. మందు నెంత తగ్గించి వాడవలెనో తెలియుటలో కూడ నున్నది. అనగా మందును నిర్ణయించుట ఎంతగా తెలియవలెనో పొటెన్సీ నిర్ణయించుట గూడ అంతగా తెలియవలెను. ఒక మందును వాడవలసిన దానికన్న నెక్కువ ప్రమాణములో వాడినచో కావలసిన దానికన్న నెక్కువ వేదనలు పుట్టి హాని కలిగించును. సారూప్య ముండుట వలన నెంతగా

పనిచేయునో అంతగనే హానికూడ కలిగించును. ప్రాణశక్తిపై నెక్కువ బాధ పుట్టించును. దానిమూలమున దేహభాగముల నెక్కువ బాధపెట్టును. దేహభాగములు మిక్కిలి సుకుమారములై యుండును. మరియు నైసర్గిక వ్యాధివలన అంతకుముందే పీడింపబడి యుండును.

వివరణము : వాడవలసిన దానికన్న ఔషధ పరిమాణ మెక్కువైనచో ప్రాణశక్తికి బాధ ఎక్కువగును. ఔషధ ప్రమాణ మెక్కువగుట యనగా కావలసిన దానికన్న తక్కువ పొటెన్సీలో వాడుట. దీనివలన స్పష్టపడుచున్న అంశములు:

ఎ) మందును వాడవలసిన దానికన్న నెక్కువ పొటెన్సీలో వాడినను, తక్కువ పొటెన్సీలో వాడినను దేహమునకు నష్టమున్నది.

బి) ఎక్కువ పొటెన్సీలలో వాడినప్పటికన్న తక్కువ పొటెన్సీలలో వాడినపుడు ఎక్కువ బాధ కలుగును. బాధాకరములైన ఉద్రేకములు పుట్టును. ఉన్న రోగ లక్షణములు తాత్కాలికముగా నెక్కువై ఎక్కువకాలము బాధపెట్టును. వెంటనే అదే మందును ఎక్కువ పొటెన్సీలో వాడినచో ఈ బాధలు తగ్గిపోవును.

సి) వాడవలసిన దానికన్న ఎక్కువ పొటెన్సీలో నొక మోతాదు వాడినను ఎక్కువ బాధగాని, నష్టముగాని

కలుగవు. తక్కువ పొటెన్సీలో వాడినచో ఔషధ లక్షణములు విజృంభించి దేహతత్త్వమునందు లోతుగా స్థిరపడును.

డి) ఏ మందునైనను 30 కన్న నెక్కువ పొటెన్సీలో వాడనని భీష్మించినవారివలన నిట్టి బాధలు ఎక్కువ కలుగును. అట్లే పెద్ద పెద్ద పొటెన్సీలలో లెక్కలేనన్ని మోతాదులు వాడువారి వలన మరికొన్ని బాధలు కలుగును. ఏ పొటెన్సీలోనైనను ప్రతిదినము ఒకటి రెండు మోతాదులను వాడుకొనుచుండుమని రోగికి మందుసీసా నిచ్చి పంపినచో అపారమైన అపకారము, కష్టనష్టములు కలుగును.

ఇ) హానిమన్ చెప్పిన విధమున ప్రతిదినము మోతాదులను వాడదలచినచో ఆతడు శాసించిన విధమున సొంతముగా మందులను తయారుచేసికొని ఒక్కొక్క మోతాదునే పొటెన్సీ ఆరోహణ క్రమమున మార్చుచు వాడవలెను. లేదా అదే పొటెన్సీ మరియొక మోతాదు వాడవలసిన విధానమున దినమున కొక మోతాదు పనికిరాదు. మొదటి మోతాదు వలన తగ్గుచున్నంత కాలము తరువాత మోతాదును వాడరాదు. కనుకనే షాపులో సీసా కొని ప్రతిదినము నొకటి రెండు మోతాదుల చొప్పున వాడుకొనుమని చెప్పుట అజ్ఞానము, రాక్షసత్వము.

**సూత్రము 276:** ఎ) వాడవలసిన దానికన్న నెక్కువ పరిమాణము గల ఔషధము వాడినపుడు కలుగు నష్టము సారూప్య మెక్కువైన కొలది నష్టమెక్కువ కలుగును. చక్కగా రోగి పరిస్థితితో సారూప్యము సిద్ధించిన ఔషధమైనచో అపారనష్టము కలుగును. అది వాని లక్షణములతో సరిపోయిన మందు కానపుడు నష్టము చాల తక్కువ కలుగును.

వివరణము : కావలసిన దానికన్న తక్కువ పొటెన్సీలో వాడబడిన ఔషధమునకు రోగి లక్షణములతో సారూప్య మెంత సిద్ధించిన నంత ఎక్కువ నష్టము కలుగును. కారణ మేమనగా సారూప్య మెక్కువైన కొలది ఔషధశక్తి ఎక్కువగా పనిచేయును. పరిమాణ మెక్కువైనపుడు ఈ పెరిగిన సామర్థ్యము హానిచేయుటకు వనికివచ్చును. సంబంధములేని మందు ప్రాణశక్తిని హెచ్చుగా కదలింపదు గనుక తక్కువ నష్టము కలుగును.

బి) సూక్ష్మముగా నిర్ణయింపబడిన మందు నెక్కువ పరిమాణమున, నెక్కువ తరచుగా వాడినచో చాల బాధ కలిగించును. ఆ మోతాదులు వానిని చంపుటయో, లేక వ్యాధి నివారణ కాని పరిస్థితిని కలిగించుటయో చేయును. అవి నైసర్గిక వ్యాధిని మొదటనే తొలగించును. అటుపైన అతడు పడు బాధలు నైసర్గిక వ్యాధికి సబంధించినవి

కావు. ఔషధము వలన కలిగిన అదేవిధమైన వ్యాధి చాల తీవ్రరూపమును ధరించి బాధించును. వానిని తొలగించుట ఎంత కష్టమో చెప్పలేను.

వివరణము: హోమియోపతీ మందు సీసాను రోగిచేతికిచ్చి ప్రతిదినము వాడుకొనుమని చెప్పుట వలన రోగి రానురాను ఎక్కువ రోగగ్రస్తుడై రోగములలో పాతుకొని పోవును. వైద్యుడు చాల తక్కువ పొటెన్సీలను మాత్రమే అభిమానించు బుద్ధిమంతుడైనచో వాని బారినుండి రోగులు బయటపడుట కల్ల.

**సూత్రము 277:** మందు పరిమాణమును తగినంతగా తగ్గించి వాడినచో సారూప్యము సిద్ధించిన కొలదియు నివారణము మిక్కిలి సుఖవంతముగా ఏ అపాయము జరుగకుండ కలుగును.

వివరణము: అవసరమునుబట్టి వీలయినంత ఎక్కువ పొటెన్సీలో వాడినచో ఔషధము సారూప్యమును బట్టి సౌకర్యము, నివారణమందు సౌఖ్యము కలుగును. (అనగా కావలసిన దానికన్న చాల పెద్ద పొటెన్సీలో వాడవలెనని అర్థముకాదు. పొటెన్సీ తక్కువ కాకుండ మాత్రము చూచుకొనుట క్షేమకరమని అర్థము.)

**సూత్రము 278:** అయినచో రోగనివారణ

సంపూర్ణముగను, సుఖవంతముగను జరుగుటకు తగిన పొటెన్సీ ఎట్టిదని ప్రశ్నింపవచ్చును. ఉత్తమమైన వ్యాధి నివారణము ఎంత తక్కువ మందుతో జరుగునని ప్రశ్నింపవచ్చును. ప్రతి ఔషధము వ్యాధి నివారణ కెంత పరిమాణము ఉండవలెను, ఎంతవరకు తగ్గించవచ్చును అని కూడ ప్రశ్నింపవచ్చును. దీనికి సమాధానము శాస్త్ర చర్చలకు, ఊహలకు సంబంధించినది కాదు. చక్కగా అల్లుకొని చెప్పిన హేతువాదములకు లొంగదు. ప్రత్యేకముగా సంకేతపరచి శాస్త్రీయ వివరణ చేయుటవలన లొంగదు. ప్రపంచమున సంభవింపగల వ్యాధుల వైఖరులను, వాని లేత ముదుళ్ళను ముందుగా నూహించి గణవిభజన చేసి వ్రాసి పెట్టుకొనుట ఎంత హాస్యాస్పదమో ఇదిగూడ నంతియే. ప్రతిరోగి విషయమునను, ప్రత్యేకముగా తన ప్రయోగ విజ్ఞానము వినియోగము చేయవలెను. ఒక్కొక్క రోగియందు గల ప్రాణశక్తియొక్క ప్రతిక్రియా సామర్థ్య విశేషమును గమనించుకొనవలెను. అనుభవమును నిర్దిష్టముగా స్వీకరించవలెను. అలోపతి విధానమందువలె మిక్కిలి పెద్ద పరిమాణములలో మందులు వాడుట మానవలెను. వ్యాధిగ్రస్తములైన అవయవములపై మాత్రమే పనిచేయుటకు కావలసినంత తక్కువ పరిమాణమును ప్రయోగింపవలెను.

**సూత్రము 279:** క్లిష్టతజెందిన వ్యాధులలోనైనను, దీర్ఘవ్యాధులలోనైనను ప్రధాన దేహభాగములు ఇంకను ధ్వంసముకాకున్న స్థితిలో వ్యాధియున్నపుడును, మరి ఏ యితర ఔషధములును వాడకుండ నిల్పివేయగల్గినపుడు సరియైన సారూప్యముతో, సరియైన పొటెన్సీలో వైద్యము ప్రారంభింపవలెను. అట్లు ప్రారంభము చేయునపుడు ఆ దీర్ఘవ్యాధి బలముకన్న ఔషధబలము తక్కువ కాకుండునట్లు పరిమాణమును నిర్ణయించుకొనవలెను. రోగ బాధలలో కొన్నిటినైనను తొలగింపగల ఔషధ పరిమాణమున్నచో వ్యాధి నివారణము ప్రారంభమైనట్లే.

**వివరణము:** ఎక్కువ పరిమాణమున మందును వాడినచో బాధలు ఎక్కువగు నంటిరి. ఇకనెంత తక్కువ పరిమాణములో మందు వాడవచ్చును? కావలసిన దానికన్న తక్కువైనచో మందు పనిచేయదు కదా! రోగముతో మందును తూకము చేయుట ఎట్లు అను ప్రశ్నలకు వీలయినంత సమాధాన మీయబడినది. అది ఎట్లనగా :

ఎ) ఔషధములను గూర్చి ప్రత్యేకముగా శ్రద్ధతో పారాయణ చేసినట్లే ప్రతి రోగిని ప్రత్యేకముగా పరిశీలింప వలెను. వాని రోగమందలి లేత ముదుళ్ల విషయమున తన ముందటి యనుభవము నుపయోగించవలెను.

అలోపతి మందులను వాడినట్లు ఎక్కువ మందునుగాని, తరుచైన మోతాదులనుగాని, కలగలుపు మందులమగాని వాడుట మానవలెను.

బి) ఒక రోగికి గల ప్రాణ ప్రతిక్రియా సామర్థ్యమును తూకముగా గమనింపవలెను. బాధలు విస్పష్టముగా, చురుకుగా పడుచున్నవాడైనచో ప్రతిక్రియా సామర్థ్యము ఎక్కువ అని తెలియవలెను. అనగా రోగమును పారద్రోలు శక్తి సహజముగా నెక్కువయని తెలియవలెను. అట్టివానికి మందు తక్కువ పరిమాణమున, తక్కువ మోతాదులను వాడవలెను. అనగా నెక్కువ పొటెన్సీలో కాల వ్యవధానము పెంచి వేచి చూచుచు వాడవలెను. బాధల సంఖ్య ఎక్కువగా నున్నను యిట్లే చేయవలెను.

సి) బాధల సంఖ్య తక్కువగా నున్నను, బాధలు విస్పష్టముగా నుండక మందకొడిగా నున్నను, నిదానముగా హెచ్చుచు, నిదానముగా తగ్గుచున్నను ఆ రోగికి ప్రతిక్రియాశక్తి తక్కువని గ్రహింపవలెను. అతనికి మందును తక్కువ పొటెన్సీలో (ఎక్కువ పరిమాణమున) ప్రారంభింపవలెను. మోతాదులను మొదటివాని కన్న తరచుగా వాడవలెను. తరుణవ్యాధులందైనను, దీర్ఘవ్యాధులందైనను ఇట్లే తూకము కట్టవలెను.

డి) ఇక దీర్ఘవ్యాధులు రెండు దశలలో కనిపించును:

i) దేహధాతువుల కెట్టి నష్టము కలుగని మొదటి దశలో నున్నవి యొక రకము. ఇందు వేదనల వాడిదన మెక్కువ యుండును. దేహభాగముల వ్యాపారము సక్రమముగా నుండును. ఇట్టి రోగులకు మందు ప్రారంభించునపుడు మందు పరిమాణము సరిపోవలెను గనుక మొదటి మోతాదును తక్కువ పొటెన్సీలో వాడవలెను. అది రోగమును పట్టుచిక్కించుకొని కొన్ని బాధలను మాయము చేయును. అనగా నివారణము సక్రమముగా ప్రారంభమైనట్లే. అటుపై మోతాదులను ఆరోహణ క్రమమున పొటెన్సీ పెంచుచు నొక్కొక్క మోతాదు వాడి వేచి చూచుచుండవలెను. బాధలు పూర్తిగా నివారణమైన మోతాదుతో వైద్యము నిలిపి వేయవలెను.

ii) చిరకాలము రోగి నాక్రమించి అవయవ భాగములను, దేహధాతువులను ధ్వంసము చేసిన స్థితిలో నున్న దీర్ఘవ్యాధులవారు కొందరుందురు. గుండె చెడిపోవుట, ఊపిరితిత్తులు చెడిపోవుట, లివరు చెడిపోవుట, జలోదరము, కుష్ఠు, పక్షవాతము, గ్యాంగ్రిన్ మున్నగు నుదాహరణములను గమనింపవచ్చును. వీనికి సామాన్యముగా సంపూర్ణ వ్యాధి నివారణ ప్రసక్తి లేదు. బాధోపశమనము మాత్రమే ఎక్కువమందిలో సాధ్యము.

ఇట్టి స్థితిలో తక్కువ పొటెన్సీ ప్రారంభించి పెంచకుండ కాలక్షేపము చేయవలెను. అదృష్టము బాగున్నచో సుదీర్ఘ కాలమునకు (కొన్ని నెలలకో, సంవత్సరములకో) ధాతువులు బాగుపడుచుండుట కలుగవచ్చును. అప్పు డుపశమనముగాక కొన్నిబాధల నివారణ జరుగును. దానిని గమనించి పొటెన్సీ పెంచి వాడవచ్చును.

ఇన్నిటిని గమనించి, సమీకరించి జె.టి. కెంటు అను శాస్త్రకారుడిట్లు నిర్ణయించి చెప్పెను :

ఎ) ఏ రోగికైనను వైద్యము ప్రారంభించునపుడు తత్త్వమును బట్టి 30, 200 పొటెన్సీలలో నొకదానితో వైద్యము ప్రారంభించుట క్షేమము. దీర్ఘవ్యాధులలో 30 పొటెన్సీతో ప్రారంభించి ఒక్కొక్క మోతాదు తరువాత రోగికి ప్రశాంతి లభించుచున్నంతకాలము తరువాత మోతాదు వాడరాదు. మరల బాధలు కల్గినపుడు తరువాత మోతాదు వాడవలెను. ఇట్లు వాడుచుండగా కొంతకాలమున కా పొటెన్సీ పనిచేయదు. అప్పుడు పొటెన్సీ పెంచి అదేవిధముగా వాడవలెను. ఈ క్రమమున నెంతవరకైనను పొటెన్సీ పెంచవచ్చును. ఏ మోతాదుతో బాధలన్నియు మాయమగునో దానితో వైద్యము నిలిపివేయవలెను.

బి) తరుణ వ్యాధులలో నెక్కువమందికి 200

పొటెన్సీతో ప్రారంభము చేయవలెను. రెండవ, మూడవ మోతాదులు వాడుటలో పై చెప్పిన క్రమమునే పాటించవలెను. పొటెన్సీ పెంచుట గూడ పై చెప్పిన విధముననే చేయవలెను.

సి) దీర్ఘవ్యాధులలో దేహధాతువులు చెడిపోయిన వారికి 30 పొటెన్సీలో గాని, మిక్కిలి శిధిలమైన వారికి ఇంకను తక్కువ పొటెన్సీలో గాని ప్రారంభింపవలెను.

డి) మానసిక లక్షణము లెక్కువగా ముదిరిన వ్యాధులలో 1M, 10M, 50M పొటెన్సీలలో నొకదానితో ప్రారంభింపవలెను.

**సూత్రము 280:** క్రొత్త బాధలు పుట్టక ప్రాతబాధలు శమించుచున్నంత కాలము నొకే ఔషధమును ఆరోహణ క్రమమున పొటెన్సీ పెంచుచు వాడవలెను. కొంతకాలమునకు మెల్లమెల్లగా పూర్వబాధ లొక్కొక్కటే మరల కనిపించును. ఈ దశను బట్టి వ్యాధి నివారణము దగ్గరపడినదని గ్రహింపవలెను. నైసర్గిక వ్యాధులను వదలించుకొనుటకు నిక దేహమునకు ఔషధ మక్కరలేదని అర్థము. అంతవరకును గల నైసర్గిక వ్యాధినుండి ప్రాణము విమోచనము జెందినదనియు, ప్రస్తుతము ఔషధ వ్యాధి లక్షణముల ననుభవించు చున్నదనియు గమనింపవలెను.

ఈ దశనే సారూప్యోద్రేకము (homoeopathic aggravation) అందురు.

**సూత్రము 281:** దీనిని గ్రహించుటకై రోగికి మందు మాని 8, 10, 15 దినములవరకు వేచి చూడవలెను. ఈలోపున ప్రతిదినము పాలచక్కెర మోతాదు లిచ్చు చుండవలెను. ఆ దశలో కనిపించుచున్న బాధలు మందునకు సంబంధించినవైనచో పూర్తిగా మాయమగును. ఆ దినములలో మందు వాడక పథ్యపానాది నియమము లను మాత్రము పాటింపు చేయవలెను. ఇక వ్యాధి లక్షణములు కనిపించనిచో నివారణమై యుండవచ్చును. కొన్నిదినముల తరువాత స్వల్పముగా బాధలు మరల కనిపించినచో అవి నైసర్గిక వ్యాధికి సంబంధించినవి. నైసర్గిక వ్యాధి పూర్తిగా బహిష్కరింప బడలేదు. అప్పుడు మరల పొటెన్సీ పెంచి ఇదివరకు వలెనే వాడవలెను. క్రమనివారణ కనిపించుచున్నచో పూర్వము చెప్పినట్లే ఆరోహణక్రమమున పొటెన్సీ పెంచుచు వాడవలెను. ఉద్రేకము హెచ్చుగా కనిపించు వారిలో నెక్కువ కాల వ్యవధానమున తక్కువ మోతాదులు వాడవలెను. ఉద్రేకించుట మందమందముగా నున్నచో నెక్కువ మోతాదులను తక్కువ కాల వ్యవధులలో వాడవలెను. మందకొడిగా ప్రభావము చూపువారికిని, త్వరగా చూపువారికిని గల భేద నిష్పత్తి నూరురెట్ల వరకును

కనిపించును.

**సూత్రము 282:** వైద్యము జరుగుచున్నపుడు ముఖ్యముగా దీర్ఘవ్యాధులలో మొదటి మోతాదునకు సారూప్యోద్రేకము కనిపించి నైసర్గికవ్యాధి లక్షణము లన్నియు తాత్కాలికముగా హెచ్చినపుడు, తరువాత మోతాదు వాడినపుడెల్ల హెచ్చుచున్నవుడు మందు పరిమాణము చాల ఎక్కువగా నున్నదని గ్రహింపవలెను.

**సూత్రము 283:** అందువలననే రోగి స్వభావము ననుసరించి నిపుణుడైన వైద్యుడు వీలయినంత తక్కువ పరిమాణముగల మందుతోనే వైద్యము ప్రారంభించును. మానవ సహజమైన పొరపాటున రోగికి సరిపోని మందు ప్రయోగింపబడినచో ఆ మొదటి మోతాదు తక్కువ పరిమాణ మయినపుడే రోగి ప్రాణశక్తి దానిని తిరస్కరించుట సులభము.

**సూత్రము 284:** నాలుక, నోరు, జీర్ణకోశము మందు వాడుటకు తగిన ప్రదేశములు. అట్లే నాసా రంధ్రములు, శ్వాసకోశము కూడ తగినవే. మందును త్రాగుటగాని, వాసన చూచుటగాని చేయవచ్చును. ఇక చర్మముతో కప్పబడిన మిగిలిన దేహభాగములు కూడ కషాయములను, తైలాదులను మర్దించుటకు పనికివచ్చును. ఇవన్నియు

నోటితోగాని, ముక్కుతోగాని ప్రధానౌషధ సేవనము జరుగుచున్నపుడు మాత్రమే పనికివచ్చును.

**సూత్రము 285:** ఏ ఔషధమును లోపలికి సేవించుటవలన నివారణ మాశింపబడుచున్నదో దానినే వీపునకు గాని, భుజములకు గాని, అరచేతులకు గాని, అరికాళ్ళకు గాని మర్దించుట కూడ చేయవచ్చును. చాల పురాతనముగా నున్న వ్యాధులలో నిది ఉపకరించును. అపుడు కూడ నొప్పి, బాధ, అదరుడు, చర్మవ్యాధి యున్న తావులను విడచి మిగిలిన తావులందు మాత్రమే మర్దింపవలెను.

**వివరణము:** సుదీర్ఘకాలమునుండి వాపులు నిలిచిపోయినచోట సారూప్యౌషధమును నొప్పి పెట్టకుండ రుద్దవచ్చును. అట్లే గాయములకు పైన మందు వాడవచ్చును. (చర్మవ్యాధులకు వాడరాదు) ఎముకల జబ్బులు, కీళ్లనొప్పులు మున్నగు తావులందు కూడ నొక్కి మర్దింపక దాని చుట్టుపట్టులలో సౌమ్యముగా మందును రుద్దవచ్చును.

**సూత్రము 286:** అయస్కాంతములు, విద్యుచ్ఛక్తి మొదలగునవి కూడ ఔషధముల వలెనే ప్రాణశక్తిపై ప్రభావమును చూపును. ఔషధమును లోపలికి సేవించుట,

చర్మమునకు రుద్దుట ఎంత యుపకరించునో ఇవి కూడ నంతగా నుపకరించును. ఉద్రేకములకు, చేతన బాధలకు, అనుభావ వికారములకు, వశము తప్పి జరుగునట్టి కండరముల కదలికలు మున్నగునవి గల రోగములకు వీనితో నివారణమ్ము చేయు నావశ్యకత కూడ నుండవచ్చును. కాని ఈ విధానములను, విద్యుదయస్కాంత యంత్రములను వాడు విధానములను సారూప్యముగా వినియోగించుట ఇంకను గమనికకు రాని స్థితియందే యున్నది. ఇంతవరకును విద్యుచ్ఛక్తి తాత్కాలి కోపశమనమునకు మాత్రమే వాడబడుచున్నది. దానివలన తీరని నష్టములు కలుగుచున్నవి. వీని ప్రభావ మింత వరకును ఆరోగ్యవంతుని దేహముపై పరిశీలనచేయబడక మాటుపడి యున్నది.

వివరణము: అలోపతి విధానమున తలనొప్పి, కీళ్లనొప్పులు, పక్షవాతము, గ్రంథులు, కణుతులు, ఎముకల కురుపులు మున్నగువాని యందు విద్యుచ్ఛక్తి వాడబడుచున్నది. అట్లే అల్ట్రావైలట్ కిరణములు, ఇన్‌ఫ్రారెడ్ కిరణములు, గామా కిరణములు, ఎక్సురే, రేడియం, కోబాల్ట్ మున్నగు పద్ధతులు గూడ అలోపతిలో వాడబడుచున్నవి. వీని వలన బాగుపడి బ్రతికి బట్టకట్టిననాడు వైద్యచరిత్రలో లేడని నొక్కి చెప్పుట

అపరాధము కాదు. ఈ చికిత్సల పాలబడిన వారు వికలాంగులు, నిరంతర బాధాపీడితులు, అల్పాయుష్కులునై కృశించి నశించుచున్నారు. ఈ చికిత్సలు పొందిన వెనుక నెట్టి యౌషధమును, ఏ ప్రక్రియలును పనిచేయని స్థితి వెంటనే ఏర్పడును. దుర్మరణమే శరణము. పిచ్చివారి తలకు విద్యుద్ఘాతములు (electric shocks) ఇచ్చుట కూడ నిట్టిదే. ఇట్టి శాస్త్రీయమైన అజ్ఞాన పద్ధతికి గురి అగుటకన్న రోగముతో చచ్చుట ఎక్కువ సుఖమరణమును కలుగజేయును.

ఇదికాక ఈ ప్రకృతి మహాశక్తులను సారూప్య విధానమున వినియోగించి నివారణోపాయములు కనిపెట్టుటకు ఈదిగువ సూత్రములలో శాస్త్రాచార్యుడు చక్కని సూచనల నిచ్చియున్నాడు. ఆ సూచనలు స్వీకరించి అతని యడుగు జాడలలో నడచిపోయిన ఎలన్ మొదలగు మహానుభావులు దానిని ఎంతగానో వృద్ధిచేసిరి. వారి తపస్సు వలన ఎలక్ట్రిసిటాస్, మాగ్నటాస్, ఎక్సురే, యురేనియం మొదలగు మహౌషధములు నిరూపింపబడి గుణ నిర్ణయముతో, మెటీరియా మెడికాతో వాడవలసిన విధానములో నేటికి సంసిద్ధములై యున్నవి. వానితో అంత దుష్కరములైన వ్యాధులు ఆశ్చర్యకరముగా నివారింప బడుట అనుభవమునకు తెలిసిన విషయము.

**సూత్రము 287:** అయస్కాంతము యొక్క వ్యాధి నివారణ శక్తులు నేను రచించిన 'మెటీరియా మెడికా ప్యూరా' అను గ్రంథమున సాకల్యముగా నిరూపింపబడినవి. అయస్కాంతము యొక్క ఉత్తరధృవ లక్షణములను, దక్షిణధృవ లక్షణములును వేరువేరుగా నిరూపింపబడినవి. ఈ రెండు ధృవములును సమానబలము కలవియే అయినను ప్రభావము చూపుటయందుమాత్రము పరస్పర విరుద్ధ లక్షణములు కలిగియున్నవి. ఉత్తర దక్షిణ ధృవములు వేదనా సముదాయముల ననుసరించి కావలసిన ధృవమును స్పర్శ కలిగించి స్పర్శాకాలము యొక్క దీర్ఘతను బట్టి మోతాదులుగా వాడవచ్చును. దీని చికిత్సా ప్రభావము, తీవ్రత ఎక్కువైనచో నున్నని తుత్తునాగపు రేకును (zinc plate) స్పృశింప చేసినచో తగ్గింపవచ్చును.

**సూత్రము 288:** ఇచ్చట జీవసమ్మోహన శక్తినిగూర్చి కొంచెము ప్రసంగించు సందర్భమున్నది. దీనినే మెస్మరిజం అనియు వ్యవహరింతురు. దీనిని స్థాపించినవాడు మెస్మర్. అతని పేరుతో నిది వ్యవహరింపబడుచున్నది. ఇది మిగిలిన వ్యాధినివారణ సాధనములకన్న విలక్షణమైనది. ఒక శతాబ్దముపాటు దీనినిగూర్చి హేళనచేసినవారును, ఇట్టి శక్తియే లేదని వాదించిన వారును కూడ కొందరు బుద్ధిహీనులు కలరు. ఈ శక్తి అనేక విధములుగా

పనిచేయును. ఇది ఆశ్చర్యకరమైన శక్తి. ఇది నరజాతికి భగవంతుడు ప్రసాదించిన అమూల్య బహుమతి. సత్సంకల్పము కలవాడు, బలిష్ఠమైన ఇచ్ఛాశక్తి కలవాడు అగు పురుషు డెవడైన స్పృశించియైనను, రోగిని స్పృశింపకయైనను దీనిని ప్రసరింపచేయవచ్చును. చేసి తనలోని ప్రాణశక్తిని చేతన స్వరూపముగా నింకొకని లోనికి పంపవచ్చును. శక్తిమంతమైన అయస్కాంతముయొక్క ధ్రువము స్పర్శ లేకుండకూడ యినుప ముక్కపై ప్రభావము చూపుచున్నది కదా! అట్లే ఈ మహాశక్తియును!

రోగియందలి దేహమున అందందు ప్రాణశక్తి తక్కువగా నున్న తావులలో నిది పూరకముగా పని చేయును. ఇంకను రోగి దేహమున ప్రాణశక్తి కొన్ని తావులలో నెక్కువగా చేరి క్రిక్కిరిసి యుండుటవలన ఉద్రిక్తములైన నరముల వ్యాధులు పుట్టును. అట్టి తావులం దీ శక్తి ప్రాణశక్తిని సమీకరణము చేయగలదు. ఇంకను వ్యాధిగ్రస్తమైన స్థితినుండి ప్రాణశక్తిని ఆరోగ్యస్థితికి గొనివచ్చుటకు నీ శక్తి నుపాసించినవాడు తన సామర్థ్యము నుపయోగించి సాధింపవచ్చును. చాల కాలమునుండి నయముకాని వ్రణములు, గడ్డలు, పక్షవాతము ఒక్కొక్క అవయవభాగము నందున్నపుడు దీని నుపయోగించి నివారణ చేయవచ్చును. యుగయుగములలో తమ నైసర్గిక

సంకల్ప బలముతో వ్యాధులను నివారణచేసిన మహానుభావులిట్టివారే. అనురాగ పూరితమైన సంకల్పముతో ఆరోగ్య సంపన్నుడు, శక్తిమంతుడు అగువాడు ఈ నరశక్తిని తననుండి ఇంకొక దేహము మొత్తమునకు ప్రసరింప జేసినపుడు దీని ఫలితములు తెలిసినవి. చనిపోయిన స్థితివలె కనిపించు స్థితిలో కొంతకాల మున్నవారు దీనిచే బ్రతికింపబడిరి. ఈవిధమైన మృతకోద్ధావనక్రియ విషయమున చరిత్రలో నెవ్వరును కాదనుటకు వీలులేని ఉదాహరణము లున్నవి.

దీని నాధారముగా జేసికొని అంధ విశ్వాసములు, ఆవేశాభిమానములు, ఊహాప్రపంచములు, జీవకారుణ్య సుఖ స్వప్న ములు మొదలగు పతిత మార్గము లనేకములు పుట్టి యుండవచ్చును. కాని వానికన్న వేరుగా దీనికి సత్యమయిన అస్తిత్వము ఉన్నది. సాధు స్వభావముగల స్త్రీ పురుషులలో నెవరైనను దీనిని నిర్వహింపగలరు. సత్సంకల్పపూరితమైన ఉత్సాహముకలవారు ఈ జీవకారుణ్య మయమైన, ఆత్మసమర్పణపూరితమైన ప్రదర్శనము చేయగలరు. ఆజ్ఞారూపమైన సత్సంకల్పము రూపమున దీనిని ప్రసారితము చేసి తన సహాయము నపేక్షించు వారికి సంక్రమింప చేయగలరు. మహిమలు అని చెప్పదగిన ఫలితములను గూడ వీరు తమ శక్తి

కేంద్రీకరణముచే సిద్ధింప జేయగలరు.

వివరణము: విశ్వప్రేమను దైవముగా తెలిసి ఆత్మసాధన చేయువారికి సహజముగా కొన్ని లక్షణములు సిద్ధించును. ఇవి ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములలో ప్రసరించుచుండు శక్తి, సాధకుని అంతరాత్మ యెడల మేల్కొనుట వలన ఈ లక్షణము లబ్బును. అట్టి వారి దర్శన, స్పర్శన, సంభాషణ, సహవాసములును, ఆశీర్వచనము వలన నెదుటి వారి ప్రాణమయాది కోశములు వీలయినంతవరకు చక్కబడుచుండుట జరుగును. అప్పుడు వారిలోని లోపములు గూడ సర్దుకొనుచుండును. దానిలో నొక భాగముగా వారి వ్యాధులు కూడ నివారణమగును. ఇది భారతదేశమున యుగముల తరబడి పరిచితమైన విషయము. దీని అస్తిత్వము తెల్లజాతివారు గుర్తించినప్పటినుండియు దీని వినియోగ ప్రయత్నములు జరిగినవి. ఈ మార్గము స్థాపించినది మెస్మర్ అను శాస్త్రజ్ఞుడు గనుక దీనికి 'మెస్మరిజం' అను పేరు వచ్చెను. విషయము క్రొత్తగనుక చాలమంది మొట్టమొదట హేళన చేసిరి. శాస్త్రజ్ఞు లనబడు భౌతికవాదులు సంకుచిత దృష్టితో నిది అసత్యమని వాదించిరి. పూర్వ శతాబ్దములలో ఏసుక్రీస్తు, అతని సమకాలికుడగు అపలోనియస్ మున్నగువారు ఈ

విషయమున అప్రయత్న సిద్ధములగు మహిమలు చూపిరి. వీరిలో నెవరును పాశ్చాత్యులు కాకపోవుటచేత ఈ విద్య చాలాకాలము వారి బుద్ధుల కెక్కలేదు. సకలమును దర్శింపగల హానిమన్ మానవజాతిపై తనకు గల అపార భూతదయవలన ఈ శక్తిని పొంది, వినియోగించి వ్యాధులను నివారించిన అనుభవమున ఈ సూత్రములను రచించెను. ఇది ప్రాణశక్తి వలన నిర్వహింపబడుననియు, రోగియందలి ప్రాణమయ కోశముపై ప్రభావము కలిగి యుండుటచే వ్యాధి నివారణకు వాడవచ్చుననియు స్థాపించెను. కురుపులు మున్నగు వానియందు ప్రాణ ప్రసారము క్రిక్కిరిసి యుండుట జరుగును. దానిని సంకల్పముతో సరిచేయవచ్చునని వివరించుచున్నాడు.

ఈ సందర్భమున నివారణ చేయువాడు తన దేహమందలి ప్రాణశక్తిని వినియోగింపవలెనని వివరించెను. ఇది కూడ నొక పద్ధతియే అయినను సరియైన పద్ధతి కాదు. దీనివలన వైద్యుడు క్రమముగా ప్రాణశక్తిని కోల్పోయి దుర్బలుడగును. వ్యాధులు కూడ కలుగును. ఇదికాక మరియొక పద్ధతి యున్నది. రోగియందలి శరీర భాగములను స్మరించుచు వానిలోని దైవాంశమును వాని ప్రాణశక్తి కందుబాటులోనికి తెచ్చుట. ఈ పద్ధతిలో రోగిని కూడ దేవుని మూర్తులలో నొకడుగా ధ్యానించుట నేర్చుకొనవలెను. ఈ పద్ధతిలో వ్యాధులు నివారణము

కాగా వైద్యుని శక్తి క్షీణింపదు. నానాటికి వృద్ధి పొందును.

**సూత్రము 289:** ఈ పద్ధతులన్ని రోగిలోనికి కొంత ప్రాణశక్తిని ప్రసరింపజేయు ప్రయత్నములై యుండును గనుక నిది ఋణ, ధన సాంజ్ఞలలో ధనసాంజ్ఞకు చెందిన శక్తి ప్రసారము. ఇదికాక ఋణసాంజ్ఞకు చెందిన దానిని కూడ గమనింపవచ్చును. ఇది మొదటిదానికి వ్యుత్క్రమమైన లక్షణములు కలదియై దానికి వ్యతిరిక్తములైన ఫలిత ములను పుట్టించును. సమ్మోహితులై నిద్రించు వారిని మేల్కొలుపుటకు చేయు హస్త సంచాలనములు ఈ తరగతికి చెందినవి. ఇంకను దీవించుట, శుభాశంసనము చేయుట మొదలగునవి కూడ నీ తరగతికి చెందును. ఇట్లు చేయుట నీరసము చెందని రోగుల విషయమున పనికివచ్చును. వారి దేహమున కొన్ని ప్రాంతములందు క్రిక్కిరిసిన ప్రాణశక్తిని వెలువరించుట ఈ ఋణసాంజ్ఞ పద్ధతిలో జరుగును. చేయి ముందునకు చాచి చేతివ్రేళ్లను పూర్తిగా తెరచియుంచి రోగి దేహమునకు నొక యంగుళము దూరమున తాకకుండ నిలిపి శిరస్సునుండి పాదాంతము దాక వేగముగా దిగదుడుపు చేయుట వలన సులభముగా ఈ శక్తిని పుట్టింపవచ్చును. దీనినెంత వేగముగా చేసిన నంత శీఘ్రముగా, ఫలవంతముగా ప్రాణశక్తిని రోగియందు క్రిక్కిరిసిన స్థలముల నుండి విడివడుట చేయవచ్చును. ఉదాహరణకు: ఒక ఆరోగ్యవంతమైన స్త్రీ ఆకస్మికముగా

బలీయమ్మైన మానసిక ఘాతముచేత తెలివితప్పి పడిపోయినదనుకొనుము. లక్షణము లన్నియు చనిపోయిన స్థితినే సూచింపవచ్చును. ఆమె లోని ప్రాణశక్తి గుండెకాయ పై పొరచుట్టును క్రిక్కిరిసి యుండును. ఆమెపై నిట్టి ప్రసారమును చేతితో ఆపాదమస్తకము చేసిన యెడల శరీరము వెుుత్తమునందును సమప్రసారము ప్రారంభమగును. వెంటనే ఆమె బ్రతికి లేచును. అట్లే నిదానముగా నొక ధనసంజ్ఞా ప్రసారమును చేయుటవలన మనసునకు స్థాయి లేకుండుట, నిద్ర పట్టకుండుట, ఆతురత మొదలగు వానిని నివారింపవచ్చును. ఈ లక్షణములు ధనసాంజ్ఞ ప్రసారమునందలి ఆధిక్యము వలన గలిగిన వారికి గూడ ఋణసాంజ్ఞ ప్రసారమువలన నివారింపవచ్చును.

వివరణము: వైద్యుని నుండి రోగి లోనికి ప్రాణశక్తి ప్రసరింపచేయుట ధనసాంజ్ఞ (transmitting), రోగియందలి ప్రాణశక్తిని వెలుపలకు మేల్కొలుపుట ఋణసాంజ్ఞ (receiving). ఈ రెండు పద్ధతులలో దేని నెప్పుడు వాడవలెనో వివరించుచున్నాడు. రోగియందు నీరసము, ప్రాణశక్తి తక్కువగుట అతని బాధలకు కారణమైనపుడు అతనిలోనికి శక్తిని పంపవలెను గనుక ధన సాంజ్ఞ పద్ధతిని శక్తిని పంపవలెను. నీరసము లేనపుడు

ఆకస్మిక కారణముల వలన సంభవించిన ఆపదలో రోగియందలి ప్రాణశక్తిని మేల్కొలుపవలెను గనుక ఋణసాంజ్ఞ పద్ధతి నుపయోగింప వలెను.

ఇంకొక విశేషము కూడ చెప్పబడినది. ధనసాంజ్ఞ పద్ధతిని వాడునపుడు వైద్యుడు రోగిని స్పృశింపవలెను. అప్పుడు వైద్యుని నుండి రోగిలోనికి ప్రాణశక్తి ప్రసరించును. ఇది అయస్కాంతముతో యినుప ముక్కను తాకుట వంటిది. అట్లు కాక ఋణసాంజ్ఞ పద్ధతిని వాడవలసినపుడు తాకక రోగి శరీరమునుండి అంగుళము దూరముగా చేతితో ప్రసారము చేయవలెను. ఇచ్చట రోగి దేహమందలి ప్రాణశక్తియొక్క ప్రభావమువలన స్పర్శతో సంబంధము లేకయే రోగిలోని ప్రాణశక్తి మేల్కాంచి ప్రసారమగును. ఇందాశ్చర్య పడవలసిన విషయమేమియును లేదు. దూరదూరముగా కూర్చుండి సంభాషించుకొనుచున్న ఇద్దరు నడుమ జరుగునట్టి అభిప్రాయముల ప్రేరేపణ మిట్టిదే. ఇది మనకు పరిచితము గనుక ఆశ్చర్యపడము. సంభాషణ లేకుండకూడ మొగములు చూచుకొని ఎదుటివారిలోని అయస్కాంత శక్తి వికారములైన యిష్టాయిష్టములను, రాగ ద్వేషములను పట్టి మొగము ముడుచుకొనుట, వికాస మందుట జరుగుచున్నదికదా! ఈ ప్రభావమునే తెలిసి శిక్షణబొంది క్రమము ననుసరించి వాడినచో ఇచ్చట శాస్త్రకారుడు చెప్పిన రోగ నివారణ సిద్ధించును.

**సూత్రము 290:** ఒక్కొక్కప్పుడు వైద్యము తరువాత దీర్ఘవ్యాధి నివారణము పూర్తిగా జరిగినను చిరకాలము రోగి శుష్కించి యుండుటయో, జీర్ణశక్తి పెరుగకుండుటయో, నిద్ర పట్టకుండుటయో కూడ గమనించుచున్నాము. కోలుకొనుటకు మిక్కిలి ఆలస్యము జరిగిన తావులలో నిట్టివి కనిపించును. వానికి సాధుస్వభావముగల చురుకైనవారిచేత కొన్నాళ్లు మెల్లగా మాలీసు చేయించినచో కావలసిన యభివృద్ధి కలుగును. ఇది కూడ సంకల్పశక్తి ప్రసారమునందలి ధన సౌంజ్ఞ ప్రసారము విధానమున జరుగుచున్నది. ఈ ప్రక్రియలో కాళ్లు చేతుల కండరములను రొమ్ము వీపు నందలి కండరములను వేరు వేరుగా తగుమాత్రము బిగించి పట్టి సవర దీసినచో రోగిలోని ప్రాణశక్తి మేల్కొంచి కండర ములకు, రక్తమునకు, రసధాతువునకు, నాళములకు సంబంధించిన నిర్మాణ సామర్థ్యమును మేల్కొల్పును. ఇట్టి ప్రక్రియలలో మెస్మర్ చెప్పిన ప్రభావమే పనిచేయుచున్నది. రోగి ఇంకను నీరసముగా నున్న స్థితిలో మాత్రము దీనిని విశేషముగా వాడరాదు.

వివరణము: వాడినచో మాలీసు సున్నితముగా చేసినను,రోగికి భౌతికశ్రమ పుట్టకపోయినను దీనివలన నష్టమున్నది. మాలీసు చేయువాని చేతులనుండి

ప్రసరించుచున్న దృఢమైన ధనసాంజ్ఞాశక్తి ధారకు రోగి దేహాణువులు నీరస స్థితిలో తట్టుకొనలేక పోవచ్చును. తీగలు భరింపగలిగిన దానికన్న నెక్కువ విద్యుత్తును ఆ తీగలలోనికి ప్రసరింపచేసినచో నేమగును? తీగలు వేడెక్కును. ఒక్కొక్కప్పుడు వేడి ఎక్కువై మాడిపోవును. అట్లే రోగిలో నీరసము, గుండెదడ పుట్టవచ్చును. కొంచెము బలము చేకూరిన తరువాతనే మాలీసు ప్రారంభము చేయవలెను.

మనము మేల్కొని పనిచేయుచున్నపుడు ఆకసము లోని ప్రాణశక్తి మేల్కొని దేహములోనికి ప్రసరించు చుండును. దేహము భరింప గలిగినదానికన్న నెక్కువ విద్యుత్తు దేహముపై జల్లులుగా పడినపుడు దానిని స్వీకరింపలేని స్థితియే అలసట అందుము. అంతేకాని పని ఎక్కువసేపు చేయుట కారణముగా అలసట పుట్టదు. భరింప గలిగిన దానికన్న నెక్కువ విద్యుత్తు దేహములోనికి ప్రసరించినచో దేహము విడిపోవు టారంభించును. అదియే మృత్యువు. దానినుండి కాపాడుటకై విద్యుత్ప్రవాహము ఎక్కువైనపు డెల్ల నిలుపు చేయుటకు నిద్రవచ్చును. అలసినచో నిద్ర వచ్చుట మనకు ప్రకృతి ప్రసాదించిన రక్షణ మార్గములలో నొకటి. దీని శాస్త్రీయ వివరణము లన్నియు తెలిసికొనగోరినవారు హెలీనా పెట్రోవా బ్లావెట్స్కీ

రచించిన "ఆయిసిన్ అన్‌వీల్డు" అను గ్రంథమున చూడవచ్చును. కావలసిన విద్యుత్తుకన్న నెక్కువ దేహమునకు సోకినపుడు చనిపోవుదు మనుటకు విద్యుత్ తీగలను తాకినచో చనిపోవుటయే నిదర్శనము. విద్యుత్తు, మనలోని ప్రాణశక్తి ఒకటే గాని వేరుకావు.

**సూత్రము 291:** స్వచ్ఛమైన జలములతో స్నానము చేయించుట వలన రోగికి కొంత బాధోపశమనము, కొంత సారూప్య వైద్య ప్రక్రియయుకూడ జరుగును. ఇవి త్వరగా ఆరోగ్యము చక్కబడుటకు సహాయపడును. తరుణవ్యాధుల వైద్యము నందును, దీర్ఘవ్యాధుల వైద్యమయిన తరువాత కోలుకొనుట యందును ఇవి యుపకరించును. కోలుకొనుచున్నవాని దేహ పరిస్థితిని పట్టి స్నానములను చేయించవలెను. రోగి స్థితి కనుకూలముగా నీటి ఉష్ణత, స్నానము చేయించు కాలము, రెండు స్నానముల మధ్య వ్యవధానము నిర్ణయింపవలెను. తిన్నగా, అనుకూలముగా వాడినను వీనివలన కలుగునది రోగి భౌతిక దేహమునకు సంబంధించిన అనుకూలత మాత్రమే. స్వయముగా వానియందు వైద్యప్రక్రియ ఎట్టిదియును లేదు. చనిపోయినట్లు కనిపించువారిలో నరముల చైతన్యము మందతగొనియుండును. అట్టి వారిలో కునికిపాటు పడుచున్న చైతన్యమును మేల్కొలుపుటకు గోరువెచ్చని

నీటితో స్నానములు (25$^0$ నుండి 27$^0$ ర్యామరు ఉష్ణోగ్రతలో) పనికివచ్చును. ఇవి కేవలము ఉపశమనమునే కలిగించినను ముఖ్యముగా రోగికి కాఫీ ఇచ్చి చేతులతో దేహము తోముచు స్నానము చేయించినచో చక్కని చురుకుదనము కలిగించును. శరీరమున చైతన్య ప్రకోపము ఆయా భాగములలో నెగుడు దిగుడుగా క్రిక్కిరిసి యున్నను, కొన్ని అవయవములలో నెక్కువగా సమ్మర్దము కలిగియున్నను ఈ స్నానములు సారూప్య సాధనమును కలుగచేయును. ముఖ్యముగా హిస్టీరియా వ్యాధిలోను, చిన్న బిడ్డ చేష్టలను వ్యాధిలోను కలిగిన బిగింపులను సడల చేయును. ఇవి గోరువెచ్చని స్నానముల ఉపయోగ ములు.

అదేవిధముగా చన్నీటి స్నానములు కూడ నుపయోగ పడును. 10$^0$ నుండి 6$^0$ వరకు ర్యామరు ఉష్ణోగ్రతగల నీటితో స్నానములు దీర్ఘవ్యాధుల యందు ఔషధ సేవనము చేయుచున్నవారికి ఉపకరించును. జీవశక్తి పుట్టించు వేడిమి తక్కువగా నున్నపుడు ఈ చన్నీటి స్నానములు సారూప్యమునకు సహకరించును. ఆకస్మికముగా ఛన్నీరు జల్లుటయు, తరువాత అనేక పర్యాయములు చన్నీటిలో మునుగుటయు బడలిన, పట్టుతప్పిన దేహధాతువుల పుష్టిని సమకూర్చుటకు పనికి వచ్చును. దీని యుపయోగము

కలుగవలెనన్నచో కొద్ది నిమిషములు స్నానముచేయుట చాలదు. ఉష్ణోగ్రతను క్రమముగా తగ్గించుచు స్నానము చేయుచుండుటయు, కొన్ని నిమిషములు మాత్రమే చన్నీటి స్నానము చేసి వచ్చుటయు నెక్కువ యుపకరింపవు. ఉపశమనము మాత్రము కలిగించును. ఎట్లయినను వీని ప్రభావము కేవలము భౌతికమే గనుక ఔషధముల విషయమునవలె ప్రతిక్రియా ప్రభావము నందలి కష్టనష్టములు కలుగునని భయపడనక్కర లేదు.

వివరణము: స్నానముల విషయమున హానిమన్ ప్రతిపాదించిన విషయమునకును, ఆయుర్వేద శాస్త్రకారులకును కొన్ని భేదములు కనిపించుచున్నవి. అట్లే దేహమునకు ఔషధమును మర్దించుట చెప్పిన తావులందును భేదమున్నది :

ఎ) ఇతని దృష్టిలో స్నానము ముఖ్యమైన వైద్య ప్రక్రియలలో నొకటి కాదు. ప్రక్రియ గూడ మిక్కిలి స్వల్పము. ఆయుర్వేదమున అభ్యంగన మనునది ఆరోగ్యరక్షణమునకు ఆవశ్యకమగు ప్రక్రియ. దీనివలన మిగిలిన వారికి కలిగిన రోగములు నిత్యాభ్యంగనము చేయువానికి కలుగవనుట అనుభవసిద్ధము. అంతేకాదు. కన్నులు, ముక్కులు, గొంతుక, చెవులు, శిరస్సులకు

చిరకాలము దృఢత్వము నిలిచి యుండును. వీనికి గల రోగములు గూడ అభ్యంగన ప్రక్రియతో నశించును.

బి) తీవ్ర జ్వరాదులలో ఆయుర్వేదమున కేవల స్నానమే యొక చక్కని వైద్యప్రక్రియ. తీవ్ర జ్వరముతో బాధపడువానికి, అది ఏ జాతి జ్వరమైనను దేహమునకు నువ్వులనూనె రాచి ఒక చెంచా పేరిననేతిని తినిపించి, గ్లాసెడు వేడినీళ్ల త్రాగించి, వేడినీటి స్నానము చేయించినచో చికిత్సలో చక్కని సారూప్యము సిద్ధించును. జ్వరము తగ్గుట మాత్రమేగాక వ్యాధి మొత్తము నివారణ మగును. టైఫాయిడు, న్యూమోనియాలతో గూడిన తీవ్ర జ్వరవ్యాధులు, డెలీరియము, సంధి లక్షణములతో గూడినవి ఈ అభ్యంగన ప్రక్రియతో నివారణమగునను విషయమున వందల కొలది ఉదాహరణములను మాతండ్రిగారి వైద్యమున మేమెరుగుదుము.

సి) ఔషధమును తైలముల ఘృతముల రూపమున మాలీసునకును, అభ్యంగనమునకును వాడుట ఆయుర్వేద మందలి వివిధ వ్యాధి చికిత్సల ప్రత్యేక పద్ధతులలో నొకటి.

డి) స్నానము, దంతధావనము, తైలమర్దనము, అంజనము మున్నగు నంశములన్నియు ఆయుర్వేదమున ఆరోగ్యవంతుని దినచర్యకొరకు నవిశేషముగా

శాసింపబడినవి. అందలి ఆచారకాండ పాటించువానికి తరతరముల వ్యాధులు నివారణ మగుట అనుభవమునకు సరిపడుచున్నది. అంతేకాక చనిపోవు క్షణము వరకును ఏ వ్యాధియు సోకకుండుట కూడ నేటికిని అవలంబించిన వారియందు కనిపించుచున్నది. హోమియోపతీ సిద్ధాంతమున వ్యాధి నిర్మూలనము, ముఖ్యముగా సోరా నిర్మూలనము మానవజాతికి ప్రసాదింపబడినది. కాని మరల సోరా సోకకుండుటకు కావలసిన మార్గమునకు ఈ శాస్త్రమున నవకాశము లేదు. దానికొరకై ఆయుర్వేద విధానము నాశ్రయింపక తప్పదు.



# ది వరల్డ్ టీచర్ ట్రస్ట్

జగద్గురు పీఠము (ది వరల్డ్ టీచర్ ట్రస్ట్) ఒక అంతర్జాతీయ ఆధ్యాత్మిక, సేవా సంస్థ - దీనిని 1971 నవంబరు 18వ తేదీన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య (మాస్టర్ ఇ.కె) విశాఖపట్టణము ప్రధాన కేంద్రముగా నెలకొల్పిరి.

సమన్వయాత్మక విజ్ఞానమును, దర్శన జ్ఞానమును, తాను నడచిన మార్గమును మాస్టర్ ఇ.కె అనేక గ్రంథములయందు పొందుపరచి, భగవదనుభూతిని సదా పొందు మార్గమును ఆయా గ్రంథముల ద్వారా ప్రసాదించిరి. అట్టి పవిత్రమైన గ్రంథములను 100కు పైగా ఈ సంస్థ ప్రచురించినది.

రోగార్తులకు ఆరోగ్యమును ఉచితముగా అందించుటకు గాను ఆంధ్రరాష్ట్రములో 50 మాస్టర్ హోమియో వైద్యాలయములను నిర్వహించుచున్నది. బాలబాలికలకు ఆధునిక విద్యతోబాటు వేద సంప్రదాయమును కూడా బోధించి, వారిని సత్పౌరులుగా తీర్చిదిద్దుటకు గాను రాష్ట్రములో 8 బాలభాను విద్యాలయములను నెలకొల్పినది.

అంతర్యామి సాధనను సాధకులకు అలవరచి, శాంతియుతమైన సహజీవనమును వారికి నేర్పుటకు గాను అనేక చోట్ల ఈ సంస్థ "మాస్టర్ సీ. వీ. వీ. గురుపూజా ఉత్సవములను" నిర్వహించు సంప్రదాయమును స్థిరపరచినది. సనాతన ధర్మము, ఆరోగ్య విజ్ఞానము, హోమియోపతి, ఆధ్యాత్మిక జ్యోతిషము, గ్రంథ రచనము, యోగ రంగములలో మాస్టర్ ఇ.కె. దగ్గర శిక్షణ పొందినవారనేకమంది జగద్గురు పీఠము ద్వారా విశిష్టమైన సేవల నందించుట జరుగుచున్నది.